ధన గ్రంథ మండలి 123,

# అద్భుత రామాయణము


క ర్త

క వి హం స

**శ్రీ వేదుల వేంకటశాస్త్రి**

అనకాపల్లి





ప్ర కా శ కు లు :

**సా ధ న గ్రం థ మం డ లి, తె నా లి.**



కృతికర్త పితరులు

శ్రీ వేదుల పార్వతీశముగారు

శ్రీమతి వేదుల వేంకటరమణమ్మగారు



శ్రీ కడ్మిసెట్టి యెల్లంసెట్టిగారి
కు॥ పెదవేంకటసూర్యనారాయణగారు



శ్రీ డా॥ భైరవభట్ల వేంకట విశ్వనాథముగారు,
(B. A. G. C. I. M. M. D. S.)
ఫిజిషియన్ అండ్ సర్జన్.



కీ॥ శే॥ శ్రీ వుప్పల పెదవేంకట
రమణయ్య శ్రేష్ఠిగారు



కీ॥ శే॥ డా॥ శ్రీ గండికోట వరా[illegible]
నరసింహముగారు

# విషయసూచిక

# పరిచయము

ఆచార్య డా. దివాకర్ల వేంకటావధాని,
M A (Hons ) Ph D.

మిత్రులు కవిహంస బిరుదాంకితులు శ్రీ వేదుల వేంకటశాస్త్రిగారు రచించిన శ్రీమదద్భుతరామాయణము నాద్యంతము చదివి యానందించితిని. ఈ రామాయణమున కద్భుత మను విశేషణము సార్థకమై యున్నది. దీనిని వాల్మీకి మహర్షి తన శిష్యుఁడైన భారద్వాజున కెఱింగించెను. వాల్మీకి తొలుత శతకోటి విస్తృతమైన రామాయణమును జెప్పెనఁట! అది బ్రహ్మలోకమున నిల్చెనఁట! భూలోకప్రచారము పొందిన చతుర్వింశతిశ్లోక పరిమిత మైన రామాయణమునఁ జెప్పబడనిదియు, బ్రహ్మలోక రామాయణమున విస్తృతమైనదియు నగు విశేష విషయమును జెప్పు మని భారద్వాజుఁడు ప్రార్థింప వాల్మీకి దయామేదురుఁడై యాతని కీయద్భుతరామాయణమును దెల్పెను. "ప్రకృతికి మూలభూతమయి పావన మైనది సీత" యనియు "ఇమ్మహాదేవి సీతమ్మయె యీచరాచర జగద్రూపాన వెలయుచుండు" ననియు నిందు చక్కఁగాఁ బ్రతిపాదింపఁ బడినది. వాల్మీకి శ్రీమద్రామాయణమును "సీతాయాశ్చరితమ్ మహత్" అనుటకుఁ గారణమేమో దీనిని బఠించిన వారికిఁ దేటతెల్లమగును.

ఈ రామాయణము త్రిశంకుసుతుఁడగు నంబరీషుని చరిత్రముతో నారంభించుచున్నది. అంబరీషుని భక్తికి మెచ్చి విష్ణు వాతనికిఁ జక్ర మొసంగెను. అంబరీషునకు శ్రీమతి యను

కూఁతు రుదయించెను. నారద తుంబురు లామెను వలచిరి. స్వయంవరకాలమున విష్ణుమాయచే వారిరువురికి వానరముఖములు కలిగెను. శ్రీమతి వారిని వరింపక వారినడుమ నిల్చిన విష్ణువునే వరించెను. ఈ యవమానమున కంతకును విష్ణువే కారణమని యెఱింగి యా మునులు—

మాధవా! మాయఁ జొప్పించి మనుజదేహ
ధారివై శ్రీమతిని గొంచుఁ దరలినాఁడ
వౌట నంబరీషుని వంశమందు నీవు
దాశరథి వౌము మాయలోఁ దగులుకొనుము. 36—16

అని శపించిరి. ఈ శాపము కారణమున విష్ణువంబరీషవంశమునందుఁ బుట్టిన దశరథునికిఁ గుమారుఁడై జనించెను.

ఇందలి సీతాజననవృత్తాంత మద్భుతమైనది. నారదుఁడు లక్ష్మీనారాయణుల సభలోఁ దనకు జరిగిన యవమానమునకుఁ గోపించి "బెత్తములు వట్టి రాక్షసాభీలవృత్తి దాసదాసీజనంబయుక్తముగ నన్నుఁ దరుమఁజేసిన యీలక్ష్మి దానవాన్వయమున జన్మించుఁగాక!" యని లక్ష్మిని శపించెను. రావణుని భార్య మండోదరి భర్త యన్యస్త్రీసక్తుఁడై తన్నుపేక్షించుటకు వంతనొంది మరణింప నెంచి విషమను నుద్దేశముతో మునీశ్వర రక్తపూరితమైన కలశము నందలి ద్రవమును ద్రావెను. ఆమె చావలేదు సరిగదా గర్భవతియయ్యెను. భర్త తన్ను శంకించునని భయపడి తీర్థయాత్రామిషమున నామె కురుక్షేత్రమున కరిగి యచ్చట నొక యాడశిశువును బ్రసవించెను. తరువాత నా శిశువు నొక మందసలో నుంచి గోతిలోఁ బాతి

పెట్టి యేగెను. తరువాత మిథిలాధిపతియైన జనకుఁ డచ్చట యజ్ఞము చేయఁదలంచి భూమి త్రవ్వఁగా నాపెట్టె కనఁబడెను. ఆకాశవాణి యాపెట్టె యందలి కన్యను గూఁతుఁగా గ్రహింపు మని యాతని కుపదేశించెను. అతఁడట్లే చేసెను. తరువాతఁ గొన్నియేండ్లకు శివధనుర్భంగము గావించి రాముఁడామెను బెండ్లాడెను.

ఇందలి కథలో సీతివిస్తృతమైనదియు, సీతారాముల జననమునకుఁ గారణమైనదియు, నారదిగానమాత్సర్య వృత్తాంతము. ఆంధ్రప్రబంధములలోఁ గల్పితకథా మయమగుటచేఁ బ్రత్యేక గౌరవమునకుఁ బాత్రమగుచున్న కళాపూర్ణోదయ మున నారదగాన మాత్సర్యవృత్తాంత మున్నది. ఈ అద్భుత రామాయణమునకు మూలమైన సంస్కృతాద్భుత రామాయణము ప్రాచీనమును వాల్మీకకృతమును నగు పింగళిసూరన్న యాకథ నందుండి గ్రహించెనని చెప్పవలసివచ్చును. ఇందలి కథకును కళాపూర్ణోదయ మందలి కథకును గొంత భేద మున్నను సాదృశ్య మధికముగా నున్నది. అందుచే పింగళి సూరన్న కళాపూర్ణోదయమున కద్భుతరామాయణ మొక మూలమని భావింపవచ్చును. కౌశికాభ్యుదయము, భువనేశ్వరుని చరిత్ర అనునవి యిందలి యుపాఖ్యానములు.

వాల్మీకిరామాయణమున లేకుండ నిందుఁ గల మఱి యొక వృత్తాంతము సహస్రకంఠరావణచరిత్రము. అతనితో యుద్ధ మొనరించు సమయమున శ్రీరాముఁడు మూర్ఛిల్లఁగా సీత పరాశక్తిరూపిణియయి సహస్రకంఠ రావణుని సంహరించెను. బ్రహ్మకృతదేవీస్తోత్రము పఠించిన సీతాదేవి యతి

లోక శక్తిసామర్థ్యములు గోచరించును. ఈ రామాయణము నందలి చివరిభాగము లద్భుతరసమయములై యీ మహాదేవి మహాత్త్వమును వివరించుచున్నవి. గ్రంథాంతమున సీతా సహస్ర నామస్తోత్రము కూర్పఁబడినది. "అంబరీషచరిత్ర మాధారముగఁ జేసి శ్రీమతి విష్ణుల ప్రేమగాథ"(268-26) అను పద్యమునుండి రెండు మూఁడు పద్యములలో నీ గ్రంథమందలి కథ సంగ్రహముగాఁ జెప్పఁబడినది. ఇందు వాల్మీకి రామాయణము నందలి కథావిధానముకూడ లేకపోలేదు. కవి దాని నతి సంగ్రహముగా సూచించుచు నందులేని యద్భుతవృత్తాంతములను విపులముగా వర్ణించెను.

శ్రీ వేంకటశాస్త్రిగారు దీనిని సంస్కృతమునుండి యనువదించినట్లు తోఁచుచున్నది. మూలము నీ గ్రంథముతో బోల్చిచూచు నవకాశము నాకు లేకపోయినది. అనువాదమయ్యును కవిగారిరచన ధారాళమును, సరసమునై హృద్యముగా నున్నది. వారికథాకథనము ప్రశంసింపఁ దగియున్నది. ఇందలి ధారాశుద్ధితోఁ గూడిన పద్యములను బఠింప నిది యెచ్చటను అనువాదమను భావమును గలిగింపదు. రచన క్రమక్రమముగాఁ బ్రౌఢమును, రసవత్తరమునై చదివినకొలంది చదువవలె నను నుత్సాహమును రేకెత్తించుచున్నది. ఇందచ్చటచ్చట దొరలిన స్వల్పవ్యాకరణ స్ఖాలిత్యములను రెండవముద్రణమున సులభముగా సవరించుకొనవచ్చును. కవిగా రింకను రసవత్తరములైన రచనలు కావించి యాంధ్ర సరస్వతి కభినవాలంకృతులు సమకూర్తురని కోరుచున్నాను.

27—11—71
హైదరాబాదు

దివాకర్ల వేంకటావధాని

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య

జగద్గురు శ్రీ మదభినవ విద్యాతీర్థమహాస్వామి

జగద్గురు మహాసంస్థానము

శారదాపీఠము - శృంగేరి

కవిహంస, శ్రీ వేదుల వేంకటశాస్త్రికి నారాయణస్మరణ పూర్వక శుభాశీస్సులు.

మీ "అద్భుతరామాయణము" అను గ్రంథమును బాగుగా అవలోకించితిమి. కవిత్వము మధురముగను లలితముగను ఉన్నది. గ్రంథమంతయు చదువరులకు మిక్కిలి ఆహ్లాదము కలిగించుచున్నది. మీ కవితాశక్తిని అభినందించుచు మీకు ఇతోధికముగ కవితావ్యాసంగమును జరుపుటకు వలసిన శక్తిసామర్థ్యములను శ్రీ శారదా చంద్రమౌళీశ్వరులు అనుగ్రహింతురుగాక యని మా నారాయణస్మరణపూర్వక శుభాశీస్సులు.

క్యాంపు: శృంగేరి.
24—1—1972

ప్రయివేటు సెక్రటరి
K. నరసింహమూర్తి

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య
జగద్గురు శ్రీ జయేంద్ర సరస్వతీస్వామి
శ్రీ కాంచీ కామకోటిపీఠము - కాంచి

తమరు పంపిన అద్భుతరామాయణ గ్రంథము శ్రీ మహా సన్నిధానమునకు చేర్పించినాము. ఈ గ్రంథమువలన ఆంధ్రులకు మహోపకారముకలదని, శ్రీకామాక్షీ కృపవలన సర్వమంగళములుగలుగు గాక యని శ్రీవారు నారాయణస్మరణములు తెలుపుమనిరి.

మకాం - జాగమండం | ఇట్లు
16—11—1971 | మేనేజరు

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
జగద్గురు శ్రీ కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతి,
శ్రీ విజయవాడ, రాజరాజేశ్వరీ పీఠాధిపతి,
శ్రీ లలితాత్రిపురసుందరీ పీఠాధిపతి
నెల్లూరు శ్రీ గురుదత్తమఠ ధర్మకర్తలు,
బాపట్ల శ్రీ శంకర విద్యాలయాధ్యక్షులు నగు
శ్రీశ్రీశ్రీ త్రివిక్రమరామానంద భారతీస్వాములవా
రొసంగిన శుభాశీఃపూర్వక అభిప్రాయము.

శ్రీరస్తు చిరంజీవి కవిహంస, వేదుల వేంకటశాస్త్రిని నారాయణస్మరణపూర్వకముగా ఆశీర్వదించి వ్రాయునది.

శ్రీమద్వాల్మీకి కృతమని చెప్పబడు "అద్భుతరామాయణము" నకు గద్యపద్యాత్మకమైన ఆంధ్రానువాదమును పరిశీలించితిమి.

భక్తిమార్గమే పరమావధిగా నిర్ణయించుకొని కాలక్షేపము జేయుచు, సాధకులైన స్త్రీ పురుషులకు ఉత్సాహము ఉద్రేకము, శాంతి నిష్ఠకలిగించు గ్రంథమిది. ఇతర పురాణములలో లేని చక్కని ఆదర్శప్రాయమై భక్తిపూరితములైన పెక్కుకథలు ఇందుగలవు

భక్తిపోషణమే పరమావధిగా నిర్ణయించి యీకవి ఇందలి కథలలో మూలమును మించిన భగవద్వర్ణనలతో అత్యంతరామణీయకముగా సాహిత్యపు విలువలను బోషించుచు ఔచిత్యమును బాటించుచు పాత్రచిత్రణ గావించుటయిందలి ప్రత్యేకవిషయము.

మూలమున సర్గలుగా విభాగముకలిగియుండ భక్తుల యుపయోగార్థము, ఏకథకు ఆకథ బోధపడునట్లు ఆయా శీర్షికలతో విషయమును జేర్చికూర్చి, రచించుట ప్రశంసనీయము. మఱియు ప్రతిశీర్షికయందును కందపద్యముతోను శీర్షికాంతమున విశేషవృత్తములతోడను, ఏతత్కృతిభర్తయైన శ్రీరాముని స్తుతించుట చి॥ కవిహంసయొక్క శ్రీరామభక్తికిని, కవితానైపుణ్యమునకును నిదర్శనము.

శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును భక్తులైన అర్జునాదులకు బ్రదర్శించెను, అట్లె శ్రీరాముడును, పరశురామునకును, ఆంజనేయునకును దన విశ్వరూపమును జూపించినట్లు ఈ గ్రంథమునఁ జెప్పబడుట విశేషవిషయము. జగన్మాతయైన సీతామ్మవారు సాధుపతివ్రతగా చెప్పుటయేగాక ఆజననీ శక్తిస్వరూపమును సహస్రకంఠరావణ సంహారసందర్భమున జూపించినట్లు రచించిన యీఘట్టము చదువరుల కాకర్షణీయమై, యద్భుతమై యీ కవియొక్క ప్రజ్ఞావిశేషములను వెల్లడి చేయుచున్నది.

ఇందలి కథలు, ఉపమానములు, ఆబాలగోపాలము నకును ఉపయోగములు. ముక్తికి సోపానములు ఇందలి వేదాంతవిషయములుగూడ సులభగ్రాహ్యములు. నీతికి దర్ప ణములు. ఆనందమున కాలవాలములు.

శ్రీ రాజరాజేశ్వరీ అమ్మవారిని ప్రార్థించి. చిరంజీవి యీ కవిహంసను నారాయణస్మరణపూర్వకముగ ఆశీర్వదించు చున్నాము.

కురుత్తాళం ఇట్లు
శ్రీ సిద్దేశ్వరీపీఠము శ్రీ త్రివిక్రమ రామానందభారతీస్వామి

---

# ఆనంద వచనములు

## శ్రీరామకృష్ణానందస్వామివారు

సంపాదకులు గీతావాణి

రామాయణము శతకోటివిస్తృతము, రామమహిమ అనంతకోటివిస్తృతము. భక్తులకు రామనామము భద్రశర ణ్యము, భక్తకవులకు రామాయణరచన భవ్యవ్రతనిష్ఠ,

వేదుల వెంకటశాస్త్రిగారిని నేను బాగా యెరుగుదును, "అమానీ మానదో మాన్యః", ముముక్షుల భక్తుడు. ఆయన యీ అద్భుతరామాయణాన్ని పద్యానువాదంచేసి ఆంధ్రజనతకు అర్పించినారు, కవి ధారాశుద్ధికలవాడు. అసలు రామాయణములోని అద్భుతకథలు దీనిలో యెన్నో ఉన్నాయి. పేరే అద్భుతరామాయణము కదా! ఆ కథలయొక్క ఔచిత్య మును ఆవశ్యకతను గూర్చిన చర్చలిట అవసరములేదు గనా

యిత మూలగ్రంథానికి అధీనుడు. నేటివరకు మనకు అలభ్యమై వున్న ప్రాచీనుల జ్ఞానసంపదను మనకు అందజేసినారు. ఆయనకు శుభాకాంక్షలు.

గ్రంథము సీతయొక్క ఆధిక్యతను వర్ణించింది. సీత పరాశక్తి. త్రిమూర్తులకు ఆమె పైది విశ్వోద్భవ స్థితివిలయా లకు ఆమె మూలకారణము భారతీయతత్త్వచింతన ధారలో దేవీ ఉపాసనకు ఒకవిశిష్టస్థానం వుంది.

రామాయణ మంతయు తనకథేనని శ్రీ సీతారామాంజ నేయ సంవాదమునందు సీతాదేవి చెప్పుకొంది. శ్రీరాముడు శుద్ధబుద్ధపరబ్రహ్మము. ఆయన నిర్విశేషుడు, పరబ్రహ్మము శక్తితో కూడి సర్వశక్తుడు సర్వకర్త సర్వభర్త సర్వహర్త అయ్యాడు, ఈశ్వరుడయ్యాడు, ప్రభువయ్యాడు.

"భవాని! త్వత్పాణి గ్రహణపరిపాటీ ఫలమిదం" ఇదంతా నీ హస్తవాసి మహిమయమ్మా అంటూ శ్రీ శంకరా చార్యులవారు ఈమాటనే తమ దేవీస్తోత్రంలో సెలవిచ్చినారు. వాల్మీకిమహర్షి కూడ "సీతాయాశ్చరితం మహత్" అని అన్నాడేకాని రామునిచరిత్ర అని అనలేదే.

కంబ రామాయణంలో ఒకవృత్తాంతముంది. కుశలవులు రాముని ఆస్థానంలో రామకథాగానం చేస్తున్నారు. సింహాసనా సీనుడైన శ్రీరాముడు మెల్లగ లేచివెళ్ళి కుశలవులవద్ద కూర్చొ న్నాడట. "తనకథను వినేందుకు ఆయనకు కూడ ఎంత ఉత్సు కత"— అని వారు వీరు అనుకొనుచున్నారు. "అయ్యా! ఇది నాకథ కాదు, పరమసాధ్వీమణి సీతాదేవికథ."

శ్రీసీతారాముల అనన్యభక్తుడు వేదుల వెంకటశాస్త్రి, పావనరామచరితను రచించి తమ వాక్కును చిత్తాన్ని పరిశుద్ధము చేసుకొన్నారు. శ్రీరామచంద్రప్రభువు వారికి తమ దివ్యతత్త్వసాక్షాత్కారానుభూతిని ప్రసాదించి భక్తిని అనుగ్రహించుగాక.

మకాం - సోమశిలక్షేత్రం
నెల్లూరు జిల్లా
(విరోధికృత కార్తికపౌర్ణమి)

శుభాశీస్సులతో
శ్రీరామకృష్ణానందస్వామి

---

# శుభాశీస్సులు

## శ్రీ సత్యానందమహర్షులవారు

**శ్రీ సత్యానందాశ్రమము, ఇనమడుగు, నెల్లూరుజిల్లా.**

మన పుణ్యభారతదేశములో శ్రీసీతారాములు ఆరాధ్యదైవతములు. శ్రీరామమందిరము లేని నగరమును గాని, గ్రామమును గాని మన మీదేశములో చూడము. అయితే శ్రీరామచంద్రుని పరమపునీత చరిత్రను, బహుమంది కవీశ్వరులు, ఆయాభాషలలో పద్యగద్యరూపములుగ రచించియున్నారు. మన ఆంధ్రభాషలోగూడ కవి పండితు లనేకులు శ్రీమద్రామాయణ కథామృతమును గద్యపద్యాత్మకముగను, కీర్తనలుగను, బుర్రకథలుగను పామరులకు సయితము సుబోధకమగునట్లు వ్రాసియున్నారు. ఎందరెందరు కవులు, విద్వాంసులు రామాయణగాథను వివిధరీతుల రచించినను మరల

నింకొకరు భక్తితన్మయతతో వ్రాసిన నది నూతనముగనే గన్పట్టును అట్టి మహాశక్తి భగవత్కృపలయందు కలదు.

మేము అనకాపల్లిలో అనేకపర్యాయములు గీతోపన్యాసముల నిచ్చియుంటిమి. అపుడు భాషాప్రవీణ, 'కవిహంస' శ్రీ వేదుల వేంకటశాస్త్రిగారు శ్రద్ధతో మా ఉపన్యాసములను వినుచూ వారు రచించిన గ్రంథములను మా కొసంగుచు మాతో సంభాషించు చుండెడివారు. 29-8-1971 నుండి 3-9-71 వరకు అనకాపల్లిలో శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవ్యాలయములో మేము గీతోపన్యాసము లిచ్చితిమి. 1-9-71 తేదిన సాయంకాలము 4-30 గంటలకు శ్రీశాస్త్రిగారు తాము తెలుగు గద్య పద్యములలో అనువదించిన అద్భుతరామాయణమును మా ఆశీర్వాదపూర్వకాభిప్రాయము కొఱకు యిచ్చిరి. మేమా గ్రంథమును స్థాలీపులాకన్యాయముగ చూచితిమి. దీనియందు పద్యములు సరళములుగను, మధురముగను, భక్తిప్రధానముగను నున్నవి. ఈ కవితను మానవమాత్రులకు అంకిత మొసంగక జగత్ప్రభువైన శ్రీరామచంద్రున కంకితమొనర్చుట విశిష్టాంశము. మున్ముందీకవి ప్రజలలో భక్తిజ్ఞానములను కల్గించు గ్రంథములను వ్రాసి ఆంధ్రలోకమునకు మహోపకారి మొనర్తురుగాక! అట్టిశక్తి సామర్థ్యములను శ్రీరామచంద్ర ప్రభువు అనుగ్రహించుగాక. వీరి సాహిత్యసేవయను సదుద్యమమునకు మా అనంతాశీర్వాదములు తోడ్పడుగాక!

**2—9—1971**

**మకాం : అనకాపల్లి**

సత్యానంద



14

# అభిప్రాయము

కవిసమ్రాట్, కళాప్రపూర్ణ, పద్మభూషణ, ఆంధ్రాస్థానకవి

*డా. విశ్వానాథ సత్యనారాయణగారు*

శ్రీ వేదుల వేంకటశాస్త్రిగారు రచించిన అద్భుతరామాయణమును చదివితిని. లోకమునందు రామాయణకథ బహువిధములుగా ప్రచురితమై యున్నది. అద్భుతరామాయణము, ఆశ్చర్యరామాయణము, అధ్యాత్మరామాయణము, యోగవాసిష్ఠము ఇట్టివెన్నో రామాయణములు గలవు. అందులో నిది యొకటి.

ఈ రామాయణము మహాకథ నెన్నివిధములుగా వ్రాసినను నెట్లువ్రాసినను భగవత్కైంకర్యమే యగును గదా అందులో నొకచక్కని శైలి భాషాజ్ఞానము నిర్దుష్టముగా నుండునట్లు వ్రాయుట జరిగినచో భగవంతుని యనుగ్రహమును గూర్చి చెప్పవలయునా ?

రచనలో అనంతములైన విధములుండును. ఈ వేంకటశాస్త్రిగారి రచన యొకమాధుర్యమునకు నిలయమని చెప్పవలయును. పద్యముయొక్క ఒకయెత్తుగడ యొకదింపుగడ ఒకసమత్రి ము విలక్షణముగా కొందరియందుండును. మాటలకూర్పే విలక్షణముగా నుండును. పలుకుబడి విలక్షణముగా నుండును. "ఈ విశ్వంబున నెల్లవారలను నే నేడ్పించుచున్నాను. నన్నే వాఁడుం గనులెత్తి చూడఁగలఁడే ?" రావణశబ్దము మీద ఇట్లన్నవాఁడు పూర్వము లేఁడు. వ్యుత్పత్తి అదియే. ఈ గ్రంథమునం దిట్టివి వందలు చూపవచ్చును. వీరిపద్యరచన నాకు

ప్రదము గా నున్నది. వీరి గ్రంథము కూడ నాకు చాలసుకుమా ృముగా నున్నది. వీరికి పరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్య భాగ్యముల నొసంగుఁగాక !

విజయవాడ
మకాం. సకాపల్లి (సం) విశ్వనాథ సత్యనారాయణ
23—1—72 M A

ఆర్ష విద్యా భూ ష ణ

శ్రీ జటావల్లభుల పురుషోత్తము M- A

ఆంధ్రప్రదేశ్ విశ్వహిందూపరిష దధ్యక్షులు

కవిహంస శ్రీ వేదుల వేంకటశాస్త్రి తెలుగు కవనములో పెద్ద హస్తము. ఆస్తిక్య మాతని కవితకు ప్రధాన ప్రేరకము. విష్ణుసహస్రనామ వివరణాదులను కళాశోభితమైన కవితలో వెలయింప చేసిన దిట్ట యితఁడు.

ఈ యద్భుతరామాయణములోని కవిత సర్వవిధముల శోభాయమానమై సమకాలికకవులలో నీతిని కున్నతస్థానమును గూర్చుచున్నది. కవితకు ఆవేశము ప్రాణము. ఈతని భక్తి పరవశత పాఠకులను మైమరపించును. ఛందో వ్యాకరణాదులలో నీతడు చూపు పరిశుద్ధి యనన్య సామాన్యము. ధారాశుద్ధి, ప్రసాదగుణము ఈ గ్రంథము నెత్తిన పిమ్మట ముగించువఱకు మనలను దించనీయవు.

ఈ గ్రంథము ఆంధ్రాళిలో విశేషవ్యాప్తి నొందగలదని నా విశ్వాసము.

కాకినాడ జటావల్లభుల పురుషోత్తము
12—11—71

## 16

ఓమ్ నమః కామేశ్వర్యై

కవిసార్వభౌమ, స్వరాజ్యకవి,

*బ్ర॥ శ్రీ వడ్డాది సీతారామాంజనేయ కవిగారు*

# ఆశీర్వాద - హంసమాల

హంసరుతము : శ్రీమ జ్జానకియు, నా శ్రీరాముం డాంధ్రకవిహంసో
ద్దామశ్రీరుతము తేఁపన్ బ్రేమన్ దత్కృతినినోమున్

కం॥ శ్రీమీరంగా నద్భుత రామాయణ పద్యకావ్యరాజము సీతా
రాముల కంకిత మిడితివి ప్రేమన్ నినుమనుప సుకవి
వేంకటశాస్త్రీ !

గీ॥ ఎన్నో కావ్యమ్ములను రచియించి యుండి
నావు కాని యన్నింటఁ గన్న కిదెసుమ
జానకీరామకథల నెసంగుచుంట;
నోయి కవిహంస! మాన్యత నొందినావు.

మ॥ నవమైగ్రాలదె యెవరెన్ని గతులన్ వర్ణించినన్ గాని, రా
ఘువదివ్యాద్భుతగాథ? యెందుకథ కీగణ్యత్వ మెందున్నదే?
భవసంతారక మంత్రరాజమిదె; యబ్బా! తద్రహస్యజ్ఞతన్
గవివై వేంకటశాస్త్రి! ధన్యతనుబొందన్ జాలితీ వి త్తఱిన్.

శా॥ సీతారాములు సుప్రసన్నమగు దృష్టిన్ నిన్ను వీక్షించుచున్
చేతఃప్రీతిని నాయువున్ సుకవితన్, శ్రీవైభవంబున్, సుఖా
ప్లాతంబైన భవంబు, భాగ్యచయమున్, విస్తారసద్వంశ వి
ఖ్యాతిన్ గూర్చుచుఁ బ్రోతు రింపుతనరంగా
నాంజనేయుంబలెన్.

కం॥ శ్రీదయితు రామకథ నాహ్లాదముతోఁ బుట్టుపుట్టువటు
చెప్పితివో
వేదుల వేంకటశాస్త్రీ! నీదీక్ష బుధ ప్రశంసనీయము గాదే?

ఉ॥ మాకవితాసరస్వతిని మానసపీఠను బూజసేసి వా
ల్మీకి సదంశతోఁ దెనుఁగు మేదిని భాసిలు భాగ్యమందవే?
లోకము నీకృతిన్ జదివి, గానముగాఁ గలిమాను,
తత్త్వమున్
పీక గ్రహించి మేల్గొనవె వేదుల వేంకటశాస్త్రి సత్కవీ!

చ॥ పరమతవేషభాషలను పంకములోఁ దిగఁబెట్టి భారతో
ర్వరయను కామధేనువును రక్షణసేయఁగఁజాలి ధర్మ తి
త్పరత ప్రజాసమాజ సుహృదంతరసీమలఁబొంగ, రాఘవే
శ్వర చరితమ్మది క్కడిదియె పాడితి విప్పుడు నీవుసత్కవీ!

ఉ॥ పిల్లల ముద్దుపల్కులవి వీనులవిందగుఁగాదె యెంతయున్
దల్లికిఁదండ్రికిన్ కట్టులె ముదంబిడు నతకు గామమూర్తి, కీ
వల్లిన తియ్యనైనదగు వద్భుతకావ్యము తెల్గునందు శ్రో
భిల్లును మాకవింపువికి వేదుల వేంకటశాస్త్రిసత్కవీ!

సీ॥ గంగా ప్రవాహావగాహ మ్మొనర్పంగ
నతిశయించు సుఖమ్ము నందఁజేసె
మలయమారుతముచేఁ దొలఁకు పాలకడలి
యలల నుయ్యాలలతూగలమఁజేసె
తెలుగంటిమ్రాని పూఁదేనెల సోనల
నానునప్పటి హాయి నమరఁజేసె
హంసతూలికల నొప్పారు తల్పముమీఁద
బవళింపనగు వేడ్కఁబ్రబలఁజేసె

గీ॥ నతిశయోక్తులుగావు సత్యమ్ములివ్వి
సుమ్మ యద్భుత రామాయణమ్ము లోని
నీకవిత మామదికి నింపు నిండఁజేసె
సామ వేదుల వేంకటశాస్త్రిసుకవి!

హంసమాల. క్షితి మాశాస్త్రినిన్ గ్రోచుత శ్రీరాముఁడీ యద్భుతరామాయణం బంకితమున్ బొంది ప్రేమన్.

త ణు కు　　　　　　　　　　భవదీయుడు

21—4—71　　　　(Sd) వడ్డాది సీతారామాంజనేయకవి.

# అ భి నం ద న ము

శ్లో॥ భర్జనం భవబీజానా మర్జనం గుణసంపదాం,
తర్జనం యమదూతానాం రామరామేతి గర్జనం.

జననమరణరూపమైన సంసారాంబుధిలోఁబడి పారమెఱుఁగరాక యుక్కిరిబిక్కిరి యయి కొట్టుమిట్టాడు జీవలోకమెవని పేరెత్తి పిలిచినంతనే యిడుములు గడచి గట్టెక్కుచున్నదో యాతడే రాముఁడు. సర్వలోకములకు నుత్పత్తి విలయములను ఉన్మేష నిమిషములతో గల్పింప సమర్థుఁడైన యా భగవంతుని శ్రీచరితమే రామాయణము.

భారతావనియం దన్నికళలు, అన్నివిద్యలు భగవచ్చరణ రాజీవములకు నివేదితములు. కవిత్వము, సంగీతము, శిల్పము, అభినయము- ఇట్లున్న విద్యలన్నియు భగవదభిముఖములుగా పరువెత్తుట భారతీయమైన సంప్రదాయము.

అందువలననే సంస్కృతమున వాల్మీకివిరచితమైన దొక్క-రామాయణమే కాదు, ఎన్నో వెలసినవి. తెనుఁగుననో కవియై కలముబట్టినవాఁడు భక్తిరసధారచే నార్ద్రమైన హృదయ క్షేత్రము కలవాఁడు భగవత్కథాకీర్తనమునకై తనకవితా శక్తిని వినియోగింపక యూరకొనుట పూర్వమున లేదు వర్తమానమున గన్పింపదు, భావియందు గోచరింపదు. అందుచే ఒకే రామచరిత్రమున కెన్నియో అనువాదములు తెనుఁగున వెల్వడినవి.

ఇటీవల శ్రీమద్రామాయణకల్పవృక్షమును రచించిన శ్రీవిశ్వనాథవారు– ఎవరో "వ్రాసిన రామాయణమునే ఏల తెనుఁగున మరల వ్రాయువ లె నన్నమాటకు" సమాధానముగా

సీ॥ మఱల నిదేల రామాయణమన్నచో
నీ ప్రపంచక మెల్ల యెల్లవేళ
తినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్లు
తనరుచి బ్రదుకులు తనవి కాన
చేసిన సంసారమే సేయుచు నున్నది
తనదైన అనుభూతి తనదిగాన
తలఁచిన రాముని తలఁచెద నేనును
నాభక్తి రచనలు నావిగాన ..

అనినారు. అందుచే రామకథాదిచనమునుగూఁ రుక్తి యనుకొనుట దోషము. అన్యవిషయములందు పు దోషము. భగవద్విషయమునఁ బునరుక్తిశోభ అలంక పునరుక్తి లేకపోవుటయే దోషము.

ప్రస్తుతమైన యీ అద్భుతరామాయణమును రచించిన కవివర్యులు శ్రీ వేదుల వేంకటశాస్త్రిగారు శ్రీ సీతారాములయం దేకాంతమైన భక్తిగలవారు. వారు భక్తిరసభరితమైన హృదయమున దోఁచిన ప్రేరణగా నీవఱకే విష్ణుసహస్ర నామస్తోత్రము (పద్యము) 'జానకీత్రిశతి' మున్నగు స్తుతికావ్యములను రచించి ప్రకటించియున్నారు. సహజముగా సంస్కృతాంధ్రములందుఁ బండితులై, ఆంధ్రోపాధ్యాయులుగా మనుగడసాగించుచున్న వారి పాండిత్యము శ్రీరామభక్తి రసదారాసించితమై కవితా పరిమళములను వెదజల్లుట యందాశ్చర్య మేమున్నది.

వారి యీ కావ్యము సరస లలితపదబంధురము. శ్రీరామభక్తి సందీపితము. లోకము కుత్సితకావ్యములను జదివిన చెడును. ఉత్తమకావ్యములను బఠించిన మేలొందును శ్రీ శాస్త్రిగారి యీ కావ్యము ఇహమునం బ్రహ్మానందసహోదరమైన కావ్యానందమును, బరమున శ్రీరామచరణసాయుజ్య రూప బ్రహ్మానందమును బ్రసాదింప సమర్థమైనది.

వారు సహజముగా నార్ద్రమైన హృదయమందలి నెయ్యముచేఁ బ్రేరితులై యీ గ్రంథము మా మండలియం దచ్చునకిచ్చిరి. మండలియందు వారికిఁగల సద్భావమునకుఁ గృతజ్ఞుడను. శ్రీ సీతారాముల యనుకంపావిశేషము వారి యందు ఫలింపవలెనని యాశీర్వదించుచున్నాను.

**విరోధకృత్ - మాఘము** ఇట్లు

**తె నా లి** బులుసు సూర్యప్రకాశశాస్త్రి,

**1972**

శ్రీరామ శ్శరణంమమ

# కృ త జ్ఞ త

దేవభాషలో వాల్మీకికృత మనఁబడు "అద్భుతరామా యణము"నకుఁ దెనుఁగు అనువాదమే యీ గ్రంథము. మూల మున నిరువదియేడు సర్గలుగా నున్న యీ గ్రంథమును నాయా విషయముల ననుసరించి ముప్పది శీర్షికలతో విభాగముఁ జూపెంచి పూర్తిఁజేసితిని. అక్కడక్కడ భక్తి భరితమైన ఘట్టములను, శ్రీరామచరిత్రను దెల్పు కొన్నిసమయములను మూలములో సంగ్రహముగా నున్నవానిని నా మనస్తృప్తి కించుక పెంచి వ్రాసికొంటిని. అట్లే సుదీర్ఘములై పాఠకులకు విసువు గల్పించు కొన్నిఘట్టములను సంగ్రహించితిని. ఈ రచన కేవలము నాహృదయాధినాథుఁడైన శ్రీరామచంద్రుని నాభక్తి లేశముతో సేవించుకొనుటకే గాని, కవితా ప్రతిభను జూపు టకుఁ గాదని సవినయముగా విన్నవించు కొనుచున్నాను. "ఇషుక్షయా న్నివర్తేత నాంతరిక్షతలక్షయాత్। మతిక్షయా న్నివర్తేత నరాఘవ గుణక్షయాత్" అన్నట్లు శ్రీరామచరిత్ర నెందరెందరు మహాకవు లెన్నెన్ని రీతులుగాఁ గీర్తించినను నంత కంత యూహాతీత మహిమావిశేషము లెన్నియేని గలవనుట నిస్సంశయము. ఇందలి భక్తిప్రపత్తులకు సంబంధించిన గాథలు సామాన్యులుగూడ నర్థముచేసికొని గ్రహించవలెనను భావ ముతో నత్యంత సులభశైలిలో వ్రాయుటకు యత్నించిన నాకృషి యెంతవరకు సఫలమైనదియు విజ్ఞులైన పాఠకులు నిర్ణయింతురుగాక!

అద్భుతరామాయణము మూలగ్రంథమును నాలుగు సవత్సరముల క్రిందటనే కీ॥ శే॥ డా॥ శ్రీ గండికోట వరాహ లక్ష్మీ నరసింహముగారు నాయందలి వాత్సల్యమును బురస్కరించుకొని యాంధ్రీకరించవలసినదిగాఁ జెప్పుచు నొసంగిరి. వారిజీవితకాలములో నేనీపని చేయలేకపోయినందుల కెంతయు విచారించుచున్నాను. ఈగ్రంథము నామూలాగ్రముగాఁ జదివియు, నాకావ్యపఠనమునఁ గడుభక్తిశ్రద్ధలతో వినియు నాకుఁ దగినసలహాలనొసంగిన మత్ప్రియమిత్రులు కవిభూషణ, శ్రీ దేవులపల్లి సత్యారావుగారు, కవితాప్రియ, బ్రహ్మశ్రీ రాచకొండ సూర్యనారాయణమూర్తిగారు మొదలైన మహాశయు లనేకులుగలరు. వారందరకును నాహృదయపూర్వకాభినందనలు.

గ్రంథరచన పూర్తికాగానే శ్రీరాముని సంకల్పముచే నేను "అనంతపురము" వెళ్లుట తటస్థించినది. అచ్చట నూతనముగా శ్రీరామాలయ ప్రతిష్ఠ జరిగిన కొన్నినెలలలోనే దత్సన్నిధిని నా నూతన కావ్యమును బఠించుటయు శ్రీరాముని యనుగ్రహమున జరిగినది. అట్టియవకాశము నొసంగిన శ్రీ కాచీభట్ల వరాహనరసింహశర్మగారికిని, స్థానిక శ్రీరామభక్త మహిళా సమాజము వారికిని, అనకాపల్లిలో శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవాలయమున శ్రీదేవి సన్నిధానములో నా కావ్యపఠనము నేర్పాటుచేసిన శ్రీ క. ప. దేవస్థాన సంఘమువారికిని నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథముద్రణలో సంపూర్ణ శాధ్యత వహించి, తను గ్రంథమండలి పేరుతో సర్వాంగసుందరముగా వారికుల కందించిన బ్ర॥ శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిమహాశయులకును, ముద్రణవ్యయమునకుఁ గావలసిన ద్రవ్యము నొసంగిన భక్త సోదరులకును, నీ గ్రంథమును జదివి తమ యమూల్యాశీఃపూర్వకాభిప్రాయముల నొసంగిన జగద్గురు పీఠాధిపతులకును, కవి పండితగురుప్రకాండులకును నా నమోవాకములు.

ఇట్లు
వేదుల వేంకటశాస్త్రి
గ్రంథకర్త

శ్రీరామ శ్శరణంమమ

## ప్రార్థన

శ్రీ దశరథరామా! సీ
తాదయితా! భరత సేవిత పదాబ్జయుగా!
యాదర్శ చరిత్రా! యీ
నీదుకృతిన్ సుకృతిఁజేసి నిలుపవె జగతిన్.

శా॥ శ్రీసీతా! పరదేవతా! నిగమరాశిస్తుత్యా! సద్భక్త హృ
ద్వ్యాసాద్భాసిత చిత్కళా! ధరణిజా! ప్రాచేతసాత్మార్చితా!
దాసీభూత సమస్తవిశ్వ నిచయా ధారాంఘ్రి పద్మా! భవ
ద్దాసున్ సత్కృతినిష్ఠ నన్నుఁ గవితా ధన్యాత్ముఁ
గావింపుమా!

శా॥ శ్రీసీతారఘురామ పాదయుగళీ సేవాపరాత్మా! జగ
ద్భానా! నిర్జరసేవ్య! రాక్షసవనోద్య ద్వీతిహోత్రా, సుహృ
ద్భాసా! భాస్కరశిష్య! సూరినుత విద్యారూప, హే
యాంజనే
యా! సంతోషమయా! మదీయ కవనంబాలించి
పాలింపుమా!

ఉ॥ మోదక పాయసంబులను ముందిడినంతనే పొంగిపోవుచున్
మేదురమైన పొట్టకుఁ బనిన్ గలిగించుచు, విఘ్నరాజ సం
జ్ఞాదృతి వెల్గునర్థమును నాత్మఁ దలంపని బ్రహ్మచారి, స
మ్మోదముఁజూపి నారచనమున్ గొనసాఁగఁగఁ
జేయుఁగావుతన్.

చ॥ చలిమలపట్టియున్ సిరియుఁ జల్లనిపల్కులరాణి నాయెదన్
నిలిచియు నాదుకైతకొకనిల్కడఁ జక్కనిసొంపు నెల్లరున్
దెలిసికొనంగనైన కడుఁదియ్యనిమాటల యింపువిచ్చి, ని
చ్చలు నిటు రామునిన్ గొలుచు జాడలఁ జూపుచు
నోముఁగావుతన్.

చ॥ భువనములన్ సృజింపఁగను బ్రోదియొనర్ప
లయంబుఁజేయఁగాఁ
దివిరి విధాతృ విష్ణు శివ దివ్యమనోహర మూర్తులంది యు
న్న,విమల మవ్యయంబగు సనాతన రామమహో మహంబు నా
భవమును సార్థకంబగుచు వర్థిలఁజేయ భజింతు నాత్మలోన్

శా॥ ముల్లోకంబుల కాదికావ్య మొకటై మోదంబుఁ
గల్పింప, వి
ద్వల్లోకంబునకున్ రసాయనముగా వాల్మీకిచేకూర్చి భా

సిల్లన్ సత్కావ్యలందు నాదిమమై సిద్ధించె రామాయణం
బెల్లన్ మానవకోటి మానవతి యెంతే సుస్థిరంబై మనన్.

క॥ సీతారామ మహాత్త్వము
వాతాత్మజు భక్తి నెన్న ప్రస్తుతిఁ చితా
రీతికి నాద్యుండగు ప్రా
చేతసు వాల్మీకి నతని శిష్యులఁ గొలుతున్.

ఉ॥ ముద్దులమూటగట్టు నెఱమోవిమునఁ బొమరులిచ్చు
సొమ్ములన్
వద్దనకుండఁ దాల్చుచుఁ బ్రవర్తిలుచున్న తెలుంగుబాలకున్
సుద్దులు నేర్పి యాదివిజ సుందర యూష లలంకరించి బల్
పెద్దఁగఁజేసి నట్టి కవిపేరుల కావ్యాని గొల్తు నన్నయన్.

ఉ॥ రాముని పూజనంబులను రాముని తారకనామ సస్మృతిన్
వేమఱు రామగానముల వీనుల వింపొనరించి మించుటన్
నేమముగాఁగ నాంధ్రజననీమణి వేంకటరత్నమాంబ న
న్నోమి శుభాశిషంబులిడ నుత్కటభక్తి నమస్కరించెదన్.

ఉ॥ శ్రీకర ధర్మబోధనలఁ జేయుచు భాగతత్త్వ బోధలన్
వాకులు జన్మకర్మములు భవ్యతసార్థకతన్ జెలంగ, ని
ర్భీకముగాఁ బ్రచార మొనరించిన వేదుల పార్వతీశ్వరున్
బ్రాకటభక్తి మ్రొక్కి పితృపాదుని సద్గురునిన్ భజించెదన్.

చ॥ తెలుఁగున సంస్కృతంబున సుధీవరులెల్లరు మెచ్చుకొన్న ని
స్తులకవితావిశారదుఁడు దుష్కర ప్రాణిని శాస్త్ర బోధనన్
విలసిత నైపుణిన్ వెలయు వేదుల వంశజు రామశాస్త్రినిన్
సలలితభక్తి మ్రొక్కెదను సద్గురుపాదుని నెల్లవేళలన్.

ఉ॥ పండినరామభక్తిగల భవ్యుని వేంకటశాస్త్రివర్యు నా
కొండి పవిత్రవంశజు నకుంఠిత పాండితి రెండు బాసలన్
దండిగఁ గావ్యగానముల ధన్యతఁగాంచిన మద్గురూత్తమున్
నిండుమనంబునన్ గొలుతు నిత్యము భక్తిమెయిన్
గృతజ్ఞతన్

మ॥ ధరవడ్డాది కులాబ్ధిచంద్రుఁడగు సీతారామ పూర్వాంజనే
య రసజ్ఞున్ గవినాన్వయాఖ్యముని స్వారాజ్యాజ
ప్రబోధోద్భవున్
సరసోదారవిశేషభాగుభయభాషాకావ్య నిర్మాత స
ద్గురుమూర్తిన్ గయిమోడ్చుచున్ హృది భజింతున్ నన్ను
దీవింపఁగన్.

ఉ॥ శ్రీయుత రామతారక విశేషమెఱుంగు సమర్థరామదా
సాయత సంప్రదాయ మహిమాన్విత మానసుఁడై
యెసంగు నా
రాయణ భవ్య మౌనిజన రాజవరేణ్యున కెల్లవేళలన్
బాయని భక్తి మ్రొక్కెద శుభంకర
రామకృపామృతాప్తికై.

ఉ॥ శ్రీజనకాత్మజా హృదయసేవిత రామపదాంబుజ ద్వయీ
రాజిత భక్తితత్పరుఁడ రామకృపా పరిలబ్ధ సన్మతి
భ్రాజిత సత్కవిన్ సుజన భక్త విధేయుఁడ విస్ఫుర ద్భర
ద్వాజ పవిత్రగోత్రజుఁడ భాసుర వేంకటశాస్త్రి నాముఁడన్.

ఇట్లు

అనకాపల్లి

భాషాప్రవీణ C. C Holder కవిహంస,
వేదుల వేంకటశాస్త్రి

శ్రీ సీతారామచంద్రాంజనేయాభ్యాం నమః

ఓ మ్

# శ్రీరామ త్రైలోక్య మోహన కవచమ్

అస్యశ్రీ శ్రీరామ త్రైలోక్య మోహన కవచ మహా మంత్రస్య, బ్రహ్మాఋషిః, గాయత్రీచందః, శ్రీరామచంద్రో దేవతా, రామ్ బీజం, రీమ్ శక్తిః, రూమ్ కీలకం, మమ శ్రీరామ చంద్ర ప్రసాద సిద్ధ్యర్థే శ్రీరామ త్రైలోక్య మోహన కవచ జపే వినియోగః—రాం, అంగుష్ఠాభ్యాం నమః— రీం, తర్జనీ భ్యాం నమః– రూం, మధ్యమాభ్యాం నమః– రైం, అనామి కాభ్యాం నమః– రౌం, కనిష్ఠికాభ్యాం నమః– రః, కరతలకర పృష్ఠాభ్యాం నమః– ఏవం హృదయాదిన్యాసః లమిత్యాది పంచపూజాం కుర్యాత్.

ఓమ్, ప్రణవోమే శిరః పాతు–తారక బ్రహ్మ రూపధృత్.

ఓ మ్

అనంతో జ్ఞానహంసేందు – ర్నానా మేకాక్షరోఽవతు.

రాం రామాయ నమశ్చాపా – షడ్వర్ణో భుక్తిముక్తిదః॥

రాం రామాయ నమః

పాలం పాయా న్నేత్రయుగ్మ – రామో ద్వ్యక్షర సంజ్ఞికః॥

క్లీం పాయా చ్ఛ్రోత్రయుగ్మ – మేకార్ణో విశ్వభావనః॥

ం

క్లీం రామాయ నమశ్చేతి ముఖంమే పరిరక్షతు॥

క్లీం రామాయ నమః

తారం రామ చతుర్థ్యంతం – క్రోధాస్త్రం వహ్నివల్లభామ్।

అష్టార్ణోఽయం పరోమంత్రో - జిహ్వాం పాతు సదా మమ॥
**ఓం రామాయ ఫట్ స్వాహా**

గుణబీజం తతోమాయాం - హృద్రామాయ తతశ్చ గామ్।
శివోమా రామమంత్రోయం - గండయుగ్మం సదావతు॥
ఓమ్హృద్భగవతే రామచంద్ర - భద్రాఖ్యయా యుతౌ।
అర్కార్ణౌ ద్వివిధౌ మంత్రౌ - రక్షేతాం మమ కంఠరామ॥
రాం, రామచంద్రాయ స్వాహా - అష్టవర్ణో మే భుజద్వయమ్।
**రామ్, రామచంద్రాయ స్వాహా**

శ్రీరామాయ నమశ్చాపౌ - స్కంధౌ పాతు ఖరాంతకః।
**శ్రీరామాయ నమః**

శ్రీరామచంద్రాయ తతో - రక్షోఘ్నాయ నమ స్త్వయమ్।
హృదయంమే సదాపాతు - రఘువంశ సముద్భవః॥
**శ్రీరామ చంద్రాయ రక్షోఘ్నాయ నమః**

రామాజ్ఞాంతం పరాహాస్త్రం - వహ్నిజాయాయుతం మనుః।
వీరస్వరూప రామాఖ్య - సప్తార్ణః పాతు పార్శ్వకే॥
**రామాజ్ఞ కురు స్వాహా**

ఓం శ్రీం హ్రీం క్లీం తతోరాంచ - రామాయేతి నమ స్తథా।
దశాక్షరాఖ్య మంత్రోయం - పురతః పృష్ఠతోఽవతు॥
**ఓం శ్రీం హ్రీం క్లీం రామాయ నమః**

శ్రీపూర్వం జయమధ్యస్థం - త్రిద్విధా రామనామచ।
త్రయోదశార్ణ మంత్రోయం - సదా పాతు మమోదరమ్॥
**శ్రీరామ జయరామ జయజయరామ**

హుం జానకీ వల్లభాయ - స్వాహా త్వవతు మధ్యమమ్॥
**హుం జానకీ వల్లభాయ స్వాహా**

శ్రీరామ భద్రాయ స్వాహా - నాభి మష్టాక్షరోఽవతు॥

**శ్రీరామ భద్రాయ స్వాహా**

ఓం శ్రీం క్లీం రామచంద్రాయ - సీతాయాః పతయేనమః।
సక్థినీ సతతంపాతు - రాక్షసేంద్ర విమర్దనః॥

**ఓం శ్రీం క్లీం రామచంద్రాయ సీతాయాః పతయే నమః**

ఓం రామచంద్రాయ నమో - గుహ్యాంమే పాతు రాఘవః॥

**ఓం రామచంద్రాయ నమః**

శ్రీం రామచంద్రాయ నమః - పాతుమే ఊరుయుగ్మకమ్॥

**శ్రీం రామచంద్రాయ నమః**

ప్రణవం రామచంద్రాయ - స్వాహే త్యష్టాక్షరో మనుః।
పాదయుగ్మం సదాపాతు - వానరేంద్రస్య శ్రీప్రదః॥

**ఓం రామచంద్రాయ స్వాహా**

రామభద్ర మహేష్వాస - రఘువీర నృపోత్తమ।
భోదశాస్యాంత కాస్మాకం - శ్రియం దాపయ దేహిమే॥
ద్వాత్రింశదక్షరో మంత్రో - సర్వాంగంమె సదావతు॥

**"రామభద్ర మహేష్వాస - రఘువీర నృపోత్తమ**
**భోదశాస్యాంతకా స్మాకం - శ్రియం దాపయ దేహిమే"**

శ్రీం సీతాపతయే నమః - ప్రాచ్యాం మాం సర్వదా వతు॥

**శ్రీం సీతాపతయే నమః**

హుం జానకీ వల్లభాయ, స్వాహాఽఽయామ్యాం సదావతు॥

**హుం జానకీ వల్లభాయ స్వాహా**

క్లీం జానకీ వల్లభాయ - స్వాహా ప్రతీచ్యాం సర్వదావతు॥

**క్లీం జానకీ వల్లభాయ స్వాహా**

శ్రీం రఘునాథాయ స్వాహా - కౌబేర్యాం దిశిరక్షతు॥

**శ్రీం రఘునాథాయ స్వాహా**

హుం జానకీ వల్లభాయ, స్వాహాఽఽగ్నేయ్యాం దిశి రక్షతు॥

**హుం జానకీ వల్లభాయ స్వాహా**

ఓం శ్రీం హ్రీం క్లీం భరతాగ్రజాయ రామాయ
క్లీం స్వాహా నైరృత్యాం సర్వదావతు॥

**ఓం శ్రీం హ్రీం క్లీం భరతాగ్రజాయ రామాయ క్లీం స్వాహా**

ఓం రాం శ్రీం క్లీం జానకీ వల్లభాయ స్వాహా
వాయవ్యాం మాం సదావతు॥

**ఓం రాం శ్రీం క్లీం జానకీ వల్లభాయ స్వాహా**

శ్రీ రాం హ్రీం రామాయ స్వాహా - ఈశాన్యాం దిశిరక్షతు॥

**శ్రీం రాం హ్రీం రామాయ స్వాహా**

శ్రీసీతాయై తతస్స్వాహా - రాం రామాయ నమ స్త్వయం।
సీతారామాఖ్య మంత్రోవ్యా - ద్వాదిక్షూర్ధ్వ మధశ్చ మామ్॥

**శ్రీం సీతాయై స్వాహా - రాం రామాయ నమః**

ఓం నమో భగవతే బ్రూయా - చ్చతుర్థ్యా రఘునందనం।
రక్షోఘ్న విశదాయేతి - మధురాయ సమీరయేత్॥
ప్రసన్న వదనాయేతి - పశ్చా దమిత తేజసే।
భలాయ పశ్చా ద్రామాయ - విష్ణవే తదనంతరమ్॥
ప్రణవాది నమోంతోఽయం - మాలామంత్ర ముదీరితం।
రాజస్థానే సదాపాతు - రఘువంశ సముద్భవః॥

"ఓం నమో రఘునందనాయ
రక్షోఘ్నవిశదాయ మధురాయ
ప్రసన్నవదనా మిత తేజసే
భలాయ రామాయ విష్ణవే నమః"

ఉగ్రం వీరం మహావిష్ణుం – జ్వలంతం సర్వతోముఖం।
నృసింహం భీషణం భద్రం – మృత్యుమృత్యుం నమామ్యహమ్॥
రామానుష్టుభ మంత్రోయం – ఛాయా త్వాపత్రయాచ్చ
మామ్॥

"ఉగ్రం వీరం మహావిష్ణుం – జ్వలంతం సర్వతోముఖం
నృసింహం భీషణం భద్రం– మృత్యుమృత్యుం నమామ్యహమ్"
లం లక్ష్మణాయ నమశ్చాసౌ – దినాద్యే పాతుమాం సదా
**లం లక్ష్మణాయ నమః**
భం భరతాయ నమశ్చాసౌ – దినమధ్యే సదావతు॥
**భం భరతాయ నమః**
శం శత్రుఘ్నాయ నమః కాలే – తృతీయే పాతుమాం సదా॥
**శం శత్రుఘ్నాయ నమః**
పాయా ద్దినాంత్య యామేతు–శ్రీం సీతాయై స్వాహేత్యయమ్॥
**శ్రీం సీతాయై స్వాహా**
పూర్వం నమః పదం చోక్త్వా – తతో భగవతే పదం।
ఆంజనేయపదం ఙ్గేంతం – మహా బలపదం తథా॥
వహ్నిజాయాంత ఏషస్యా – న్మంత్రో హనుమతః పదం।
అష్టాదశాక్షరో మంత్రో – నిశాజా సర్వసిద్ధిదః॥
**ఓం నమో భగవతే ఆంజనేయాయ మహాబలాయ స్వాహా**
తారం శ్రీశక్తి స్మరభూ – స్వబీజం గణకం వదేత్।
ఙ్గేంతం వరాంతం వరదం – సర్వయుక్త జనంచమే॥
వశంచేతి వదే త్పశ్చా – దానయే దగ్నివల్లభాం।
అష్టావింశ త్యక్షరోయం – మహాగణపతే ర్మనుః

రామాంగ మంత్రరాజోఽయం - మాం నిశీథే సదాఽవతు॥

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద

సర్వజనం మే వశమానయ స్వాహా"

తారం ఘృణి స్సూర్యపద - మాదిత్యో మితిచోద్ధరేత్।

ఏవ మష్టాక్షర సూర్య - మంత్రోఽయం సముదీరితః॥

నిశా తృతీయ భాగేతు - సమంతా ద్రక్షతు స్వయమ్॥

ఓం ఘృణి సూర్య ఆదిత్యోమ్

సాంతోఽనుగ్రహ సంయుక్తో - బిందుభూషిత మస్తకః।

ప్రాసాదాఖ్య మనుః ప్రోక్తో - భక్తానాం సురపాదపః।

నిశాంత్యయామే మాం పాయా - చ్ఛ్రీరామాంగ ప్రధానకః॥

హంసః ఇతివా

సర్వస్థానేషు కాలేషు - పాతుమాం రఘునందనః।

వదే ద్దాశరథాయేతి - విద్మహేతి పద స్తతః॥

సీతాపదం సముద్ధృత్య - వల్లభాయ వదే త్తతః।

ధీమహీత్యథ తన్నోఽథ - రామశ్చాపి ప్రచోదయాత్

ఏషా స్యాద్రామ గాయత్రీ - సర్వావస్థాసు పాతుమామ్॥

"దాశరథాయ విద్మహే - సీతావల్లభాయ ధీమహి

తన్నో రామః ప్రచోదయాత్"

నకులీశోఽగ్ని మారూఢో - వామనేత్రాగ్ర సోఽథవా।

భువనేశీ సమాఖ్యాతా - భుక్తి ముక్త్యేక సాధనా।

సర్వత్ర సర్వకాలేషు - పాయా న్మాంచే ష్టదాయినీ।

హ్రీమ్

# ఫ ల శ్రు తి

శ్లో॥ ఇతి తే కథితం దేవి - సర్వలోకైక విగ్రహం।
త్రైలోక్య మోహనం నామ - కవచం బ్రహ్మపూజితమ్॥
ప్రాతఃకాలే పఠేద్యస్తు - సోఽభీష్టఫల మాప్నుయాత్।
పూజాకాలే పఠేద్యస్తు - కవచం సాధకోత్తమః॥
కీర్తి శ్రీకాంతి మేధాయు - ర్వృద్ధిర్భవతి ధ్రువం।
రామమంత్ర మయంబ్రహ్మ - కవచం మన్ముఖోదితమ్॥
గురుమభ్యర్చ్య విధివ - త్పురశ్చర్యాం సమారభేత్।
అష్టోత్తరశతం జప్త్వా - దశాంశం హవనాదికమ్॥
తత స్సుసిద్ధకవచం - సర్వకార్యాణి సాధయేత్।
మంత్రసిద్ధి ర్భవేత్తస్య - పురశ్చర్యా విధానతః॥
గద్యపద్యమయీ వాణి - తస్యవక్త్రే ప్రవర్తతే।
వక్త్రే తస్య వసేద్వాణి - కమలా నిశ్చలాగృహే॥
పుష్పాంజల్యష్టకం దత్వా - మూలేనైవ పఠేత్సకృత్।
దశవర్ష సహస్రాణాం - పూజాయాః ఫలమాప్నుయాత్॥
విలిఖ్య భూర్జపత్రేతు - స్వహస్తం ధారయేద్యది।
కంఠేవా దక్షిణేబాహౌ - సకుర్యా త్స్వవశంజగత్॥
త్రైలోక్యం క్షోభయేత్యేవ-త్రైలోక్యం విజయీభవేత్।
తద్గాత్రం ప్రాప్య శస్త్రాణి - బ్రహ్మాస్త్రాదీని యానివై॥
మాల్యాని కుసుమానీవ - సుఖదాని భవంతిహి।
స్పర్ధ ముత్సృజ్య భవనే - లక్ష్మీ ర్వాణీ ముఖేవసేత్॥

ఇదం కవచ మజ్ఞాత్వా - యోజపే ద్రామమంత్రకః।
శతలక్ష ప్రజప్తోఽపి - నమంత్ర స్సిద్ధిదాయకః॥
నశస్త్రఘాత మాప్నోతి-నోఽచిరా న్మృత్యుమాప్నుయాత్
తస్మా త్సర్వప్రయత్నేన - కవచం ధారయేత్సుధీః॥

ఇతి శ్రీ బ్రహ్మయామళే ఉమా
మహేశ్వర సంవాదే శ్రీరామ
త్రైలోక్య మోహనంనామ
పంచమోధ్యాయః
సంపూర్ణమ్.

గమనిక -

ఈ మహా మంత్రమును గురూపదేశమును పొంది క్రమ పద్ధతిగా జపించుట సర్వశ్రేయము.



శ్రీరామ శ్శరణంమతు

# కృతి సమర్పణ

కం॥ శ్రీరామభక్తి మహిమోదార సమాజ ప్రతిష్ఠితా! వరదా! సీ
తారామ! యనంతపుర శ్రీరాజ న్మారుతినగరీ శుభవాసా!

ఉ॥ సీతను భూమిజాత నెటు చేకొనినావో యదే విధాన మ
త్ప్రాతిమతిన్ జనించి యటుముగ్ధత నొప్పి యనన్యచిత్తయై
యీతటి నీపదాబ్జములనే గతియంచుఁ దలంచి మించు నా
కైతను నీవు గైకొనుచుఁ గావవె రామ! శ్రితామరద్రుమా!

శా॥ నీవేయిచ్చిన సత్కవిత్వపుఁగళన్ నీపాద పద్మద్వయీ
సేవాదీక్ష సమర్పణంబిడుట నాక్షేమంబు ధర్మంబుగా
భావంబందుఁదలంచి మత్సుకృతమున్ బండింపఁగాఁ గోరికన్
దేవిం జేసికొనంగదే సుకృతి నందింపగదే రాఘవా!

శ్రీరామశ్శరణంమమ

# అద్భుత రామాయణము

(ఆంధ్రపద్యానువాదము)

## కావ్యప్రశస్తి

కం. శ్రీ జానకీమనోహర!
రాజిత సుగుణాలవాల! రామనృపాలా!
రాజా! రవికులతేజా!
ద్విజమునినుత పవిత్రదివ్యచరిత్రా! 1

వ. ఒకానొక దివసంబునఁ దమసానదీతీరంబున సుఖాసీనుండైన వాల్మీకిగురువర్యుంగని శిష్యుండైన భారద్వాజమహర్షి వినయ వినమిత శీర్షగత బద్ధాంజలుండై యిట్లనియె

తే. గీ. విజ్ఞులౌ తాము శతకోటివిస్తృతంబు
గాఁగ, రామాయణం బను కావ్యమొకటి
చెప్పియుంటయు నయ్యది సృష్టికర్త
లోకమున నిల్పుటయు విందుమే కదయ్య! 2

వ. మఱియు నోగురుదేవా! భూలోకంబున నిరువది నాలుగువేల శ్లోకపరిమితంబైన రామాయణంబు, దేవబ్రాహ్మణ ఋషిగణంబులచేతను, పితృదేవతలచేతను, చక్కగా గానంబు సేయఁబడుచున్నయది. అట్టి యీకావ్యంబునం జెప్పఁబడనిదియు బ్రహ్మలోక రామాయణంబునఁ విస్తృతంబైనదియు నగు విశేష విషయం బెయ్యది? యట్టి

యపూర్వ కథాశ్రవణంబునం గుతూహలుండనగు నాకద్దానిని
సవిస్తరంబుగాఁ బ్రసాదింపవే! యని ప్రార్థించిన—

తే. గీ. శిష్యవాంఛను వినిన పాచేతసుండు

5

6

ం
వేలసం
ందు; వి
గారికిన్. 7

న్మహ
ప్రకటిత సత్యభాకథన తత్పరతన్ వినుపింతునీకు; ధా
త్రికలన నాకుఁగూర్చు హితతత్త్వఁడవీవు; విధాతృనింటగో
ప్యకము నపూర్వమైనదిది; యాగమతుల్యము విస్మ
యంబునౌ

సీ. సృష్ట్యాదినుండిన సీతయె మూలప్ర
కృతియు మహాగుణాన్వితయుఁ గాఁగ
సకలతపస్సిద్ధి స్వరూపిణియు, స్వర్గ
సిద్ధిస్వరూపిణి శ్రీయుఁ గాఁగ

నైశ్వర్యవంతుల కైశ్వర్యరూపిణి
శీలవంతులకు సౌశీల్యగాఁగ
విద్యాస్వరూప మవిద్యాస్వరూపంబు
నైన బ్రహ్మణ్య కీర్త్యాత్మ గాఁగ

తే గీ. బుద్ధియును వృద్ధియును గుణసిద్ధియు, నలు
త్రిగుణరూపిణియును గుణాతీత గాఁగఁ
ద్రిగుణములు నాత్మఁగాఁ గల్గు దేవిగాఁగ
వినుతులొనరింతు రామెను విబుధజనులు ! 9

సీ బ్రహ్మసంబంధమౌ బ్రహ్మాండమును నిల్పి
కారణంబుల కెల్లఁ గారణమయి
ప్రకృతివికృతులు రూపములుగాఁ గలదయి
చిన్మూర్తి చిద్విలాసినియును నయి
యొనర మహాకుండలిని సర్వమున, నను
స్యూతమై యున్నత శోభినియయి
యిమ్మహాదేవి సీతమ్మయె యాచరా
చరజగద్రూపాన వరలుచుండు

తే.గీ. తత్త్వదర్శినులును యోగధనులు, హృదయ
మందు నీమెనునిల్పియే యందుమిగుల
బిగిసియున్నట్టి గ్రంథినిఁ బ్రిదులఁజేసి
యలమహానంద సామ్రాజ్య మందుచుంద్రు. 10

తే.గీ. ధర్మమున కెప్పుడెప్పుడు దైన్యబాధ
లొప్పునో, యప్పుడే పుట్టుచుండుఁ బ్రకృతి;
ధర్మమున కప్పుడే సముద్ధరణ గలుగు
జానకీరామచంద్రుల జన్మమిట్లు. 11

తే.గీ. రామచంద్రుఁడె సాక్షాత్పరాత్పరుండు
రాముఁడె పరంధాముఁడు, రాముఁడే ప
రమపురుషుఁ డన జానకీరాముల కొక
సుంతయైనను భేదంబు చూడఁబడదు. 12

తే.గీ. రాముఁడే సీత; సీతయే రాముఁడనుచు
నెఱుకఁగల్గు మహాత్ము లెంతేని మృత్యు
బాధలను దాటి, భవవార్ధి పారము గని
వరలుదురు సువ్రతా! భరద్వాజ! వినుము! 13

ఉ. శ్రీరఘురామచంద్రుఁడె యచింత్యుఁడు నిత్యుఁడు జిత్స్వరూపుఁడున్
వారిక సర్వమందిమిడి వర్తిలువాఁడును, సర్వసాక్షి వి
స్తారసమస్తసృష్టికిఁ బ్రధానుఁడుఁ, బెంపలయింపగల్గు, సీ
తారమణీసమేతుఁడని ధార్మికులెల్ల భజింతు రెంతయున్ 15

సీ. కాలు సేతులు లేక గమనవేగముఁగల్గి
సర్వగ్రహణమునఁ జతురుఁడెవఁడొ
కన్నులులేకుండగానె యీయఖిలంబుఁ
గాంచఁగల్గిన మహాఘనుఁడెవండొ
కర్ణయుగ్మంబు లేకనె యెల్లధ్వనివిశే
షముల నాలింపఁగాఁజాలు నెవఁడొ
యీవిశ్వమెల్లఁ దానెఱిఁగియు నొరులచే
నెఱుఁగఁబడకయుండు పరముఁడెవ్వఁ

తే.గీ. డట్టి శ్రీరాముఁడే శ్రేష్ఠుఁడఖిలమునకు
రాముఁడే సర్వలోకపురాణపురుషుఁ
డనఁగ వెలుఁగొందు సీతాలలనను గూడి,
యాతనికి నతులొనరింతు నాత్మ నెపుడు. 15

ఉ. రూపములేని యట్టి పరరూపము లోకము నుద్ధరింపఁగా
భూపతి రామచంద్రుఁడన, భూమిజసీతయనంగ దివ్యమా
రూపములందఁ, దజ్జనన రూపకమైన చరిత్రఁ దెల్పెదన్
బాపములెల్ల వాయఁగ. వినందగు నీవవధానవైఖరిన్. 16

తే.గీ. బ్రాహ్మణుఁడు దీనిఁ బఠియింపఁ బండితుఁడగు,
రాజు దీని బఠించిన రాజ్యలాభ
మొదవు, వైశ్యుఁడు వినినంత నొందుఁ బుణ్య;
మవరవర్ణుఁడు వినిన మహత్త్వమబ్బు. 17

స్వాగతము-శ్రీరఘూద్వహా! సురప్రభుపూజ్యా!
వీరవర్య! రణభీకరమూర్తీ!
సారభక్తజన సన్మునిపాలా!
మారసుందర! రమాధవ! రామా! 18



# అంబరీషచరిత్ర

కం. శ్రీపతి । భూపతి ! వైదే
హీపతి ! రఘుపతి ! స్వభక్తహృదయాధిపతీ ।
నాపతి ! మునితతి వినుత ! సు
ధాపృథులచరిత్ర ! జైత్ర ! తారకరామా ! 1

వ. వాల్మీకి మహర్షి, స్వశిష్యుండును, నిర్మలాంతఃకర
ణుండునైన భారద్వాజ మహర్షింగాంచి మఱియు నిట్లనియె. 2

తే,గీ. ఓ భరద్వాజ । యిక్ష్వాకు శోభనాన్వ
యాబ్ధిచంద్రుని రామ భద్రాఖ్యు జన్మ
కారణము, జానకీ జన్మకారణంబుఁ
బూనిచెప్పెద విను మవధానపరత. 3

కం. పురుషోత్తమ మాహాత్మ్యము
నరయుము పాపౌఘనాశ మందును విశ్వం
భరు నంబరీషచరితము
పరమాద్భుత విష్ణుకథల వరలుచునుండున్ 4

తే.గీ. అలత్రిశంకునికొమరుఁడో నంబరీషుఁ
డను మహారాజుగలఁడు తజ్జననియనఁగ
సర్వశుభలక్షణాన్విత సత్యశౌచ్య
యుతయునై హరిభక్తితోనుండునెపుడు. 5

వ. అట్టి పరమసాధ్వీలలామంబు

సీ. బ్రహ్మాండమనియెడు పద్మంబునన్ బుట్టి
యాదిశేషాఖ్య పర్యంకశయనుఁ
డై; యోగనిద్రాసమారూఢుఁడై మహా
త్ముండయి నారాయణుండనంగఁ
గడఁగి, తమంబుచేఁ గాలరుద్రుండునా,
రజముచేత కనకాండజుఁడనంగ
సత్వముచే సమస్త స్థలవ్యాపకుఁ
డన, నిర్జర నమస్కృతాంఘ్రుఁడగుచు

తే.గీ. వెలుగుచున్నట్టి శ్రీమహావిష్ణుమూర్తి
నెప్పుడు మనమున వాకిల నిచ్ఛమీరఁ
గాయ కర్మలచేతఁ, సంస్కారవిధుల
సతతమర్చించుచుండుఁ ద్రిశంకురాజ్ఞ. 7

చ అరయ, మురారిపూజలకునై, సుమదామములున్ ఫలంబులుం
గరము, సుగంధ పేషణముఁ, గప్పురదీపము, ధూపముల్ మనో
హర పరిధాన మాదివివిధార్థములన్ సమకూర్చుఁ దానె, సా
దరపరిశోభితంబులను దత్పరతామతి నెల్ల ప్రొద్దులన్ 8

తే గీ. శుభకరియుఁ బద్మవతియైన శోభనాంగి
యనవరతమాత్మనలరి, జిహ్వాగ్రసీమఁ
దనుపు, "నారాయణా! యనంతా!" యటంచు
నియమిత వ్రత సుస్వభావయుత యామె. 9

వ. ఇవ్విధంబున నాత్రిశంకురాణి సంకీర్తనంబులను నానా విధ సుగంధపుష్పాక్షతాదులచే శ్రీమహావిష్ణు పూజనంబులను గాలంబు పుచ్చుచుండు. 10

ఉ. దానముచేత, గౌరవవిధానములన్ ధనరత్నరాసులన్
మానసతృప్తిగల్గ, సుగమంబుగ శ్రీహరిభక్తపూజలన్
మానక చేయునామె, తనమందిరమందుఁ బవిత్రశీలయై
మానితవర్తనంబుల రమాపతినాత్మను నిల్పి శ్రద్ధతోన్. 11

వ. ఇట్లనేక వర్షంబులు గతింపఁ గొండొక దివసంబున 12

కం. ద్వాదశిపర్వంబనియను
మోదంబున,నుపవసించి, పుణ్యవ్రతకా
ర్యాదులఁగావించి, హరి
స్వాదుపదనికటమునందు భర్తయుఁదానున్. 13

చ. హరిచరణారవిందముల నారయుచున్ దదధీనచిత్తులై
వరలఁగ, నాత్రిశంకువరపత్నికి నిద్దురవట్టె; శ్రీరమా
వరుఁడు నిజస్వరూపమున స్వప్నమునన్ గనుపట్టి యిట్లనెన్
దరుణి! త్వదీప్సితంబయినదానిని వేఁడుము నేనొసంగెదన్.

ఉ. నావుఁడు నాసతీమణి మనంబలరన్ హరిసన్నుతించి, యో
దేవ! మహాత్మతేజుఁడు, విధేయుఁడు, భక్తుఁడు సార్వభౌముఁడున్
శ్రీవిమలాత్మశుద్ధుఁడు, ప్రసిద్ధినిగన్న స్వధర్మకర్మ దీ
క్షావిభవుండు నాఁదగినసత్సంతునాకునొసంగవే! యనన్

కం. నీకోరిన వరమొసఁగితిఁ
గైకొను మీఫలమటన్న ఘనతరసంతో

పాకలన మేలుకొని, ఫల
మాకరణింగాంచి, మగని కంతయుఁదెలిపెన్. 16

వ. తదనంతరం బద్దేవియు హర్షోల్లసిత హృదయారవిందయై కొంతకాలంబునకు 17

ఉ. సారశుభాంగలక్షణుని, శంఖసుదర్శనచిహ్నితున్, సదా
చారుని, వాసుదేవ పదసారసభక్తుని, వంశవర్ధనున్
ధీరునిబుత్రరత్నమును దీయనిభావము లుల్లసిల్లఁగా
నారమణీమతల్లిగనె నాహరిదత్తఫలానుభోక్త్రయై 18

తే.గీ. అట్టిపుత్త్రినకుఁ ద్రిశంకుఁ డాత్మవలరి
జాతకర్మాదులైన సంస్కారములను
బూర్తిఁగావించె; నట్ట్రిప్రభుండె వెలిఁగె
నంబరీష సమాఖ్యాయ మందిజగతి 19

తే.గీ. ఆత్రిశంకు ననంతర మంబరీషుఁ
డంత రాజ్యాభిషిక్తుఁడై కొంతకాల
మునకు మంత్రులపై భారమునిచి యడవిఁ
దపముసేయఁ దొడంగె నుదగ్రవృత్తి. 20

సీ. హృదయాబ్జ సంస్థితుం డినమధ్య సంచారుఁ
డల చతుర్భుజుఁడు భర్మాభదేహ
కాంతుఁడు శంఖచక్రగదాంబుజ ధరుండు
హరిహరబ్రహ్మాత్ముఁ డఖిలభూష
ణుండును, బీతాంబరుండు, శ్రీవత్స చి
హ్నిత వక్షముగలాఁడు సతత భక్త
పోషణరతుఁడును, బురుషోత్తముఁడు నైన
పురుషు నాత్మను నిల్పి హరిని బరుని

తే.గీ. నరసి, "ఓంనమోనారాయణా!" యటంచు
నమితదీక్షను జపము సేయంగ నైన
వత్సరసహస్ర మెలమిఁ దపంబుసేసె
శమదమ యుతుఁడో నంబరీష మునిరాజ. 21

వ. ఇట్లుండ నొకానొక సమయంబున. 22

కం. హరి విశ్వాత్ముఁడు సురగణ
పరిసేవ్యుఁడు నిఖిలభువన వంద్యుఁడు శీఘ్రా
గగుడారూఢుండై యం
బరీషుఁ గనఁబోయి యొక్కమాయను బన్నెన్. 23

వ అదియు నెట్లనిన. 24

తే.గీ. ఆగరుత్మంతుఁడై రావతాభుఁ డగుచు
నలరఁ; దానటు దేవేంద్రుఁ డగుచు దాని
పై నధిష్ఠించి యుండి దేవతలుగొలువ
వచ్చి యయ్యంబరీషుని బలికె హరియు. 25

కం. నేనింద్రుఁడ సర్వజగ
జ్జానిని నినురక్షసేయు సమ్మతి నిటునేఁ
గానఁగవచ్చితి నైశమ
దేనింగోరెదవు యెఱుఁగఁదెల్పుము వత్సా! 26

వ. అక్కపట సురాధినాథు వచనంబుల నాలించి యంబ
రీషుండును. 27

మ. అటు దేవేంద్రుఁడువల్కు మాటలనెటో యాలించి, యైరావతా
ర్భటు నీక్షించి, హ్రాదంతరాళవిలస త్ప్రాత్మోక్షసద్భక్తిలం

పాయుఁడై, యిట్లను నంబరీషుఁడు 'భవద్భక్తి'దపంబేనుజే
యుటలే; దీవిడు కోర్కెలొల్లఁ; జను మోహా! యింక
స్వేచ్ఛాగతిఁ. 28

కం సీపలుకుల నాతపము వి
లోపంబగుచుండె, నిన్ను లోనెన్నందుఁ
దోపింపఁ, గోపపడకుము,
నాపతియుం గతియు నొక్క నారాయణుఁడే. 29

మ అనినం దత్క్షణమింద్రరూపుఁడుఁ బతుర్హాస్తంబులఁ
శంఖముఁ
ఘనచక్రంబు, గదాంబుజంబులలరంగా, వైనతేయుండువా
హానమైయుండఁగ, వేజోకండయిన నీలాద్రీంద్రమేమో
యనన్
గనుపట్టెన్ హరి దేవతావినుతుఁడై గంధర్వగానంబులఁ.

ఉ. కన్నులపండువై హృదయకాంతుఁడు గన్పడ నంబరీషుఁడా
వెన్నుని తెప్పవాల్పకయె వీక్షణసేయు చుఁ, బేదవానికిఁ
వెన్నిధియబ్బిన ట్లతఁడువిభ్రమ మందుచు,మోదబాష్పసం
పన్నత నిల్చికొంతవడి; ప్రాంజలిపట్టి నుతించె నాపయిఁ.

సీ జగన్నాథా! హరీ! జనార్దన! విశ్వ!
శ్రీనాథ! విష్ణుమూర్తీ! నమోఽస్తు!
ప్రణుతసమస్త విశ్వా! దేవదేవా! య
నంతా! యనాదిదేవా! నమోఽస్తు!
నారసింహా! యనాథనాథా! త్రివిక్రమా!
గానకళాత్మ! భవ్యా! నమోఽస్తు!
శ్రీయుత పద్మపత్రాయతనేత్ర! యో
హావ్యకవ్యధరాత్మకా! నమోఽస్తు!

తే.గీ. ఆదిదేవ! నమఃపరమాత్మరూప!
వాసుదేవ! నమోనమో! భక్తవరద!
హరి! క్రిష్ణానందమూర్తి! సహస్రనామ!
చిత్స్వరూప! నమోఽస్తు! లక్ష్మీసమేత! 32

కం. సాక్షాత్కారుఁడ వోకమ
లాక్షా! రక్షింపుమయ్య! యన్యము లెఱుంగన్
దీక్షమెయి నిన్నెగొలిచి
సాక్షివిగద! సర్వమునకు; శరణంబుహరీ! 33

వ. అని యనేక ప్రకారంబుల సాష్టాంగదండప్రణా
మంబులఁ దన్మయత్వంబున వినుతించు నంబరీషుంగని శ్రీహరి
యిట్లనియె, 34

కం. నీవిమలవ్రతదీక్షా
భావమ్ముల కలిగినాఁడ భక్తాత్మకుఁడ
గావున నీకాంక్షించిన
యేవరములనైన నిడెద నెఱిఁగింపఁగదే!

కం. నారాయణుఁడు పరాత్పరుఁ
డారీతి వచింప గద్గదాత్మకగాత్రుం
డై, రాజవరాళి సాత్త్విక
ధీరవరేణ్యుఁడు నుదారతేజుఁడు పలికెన్. 36

సీ. నిత్యంబు నాబుద్ధి నీదుసేవాకార్య
ములఁ దేల్వినంది నిఁకఁ బొందవలయుఁ
గాయమ్ము వాక్కులుం గర్మముల్ నీయందె
నిర్మలసద్భక్తి నిలుపవలయు

వరవిష్ణుభక్తి తత్పరులతో నిండఁగా
నిలఁ బ్రేమతోడనే నేలవలయు
యజ్ఞ హోమంబుల నర్చనంబులచేత
దేవతాతృప్తి నందింపవలయు

తే.గీ. విష్ణుభక్తులు శుభముల వెలుఁగవలయు
నాస్తికులు శత్రువర్గంబు నాశనంబు
గావలయు, నీదుసత్కటాక్షమున విభుఁడ
వరములివి, దేవ! వేరొండు వలదు నాకు. 37

కం. నావుఁడు గోవిందుఁడు, ధర
శ్రీవల్లభ! నీయభీష్ట నియతినిగొనుమా!
నీవరముల కనుకూలం
బై వరలెడు చక్రమిది, మహత్త్వముఁ గనుమా! 38

ఉ. ఆదిని రుద్రదేవుని మహత్త్వమునన్ లభియించెఁ గష్ట సం
పాదిత మిద్ది; శత్రురుజవర్గములన్ బరిమార్చు, ఘోరశా
పాదిక సర్వదుఃఖములు నంతముసేయు, నిరంతరంబు స
న్మోదముగూర్చు,నొండుసరిపోల్పఁగ లేదుతదీయశక్తికిన్.

తే.గీ. ఇట్టిచక్రము నీ కిపు డిచ్చుచుంటిఁ
బ్రియమలరఁ దీనిఁగొను మంబరీషభూప!
యనుచు నద్దాని నొసఁగి శ్రీహరియు, చెప్ప
పాటులో మాయమయ్యె దిగ్భ్రాంతిఁ గొలిపి 40

కం. కోరికకుమీరి వరముల
నారాయణుఁ డొసఁగ నతనినామస్మరణో
దారాంతరుఁడగుచు, నమ
స్కారంబు లొనర్చి భక్తిగానము సేసెన్. 41

వ. అట్టి యంబరీషుండును మహదానంద భరిత హృదయాంతరంగుండై, నిజరాజధానీనగరంబైన యయోధ్యాపురంబుఁ బ్రవేశించి. 42

ఉ. భూసురు లాదిగాఁగలుగు భూజనులెల్ల. స్వధర్మమార్గ దీ
క్షాసముపేతులై వెలయఁగాఁ బరిపూర్ణ విశాలభావశో
భాసహితాత్ములైన హరిభక్తుల సేవలొనర్చుచుండి, త
ద్దాసులఁ దన్పుచుఁ గడుముదంబునఁ బాలన మొప్పఁ
జేయుచుఁ 43

కం. ఆగమవిధిగా శ్రద్ధగ
యాగములను వాజపేయ హయమేధములన్
దా గురుదీక్ష నొనర్చను
త్యాగధనుం డంబరీష ధరణీంద్రుఁ డొగిన్. 44

సీ. ఏయింటఁ జూచిన నాయింట హరిపూజ
లామహోత్సవములే యరయనయ్యె
నేనోట నాలింప నానోటనే వేద
విద్యారవంబులే వినఁగనయ్యె
నేపీట నిలచిన నాపీటనే మహా
క్రతుసంభ్రమంబులే గాననయ్యె
నెవ్వానిఁ బరికింప నవ్వాఁడె విష్ణుస
హస్రపఠనమె సేయంగనయ్యె

తే.గీ. నయ్యయోధ్యామహారాజ్య మంతు సకల
సస్యఫలసంప దభివృద్ధి జరుగనయ్యె
జనము దీర్ఘాయురారోగ్య వివిధభాగ్య
సంతతులతోడఁ దులఁదూగె జనగణంబు. 45

కం. మదికి సుదర్శన మెప్పుడు
సుదర్శనముగాఁగ ధరను శుభతతులను నం
బుధియవధిగ భూమిని స
మ్ముదమున నయ్యంబరీషభూపతి యేలెన్. 46

కాంతివృత్తము - స్వాంతమ్మున రాముని భక్తిని, ని
శ్చింతన్ బరమాత్మవిశేషము, న
త్యంతప్రతిభన్ సతతంబుగనన్
సంతుష్టిఁగ నుండరె సత్కవులై. 47

# శ్రీ మ తీ స్వ యం వ ర ము

కం. శ్రీధర్మవిగ్రహా! స
ర్వాధారా! భక్తపాలనా! విశ్వాత్మా!
బోధానందా! భక్తా
రాధితపాదాబ్జ! చిత్తరంజనరామా! 1

వ. ఓయి భరద్వాజా! మఱియు నయ్యంబరీషమహా రాజుంగూర్చి యొఱింగించెద నాలింపు మని వాల్మీకి ముని పుంగవుం డిట్లనియె. 2

తే.గీ. అంబరీషునకుం గూర్చునట్టి కన్య
కలదు కొమరిత గుణరత్నఖని యనంగ
సర్వశుభలక్షణాన్విత, సౌమ్యచిత్త
రమణి, 'శ్రీమతి' యనియొడు కమలనయన. 3

వ. ఇట్లుండ నొక్కనాఁడు.

కం. మునివరుఁడు నారదుండును
ఘనతేజుఁడు పర్వతుండుఁ గరుణాయుతులై
చనుదెంచిన, వారలఁగని
ప్రణామములఁజేసి రాజవరు డతిభక్తిఁ. 5

ఉ. ప్రాజలొనర్చె; వారలకుఁ బుత్రిక శ్రీమతి ప్రముక్తవచ్చినన్
రాజితరాజబింబముఖి, రమ్యగుణాన్విత, సర్వలక్షణో
త్తేజితశోభనాంగిఁ గని, దేవ! యీజగదేకసుందరాం
గీజనప్రకారమును. గించి దెలుంగ నచింపవేయనన్ 6

వ. అమ్ముని పుంగవుల విన్నపంబు నాలించి యంబరీషుం
డిట్లనియె. 7

చ మునివరులార! యీతరుణి ముద్దులకూతురు నాకు,
"శ్రీమతీ!"
యనిపిలువంగఁ బొల్చు; నెపుడాత్మను శ్రీహరినే తలంచు, భ
క్తినిరత, యీమెకుం దగుసుధీవరునిన్ వరుఁగూర్పఁగా
వలెన్
వినయము విష్ణుభక్తియును విశ్రుత నొప్పు రసజ్ఞశేఖరున్ 8

కం. అనివలికిన నృపవచనము
విని నారదమౌని పెండ్లివేడుకపడె, న
ట్లనె పర్వతమునివరుఁడున్
మనమున నక్కన్యఁగోరె మంజులగాత్రిన్. 9

ఉ నారదుఁ డంబరీషజననాథుని గోప్యముగాఁ గఁబిల్చి, నీ
కూరిమికూతు నాకొసఁగఁ గోరెద నంచువచింప, నంతనా
తీరుననే రహస్యముగఁ దెల్పెను పర్వతమౌనిగూడ, నె
వ్వారికి వారిఁగాదనగవచ్చునె యౌనని చెప్పఁబోలునే?

తే. గీ. ఇరువురును దివ్యమౌనులు హితులు పూజ్యు
లొకరొకరిమించు తపసులు సకలవిదులు
శ్రీమహావిష్ణుభక్తులు సిద్ధపురుషు
లేమి చేయుదునా? యని యుట్టెనిలచి. 11

మ పలికెన్ మానులఁ గాంచి,నాకొ మరితన్ వాంఛించు మీరిద్దఱున్
విలసత్తేజులు,మిమ్ముఁ గాదనఁ దరంబే యేరికిన్?గాన యీ
లలనారత్నము చిత్త మెవ్వనిపయిన్ లగ్నంబుగానోపు,నా
విలసన్మూర్తికొ సంగువాఁడ,వినుఁడీ!వేయేల? మన్నింపుఁడీ!

వ. అని యివ్విధంబున భయభక్తి సంభ్రమాంతరంగుండై యంబరీషుండు వలికినంత నమ్ముని ద్వయంబును వల్లెయని, మఱియు నెల్లి మేమరుదెంచువారము నీ వచనంబులం బరితుష్టులమైతి మనుచు, వాసుదేవ సేవాపరాయణులై, యవ్వారెవ్వరికి వారై చనిరంత. 13

కం నారదమహామునీంద్రుఁడు తాఁ
జేరెన్ వైకుంఠమునకు; శ్రీవిష్ణుపదాం
భోరుహయుగళికిని నమ
స్కారము లొనరించు భక్తి సంపదమిగులన్. 14

తే. గీ. పర్వతుఁడుఁ దాను నొక్కజవ్వనిని గోరు
టాది వృత్తాంత మంతయు నతని కెఱుఁగఁ
జేయఁ దలపోసి నారాయణా! యనంత!
వినుము గోప్యంబుగాఁగ నామనవి యనిన. 15

వ. సర్వాత్మకుండును సర్వభోక్తయు నైన గోవిందుండును నక్కర్మతుండైన నారదుం గాంచి, మందస్మిత వదనారవిందుండై, నీయభీష్టం బెఱింగింపుమనిన, నాతం డిట్లనియె.

కం. శ్రీమంతుఁడగుచు, నీవాఁ
డై, మనుజాధిప వరేణ్యుఁడై, మతిమంతుం

డై, మనఁడె యంబరీషుఁడు
'శ్రీమతి' యనఁగఁ గలదు కొమరిత యాతనికిన్. 17

శా. ఆసౌందర్యము నావిలాసమధురవ్యాపార మానేత్రవి
న్యాసం బాతనుమధ్యమధ్యవిలసద్వానప్రకారంబు, నే
యేసామ్యంబుల నెంతఁజెప్పినను నొక్కింతేనియున్ సత్యతా
భాసంబైనను గానరాదుగద! దేవా! శ్రీమనోనాయకా! 18

కం. నేనును బర్వతుఁడును, నా
మానినిఁ గని పెండ్లియాడ మనము లలర, నా
భూనాయకుని రహస్యము
గాన నర్థించితి మొకం డొకండుగ, నంతన్. 19

వ. మా కోరికలు విన్న యయ్యంబరీషుండును నేమను
టకుం దోపక కొంతవడి యాలోచించి యిట్లనియె 20

శా. శ్రీనారాయణ పాదపద్మయుగళీ సేవామృతాస్వాద స
మ్మానీంద్రుల్ గద, మీరలిద్దరును, మీమాహాత్మ్యముల్ చెప్పఁగా
నానే! యెవ్వని ద్రోసియెవ్వనికినీయఁగల్గు? ది త్తన్వియె
వ్వానిన్ గోరునో వానికే యిడెద, మీవాదంబులన్ మానుఁడీ! 21

ఉ. ఆవిధి నంబరీషుఁ డనినంతనె మేమును 'వల్లె' యంటి మో
దేవ! యనంతరంబిటులఁదెల్పమె, జేపరుదెంచుచుంచు; నా
భూవిభుఁ డట్లె యానఁగ ముందుగ నీకృపఁగోరివచ్చితిన్
సేవల మత్ప్రియంబు నిడి గెల్పును గూర్పవె నాకు శ్రీహరీ! 22

వ. అదియు నెట్లందు వేని ? 23

చ. ఇరువుర వేషము కన్యవరియింపఁగఁ బోయినవేళ, నందుభూ
వరుసుతదృష్టి మార్గమునఁ బర్వతమౌనిముఖంబు కీసు, వా
నరముఖమట్లు గన్పడఁచి, నన్నె వరింపఁగఁ జేసి, వెండియుఁ
బరులకు మాత్ర మట్టుల గనంబడకుండ నొనర్ప వేఁడెదన్

కం. అని యిటు వేఁడిన నారద
మునిఁగాంచి మురారి నవ్వుమోమున నీకో
ర్కెను మన్నించితిఁ, జనుమిఁక
ననుమానంబేల యెట్టులౌనో గనుమా ! 25

తే. గీ. అనిన నామాటలాలించి యాత్మ నలరి
శ్రీమహావిష్ణువునకుఁ బ్రణామములను
జేసి, ధన్యుఁడ నేనంచుఁ జిత్తమందుఁ
బొంగుచు, నయోధ్యకుం బోయె మునివరుండు. 26

వ. అట్లు బ్రహ్మాత్మసంభవుండైన నారదుండు మరలి నంతనే, పర్వతసంయమీంద్రుండును, శ్రీమన్నారాయణుని దర్శించి సంస్తుతులం జేయ. 27

కం. వత్సా ! యేమిటువచ్చితి
మత్సన్నిధిఁ దెలుపు మనిన మౌనియు నతివే
లోత్సాహపూరితుండయి
సత్సతి శ్రీమతిని సారెఁ దలఁచుచున్. 28

వ. నారదుండుం దానును నంబరీషుని కొలువుకూటంబు నకు నేఁ బోవుటయు, నందుఁ దజ్జనపతిసుత నుభయులుం గాంక్షించి యొకరికిం దెలియకుండ నొకరుగా వేఁడుకొను

టయు, మొదలుగాఁగల వృత్తాంతంబంతయు శ్రీగోవిందునకు
వినిచి యిట్లు ప్రార్థించె. 29

చ. ఇరువురు మేము కన్యవరి
యింపఁగఁ బోయినవేళ నారదుం
డెరియఁగ వానరాస్యుఁడయి
యానుకుమాత్రమె యట్లుపోచఁగా
వరలఁగఁ జేయు, మన్న్యులకు
భావనఁజేయ స్వభావసా ముఖం
బు రహిఁ గనంగఁజేయఁదగుఁ
బొంపిరిపోవఁగ నాదుకోర్కులున్. 30

వ. నావుఁడు మహావిష్ణువు నీ పల్కినయట్ల యాఁగాక!
యిప్విధం బాకలహాశనుం డెఱుంగకుండం జనుమని వచించె.

శా. ఈరీతిన్ మునివర్యు లొక్కఁడొకఁడై యిచ్ఛారతిన్
బోయి, యా
భూరాజేంద్రుని నంబరీషు భవనంబున్ జేర, నాతండు,న
వ్వారిన్ స్వాగతపూర్వకంబగుసుభాహ్వానంబుగావించి, హే
లారమ్యంబుగ నాత్మమందిర పురాలంకారముల్ సేసినన్.

సీ. సితసౌధకుడ్య విస్తృతగవాక్షంబులఁ
గొనలొప్ప ధూపవాసనలు చెలఁగ
గృహబహిర్ద్వార నిర్మితదివ్యమకరతో
రణపంక్తి యింటింట గణనమీరెఁ
గుంకుమద్రవ మృగపంకసంకలిత జ
లాధిక సిక్తమై వీథు లలరె

ముత్యప్రకల్పితామోద సుందరరంగ
వల్లు లెల్లెడలఁ జూపట్టి వెలిఁగెఁ

తే గీ. గనకకదళీఘన స్తంభ కాంతు లెల్ల
ద్వారదేశంబులను ధగద్ధగల మెఱసెఁ
బద్మరాగాది మణులతో ధ్వజము లలరె
నమరపురిఁబోలు నయ్యయోధ్యా పురమున.

ఉ. తెల్లని పట్టుపుట్టముల దీపిలుచాందినిఁగల్గి, సుందరో
త్ఫుల్ల పరీమళత్కుసుమ తోరణపంక్తులు వ్రేలుచుండ,ము
ఖ్మల్లులు కంబళంబులుగఁ, గాంచనరత్నమయాసనంబులన్
బెల్లుగ ధూపవాసనల వెల్లువఁదోగిన నోలగంబునన్. 34

ఉ పండితులున్, బురోహితులు, భక్తవరేణ్యులు,
మంత్రివర్యులు
గ్గండులు, దండనాయకులు, ధార్మికరాజవరేణ్యసంతతుల్,
దండిగవచ్చి, వారికుచితంబగు, నాసనముల్ గ్రహింప,మా
ర్తాండకులైక భూషణుఁడు, ప్రాజ్ఞశిఖామణి,
యంబరీషుఁడున్. 35

కం. వెలుఁగుల నీనెడు తారల
నలరెడు నమృతాంశుఁబోలె నా రాజసభా
స్థలమధ్య నంబరీషుఁడు
వెలసెన్ సింహాసనమున విజ్ఞతవాడమున్ 36

౹. ఆ సమయంబున, 37

తే. గీ. సకలదిక్పాలకాది నిర్జరులఁ గూడి
యింద్రుఁడరుదెంచె నంత మునీంద్రచంద్రు
లైన నారదపర్వతు లరుగుదెంచి
రుచితపీఠంబులందెల్ల రుండి రపుడు

కం. ఆవిధి నరుదెంచిన యా
దేవేంద్రాదులను, హరివిధేయుల మునులన్
సేవించె నంబరీష ధ
రావల్లభుఁ డమితసాదరస్వాంతుండై. 39

తే. గీ. అర్ఘ్యపాద్యాది పూజల నాచరించి
విమలరత్నాసనములఁ జూపింప నచట
స్వర్గవాసులు, నారదపర్వతులును
శ్రీమతీమతులౌచు నాసీనులైరి. 40

వ. తదనంతరంబ యంబరీషుండును దనసింహాసనంబున సుఖాసీనుండై. 41

కం. శ్రీమతిఁ గన్యను సాక్షాత్
శ్రీమానినిబోలు సుందరీమణిని సభా
ధామమునకుఁ గొనిరాఁ దరు
ణీమణులగు చెలులఁబంచె నిశ్చలబుద్ధిన్. 42

వ. అంత నా శ్రీమతియు సర్వాభరణభూషితయై, విద్యుల్లతా సన్నిభంబగు స్వశరీరకాంతికిరణంబులు మున్ముందు మార్గముంజూప నందక త్రియలగుఁ జెలిమిక త్రియలు దన్నావరించి నడువ, నట్టిస్వయంవర సభామధ్యంబునకుం జని, జనక

సింహాసన సమీపంబున లజ్జావినయ వినమితవదనయై నిలువ నాసమయంబున నంబరీషుండును దనయం గనుంగొని యిట్లనియె. 43

ఉ. రాజసభాంతరాళమున రాజస భావములొప్ప పౌరులున్
రాజులు, దేవరాజులును, రాజపురోహితులున్,
సుమంత్రులున్
రాజిలు దండనాయకు లనంతమహావిభవంబు సొంపుచున్
దేజము మీరనుండిరి, సుధీవరులెల్లరు నిన్ను మెచ్చఁగన్

కం. అమ్మా! శ్రీమతి! యిటుగను
మమ్మా! యీ మౌనియుగమునందున నీకున్
గమ్మనఁ జిత్తము వడసిన
సమ్మునిగళసీమఁ గుసుమసరము నొసఁగుమా! 45

వ. అనినన్ జనకునివచనంబుల నాలించి. 46

ఉ. శ్రీమతి తెప్పవాల్పక ఋషిప్రవరాకృతులట్లు చూచి, నే
నేమొనరింప నేమగునొ? యీదృశచిత్రవిచిత్రదృశ్యమెం
తో,మదికింత నచ్చెరువుఁదోరపుభీతియుఁగొల్పుచుండె,నిం
దేమని విన్నవింపఁగలనిట్టి మతిభ్రమణంబు గల్గెడిన్. 47

తే. గీ. నిజముఁ జెప్పినఁ దండ్రినిందించునేమొ?
మునులు వీరుశపింతురేమో? మదీయ
సఖులు పరిహాస మాడంగ జాలరెట్లు?
హరియె శరణ్యలుగాక యీ తరుణమందు. 48

మ. ఇటు చిత్తంబు చలింపరాపడి, యెటో
యేమేమొ యోచించుచున్
నిటలంబందున స్వేదబిందువు లహో
నిల్వంగఁ గ్దోయి ము
చ్చటఁగా మాలికఁ బట్టియుండఁ, గని,
రాజన్యుండునౌ తండ్రియిం
కిటజాగేటికి ? మానినొక్కసిని
నీవెన్నంగదే! శ్రీమతి! 49

తే. గీ. అనిన, జనకుని వాక్కుల వినియు, నేమి
చెప్పుటకునైనఁ బోఁచని చిత్తమునను
విశ్వమయుఁడైన విష్ణుని వివిధగతుల
వినుతు లొనరించి వివరించె జనకునకును. 50

కం. వానరముఖులై మానులు
గానంబడుచుండినారు; కమలాక్షుఁ డొకం
డానడుమ దివ్య తేజము
తో నిలచినవయసుగాఁడు తోఁచెన్ దండ్రీ! 51

వ. అతని రూపలావణ్యాది విశేషంబు లెట్టివనిన. 52

సీ. పదియు నారేడుల ప్రాయంబుగలవాఁడు
నవిసెపూరంగు దేహంబువాఁడు
మేల్ సొమ్ములెల్లను మెయినిండఁ గలవాఁడు
సొడవైన భుజముల నడరువాఁడు
నెత్తుగా వెడదయౌ నెడదఁగల్గినవాఁడు
బంగారు పట్టుపల్వలు గలాఁడు

మూర్ధైనముడుతలఁ జొల్చు పొట్టఁగలాఁడు
సన్నని నడుముతో నున్నవాఁడు

తే. గీ. తమ్మిపూ సరివచ్చు పాదములు, హస్త
ములును, మోమును, గన్నులుఁ గలుగువాఁడు
మేలుమేలనఁ దగుకురుల్ వ్రేలువాఁడు
నన్నుఁజూచుచు నవ్వుచున్నాఁ డతండు. 53

వ. మఱియు నోతండ్రీ! తన దక్షిణకరంబుం జాచి, నన్నుంబిలుచు చున్నట్లు నిలిచియున్న యప్పురుషోత్తము నాశ్చర్యంబున నవలోకించుచుంటి. నావుఁడు నారదుంగును నోకన్యకామణీ! యప్పురుషునకు బాహువు లెన్నిగలవో, వచింపుమనిన నవ్వనితయు 'రెండుచేతులు గలాఁడ'ని విన్న వింప, నంతఁ బర్వతుండు నో "సాధ్వీ! నీకుం గానిపించు నవ్వానివక్షంబున నెయ్యదికలదో గుర్తింపఁగలవే!" యన, నామెయుంగని, యమ్మహాత్ముని వక్షంబున సహస్రకిరణ ప్రకాశంబైన యొక్క దివ్యహారంబు గలదని వక్కాణింప, నమ్మునీంద్రులుం దమమనంబుల నియ్యది యంతయును శ్రీమన్నారాయణుని మాయాకృత్యంబుగాఁ దలంచినవారై.

తే. గీ. నన్ను వానరముఖునిఁగా విన్నఁదనము
దోపఁజేయు, నిమిత్తంబు దోపదయ్యె
శ్రీమహావిష్ణువే యిట్లు చేయఁజాలు
ననుకొనుచు వారు వేర్వేరఁ గనలియుండ. 55

వ. అంత నారదపర్వతులంగాంచి యంబరీషుం డిట్లనియె.

మ. ఘనమౌనీంద్రులు మీరు, మీ కిదెన
మస్కారంబు, మాబుద్ధి బా
వనకీరీతి భ్రమంబుఁ గొల్పఁదగునే!
ప్రార్థింతు మీ మాయలన్
జొనుపంగాఁ దెలియంగ నెట్లు? నిజమున్
రూపించి, మత్కన్యకా
మణి భ్రాంతిన్ విడనాడఁజేసి, మము
సమ్మానింపు డిప్పట్టునన్. 57

శా. ఆమాటల్ విని మౌనిపుంగవులు,
రాజా! ముందె మాకాళ్ళకీ
వేమో బంధములేయఁ జూచెదవు, నీ
కిష్టంబు గాకున్నచో
నీ మాయామయ యుక్తిపంచనము లీ
పీరీతిఁ జూపింపఁగా
నేమో? వైష్ణవ తత్త్వ మిట్టిది యొకో?
యేమందు నీపింతకున్. 58

తే. గీ. ఇపుడు మాలోన నెవ్వని నేని యొకని
నీమె వరియింపవలెఁగదా! యెట్టులైన
ననఁగ, నామాట లాలించి, యతిప మాధ
వుని మనమున ననన్యచింతనము సేసి. 59

కం. మునిశాపభయము దిగవిడ
చినదై, యువ్వారిమధ్యఁ జెన్నారువరున్

గనుచు, స్వయంవరమాలికఁ
గని, యాతని యఱుతన్ వైవఁ గడగినయంతన్ 60

ఉ. ఆమహనీయమూర్తి సభనందఱువిభ్రమమంది చూడఁగా
శ్రీమతిఁ గాంచ మాయమయెఁ; జెప్పఁగలేని మహా
ద్భుతంబులోఁ
దామును చేష్టదక్కియు, సదస్యులు,నాపయినిశ్చయించి,రీ
భామను మాయానాటకముఁ బన్ని హరించె ముకుందుఁ
డిత్తఱిన్. 61

వ. మఱియు. 62

ఉ. ఇంతకు ముక్కుమూసికొనియేవనమందుననోవసించుచున్
చింతలులేని జీవితవిశేషములొప్ప, వినశ్వరాత్మవి
ద్యాంతరవర్తులై మునులుహాయినిగాంచితరించరాదె;యీ
కాంతల మోహమేల? యిటుగా నగుబాటుల నొంద
నేటికిన్ 63

శా. ఏజన్మంబుల నేమహావ్రతములం దిచ్చారితిన్ భక్తివి
భ్రాజత్పూజల విష్ణునిన్ దనిపెనో? భావింపఁగానౌనె?యు
వ్యాజప్రేమ నతండె శ్రీమతిని మాయంగైకొనెంగాక! యే
రాజన్యాత్మజ కబ్బె నిట్టివిభవప్రారంభ మేకాలమున్?

వ. అని యివ్విధంబున సభాసదులెల్లరుం దలపోయు
చుండ. 65

శా. వైకుంఠంబునుజేరె శ్రీహరియు నాభామామణింగూడి,యా
రాకన్ బోకయు నింద్రజాలమయినన్ రాగాత్ములై
యామునుల్

శ్రీకాంతుం గని ప్రశ్న జేయుటకునై చేరంగ వైకుంఠముం
శ్రీకల్యాణుఁ గౌఱింగి, శ్రేయసి చెవిఁ జెప్పంగ నత్తెన్నియున్.

కం. కనుచానై భవనాంతర
మున నిలువగ విష్ణుమూర్తి ముదమునఁ దానై
మునివరుల కెదురుగాఁ జన
వినతుల నిడినారు వారు విశ్వాత్మునకున్. 67

వ. అంత నమ్మానులం దోడితెచ్చి శ్రీహరి యుచితాస-
నంబులం గూర్చుండఁ జేసి, తానును సుఖాసీనుండై యుండ 68

శా. శ్రీనారాయణుఁ గాంచి నారదుఁడుఁ దాఁ
జేమోడ్పులన్ నిల్చి, దే
వా! నీవిప్పుడ నన్నుఁ బన్యతుని నే
లా! మోసముం జేయ? ధా
త్రీనాథాత్మజ శ్రీమతిన్ ఋజుమతిన్
ప్రేమించి గైకొన్నచో
నానందంబదిగాదె యెల్లరకును
వహ్వా! యంచుఁ గీర్తింపరే! 69

కం. అని పలికెడు మునిమాటల
విని, వినఁగా నోపనట్లు విష్ణువు చెవులన్
గొనకొని మూసికొనంగా
ఘననటన మొనర్చి వింతగాఁ గనుఁగొనుచున్. 70

ఉ. ఇత్తఱిఁ గామవాదమిటు లెంతయు మీరలు వల్కనౌనె? కిం
చిత్తును నేనెఱుంగ నని శ్రీహరి వాకొన; నారదుండుఁ దా

నుత్తలమంది చిత్తమున, నోమహిమాన్విత! యట్టులైన నా
కుత్తరమిమ్ము, నేనడుగునొండొకసంగతికంచు వెండియున్.

తే. గీ. భక్తివిశ్వాసముల నిన్ను భజనసేసి
శ్రీపతీ! పర్వతుని మోము చెన్నుదఱిఁగి
వానరాస్యంబుగాఁ జేయవలయు నన్న
'వల్లె'యని నన్నుఁ గికురింపఁ బాడియగునె? 72

వ. అన విని నారదునకు నారాయణుం డిట్లనియె. 73

శా. ఏయేకోర్కెలుగల్గి భక్తులయిన
నన్నేరీతి వాంఛింతురో?
యాయాకోర్కెలనెల్లఁ దీర్చుటయెనా
యాంతర్యమో నారదా!
యీ యర్థంబున దోషమెవ్వరిది? నే
నీరీతి మీకున్ బ్రియం
బే, యర్థించి యొనర్చియుంటి, నిజమో
యీ! నమ్మె! నామాటలన్. 74

తే. గీ. ఆయుధముతోడుగాఁగ సత్యము వచింతు
నమ్ముఁడిక మానులార! మంతనములేల?
చిత్తమున మీహితంబునె చేయఁగోరి
యిటులొనర్చితి మద్భక్తు లీరలగుట.

ఉ. నావుఁడు నారదుండు మునినాయకుఁడిట్లను, నంబరీషశో
భావహ సత్సభాంతర శుభాస్తరణంబుల నున్న మాకు మ
ధ్యావృతసీమ వెల్గెద్విభుజాయుతు డెవ్వఁడు? మాయఁజూపితా
వావిధి నెవ్వరుఁ గనియట్లు హరింపఁగ నేలఁ గన్యకన్. 76

మ. అని ప్రశ్నింపఁగ మాధవుండువిని వ
హ్వా! మాయలం జూపఁగా
ఘనులౌ వారిలనేకు లుందురుగదా!
కాంతామణిం గొంచుఁ దాఁ
జనె నెవ్వాఁడో? చతుర్భుజుండనుగదా,
చక్రాయుధుండన్ మిముం
గనుగప్పన్ బనియేమి? మీకు ననుమా
నంబేమి నామాటలన్. 77

తే గీ. అంత శ్రీహరివాక్యంబు లాలకించి
మానులిర్వురు నతనితో “మాయ లెల్ల
నంబరీషుఁడె గావించె” నని వచించి
హరిని గీర్తించి యరిగిరి యచటువాసి. 78

ప్రియకాంతా వృత్తము :-
విమలమనంతంబయి పరవిద్యాత్మకమై, భ
క్తిమణుల హృద్భాసితమగు తత్త్వంబిటు. లీలో
కమునకు ధర్మప్రకటనఁగావింపఁగ మాయా
మమతలఁ జూపితి రఘుమాన్యా! గుణధామా! 79

# మునిశాపము, శ్రీరామజననము

కం. శ్రీసీతాహృన్నేతా!
కౌసల్యానందవర్ధకా! పూతాత్మా!
దాసజనదోషహరణా!
భాసుర శుభనామ! రామభద్రా! శ్యామా! 1

చ. వరమునులైన నారదుఁడు
పర్వతుఁడున్ జని తీవ్రకోపబం
ధురతరవక్త్రముల్ వెలుగ
"ధూర్తుఁడుభూపతి యంబరీషుఁ డా
దరము నటించి, మమ్ములఁ
దానవమానమొనర్చె"నంచు నో
టరులయి తెంపుసేయుచు హు
టాహుటిఁ జేరిరి రాజసౌధమున్. 2

వ. ఇవ్విధంబునఁ బర్వతనారదు లిద్దరున్ గాలానలంబు చందంబునఁ గోపాగ్నులఁ గ్రక్కుచు నటుచేరం గాంచి, యంబరీషుండును నెదురేగి, యత్యంత వినయ వినమిత గాత్రుండై తోడితెచ్చి, యుచితాసనంబులం గైసేయ, వారును నవ్వానిన్ గ్రహింపనివారై. 3

చ. అతివినయంబు వైష్ణవత యన్నది నేఁడనుభూతమయ్యె, నిం
దిత మతివింతగానని మదిన్ గనకుంటిమి; ముందుగానె "నా
సుతనిడఁజాలమీ"క;నినుఁ జొక్కిన మనంబుల మెచ్చు
కోమె? యీ
మతకము లేలఁ జూపితివి మాయెడ? నింతటిమాయగాఁడవే!

తే. గీ. నిన్ను నజ్ఞానతిమిరంబు నిస్తులముగ
నావరించునుగాక యటంచు, వార
లంబరీషు శపించిన, యంతలోనె
యల్లనల్లఁ దమోరాశియెల్లఁ దోఁచె. 5

ఉ. ఆతిమిరంబ సహ్యమయి యానరనాథుని నావరింపఁగా
నాతతయత్నమున్ సలుప, నాతని చెంతనెయున్న వైష్ణవ
ఖ్యాత సుదర్శనంబది మహోజ్జ్వలనోజ్జ్వల దహ్యమాన తే
జోతిరయంబునన్ దరుమనయ్యెను నాతిమిరంబునయ్యెడన్.

కం. ఆతిమిరము మునియుగళిన్
గాతనులం జేయ, వారుఁ గడుసంభ్రములై
యేతన్మాత్రుల పగిదిన్
చేతంబులు సంచలింప సిగలు విరియుచున్. 7

ఉ. మౌనులు ముందుఁబారఁగఁ దమం
బును వారిని వెంబడించె; న
ద్దానిని విష్ణుచక్రము వి
దారణసేయఁగ వెంటనంటినన్

దీవత సమ్మునీశ్వరులు(
దేకువమాలి, సమస్తలోకముల్
బూని చరించి రెందయినఁ బ్రో
వఁగ నొక్కఁడుఁ గానరామికిన్, 8

మ భయ మాయాసము దుఃఖమున్ గలిసిపై
పై ముప్పిరిం గొంచు, మా
నియుగం బాత్రిము(జెందఁ జేయఁగ, మహో
నిర్ఘాత వాతాహతిన్
బయనంబై చనుపక్షియుగ్మము క్రియన్
వాపోవుచున్, దైవని
శ్చయ మట్లుండుట వారుచేరిరి హరి
స్థానంబు వైకుంఠమున్. 9

సీ. సనకసనందనాది నిలింపమునివరుల్
బ్రహ్మసూత్రార్థముల్ వలుకుచుండ
నాల్గువేదమ్ముల నలుమొగమ్ములనుండి
బ్రహ్మదేవుఁడు స్వస్తి( బలుకుచుండ
నింద్రాది దేవతల్ సాంద్రతసభనిండి
జయజయధ్వానముల్ సలుపుచుండ
గంధర్వగాన సంకలితనాట్యమ్ముల
నప్సరసాంగన లాడుచుండ

తే. గీ. లీలనారాయణుండు పేరోలగమున
[illegible] విశాలసింహ

వీరిఁ గమలాసమేతుఁడై విడిసి యుండ
నటకు నారదపర్వతు లరుగుదెంచి 10

శా. ఓ గోవింద! జనార్దనా! మురహరీ!
యో వాసుదేవా! ప్రభూ!
నాగేంద్రార్తివినాశ! యీశ! జగదా
నందైక సంభావనా!
మాగోడుఁ గనుమయ్య! మాదోసఁగులన్
మన్నింపరావయ్య! మా
కీగండంబును బాపి ప్రోవఁగదవో
యీ! యార్తరక్షామణీ! 11

కం. అని ప్రార్థనఁ జేయుచు, ప్రొ
క్కిన మునులం గాంచి, వేగఁ గేశవుఁడు జగ
జ్జనకుఁడు భక్తావనుఁ డా
క్షణమునఁ దిమిరమును జక్రగతియుఁ నిలిపెన్. 12

మ. హరి తా నంతట నంతరంగమున, 'నా
హా! యంబరీషుండు, ని
ర్వ్యరమౌనీంద్రులు నాకుఁగూర్చిన మహా
భక్తుల్ గదా! వీరు ము
వ్వురు సంతుష్టులుగాఁగ నెంతయు హితం
బుఁ గూర్తునే,' నంచు సా
దరతన్ నారదపర్వతుల్ వినఁగ నా
తం డిట్లుగా వాక్రొనెన్. 13

కం. నను మన్నింపు(డు నా దోస
గునసే చక్రంబు మీకుఁ గూర్చె నశాంతిన్
వినయమున వేడుకొన, స
జ్జనులు క్షమించుదురుగాదె శాంతిప్రియులై. 14

వ ఇట్లు వలికిన సద్దేవదేవు వచనంబులను వినియు, నింతకుం గారకుం డీహరియే యని యెఱింగినవారై, హర్ష మీరిన కోపోద్రేకంబు నాపుకొనంజాలక యమ్మునీంద్రులును,

తే గీ మాధవా! మాయఁజొప్పించి మనుజదేహ
ధారివై, శ్రీమతిని గొంచుఁ దరలినాఁడ
వౌట, నంబరీషుని వంశమందు నీవు
దాశరథివౌము! మాయలోఁ దగులుకొనుము. 16

తే. గీ పుడమి కనుపున శ్రీమతిపుట్టి జనక
రాజు నొడిలోనఁ బెరుఁగుచు, రమణిమిన్న
యనఁగ నీ మెయి రాముఁడవైన నిన్నుఁ
బెండ్లియాడును నెంతయు వినుము మఱియు. 17

ఉ. రాక్షస కృత్యమానఁగ రాము నిట్లుహరించినావు, ప
ద్మాక్ష! మునిద్వయంబునకు నార్తినిగూర్చితివీవు, కావునన్
రాక్షసుఁ డొండునాఁడునుధరాసుతనీప్రియనాహరించి,యా
పక్షమునన్ మనోవ్యథలపాలొనరించునుగాక నిన్నటుల్. 18

వ. ఇవ్విధంబున శపించిన నవ్విబుధముని ద్వయంబుం గాంచి, యెల్లవారు నాలింప నమ్మహావిష్ణుం డిట్లనియె. 19

సీ. అంబరీషుని వంశమందు యశస్కుఁడై
శ్రీమంతుఁడైన ధార్మికుఁ డనంగ
దశరథాహ్వయుఁడు సత్యప్రతిజ్ఞుండౌచు
నుద్భవించును క్షత్రియుండు; మఱియు
నతనికిఁ జ్యేష్ఠుండనై, నేన యవతార
మందెద నాజన్మమందు నాదు
దక్షిణబాహు వెంతయు భరతుఁడునా
నుదయించు; వామబాహువును శత్రు

తే. గీ. యరయ శత్రుఘ్ననామంబునందు; నాది
శేషుఁడే లక్ష్మణుండౌ; ఋషికృత శాప
మిట్లు సార్థకమౌచు నయ్యిలకుఁ గలుగు
భారముం దీర్పఁదోడౌ; విచారమేల? 20

వ. మఱియు నాహరి, మునివరుల పిఱుందన యేతెంచిన
తమంబును జక్రంబునుం గని యిట్లనియె. 21

ఉ. ఓయి సుదర్శనా! చనఁగ
దోయి యథేచ్ఛముగాఁగ! నోతమం
బా! యిటువిన్ము, దాశరథినై
భువిమానవజన్మమంద, నన్
బాయక నావరించు కొన
వచ్చును, నేఁటికిఁ బొమ్ము! మునులన్
ధీయుతు నంబరీషుని మదిన్
దలపోయకు మెట్టివేళలన్. 22

కం. హరిపంపునఁ జక్రం, బం
బరీషు సన్నిధికిఁ జేరె మాయాతమ, మ
త్తఱి నెటకేనిం జనియెను
బరమాత్మున కమితభక్తిఁ బ్రణుతుల నిడుచున్. 23

వ. అంత నప్పర్వతనారదులును. 24

శా. ధర్మస్థాపక రూపకంబగు జగ
త్కల్యాణముఁ గోరి, దు
ష్కర్మప్రాప్త ఫలానుభూతి కిటులు
త్సాహంబుఁ జూపించి, యీ
శర్మంబుల్ విడనాడి మానవునిగా
జన్మించు విష్ణుండహా!
నైర్మల్యాత్ముల నిత్యకృత్యములు
ధన్యంబుల్ జనోద్ధారముల్. 25

వ. అని వినుతించి, సత్యప్రతిజ్ఞా పూర్వకంబుగా మరల నిట్లనిరి. 26

ఉ. పెండిలి గాకపోయినను
బెండ్లికియత్నమునందె, యింతపా
షండమనోవ్యథల్ గలిగె;
స్వాంతముఁ గల్మషపూర్ణమయ్యె; నే
యండజయానఁగాని యిఁక
నాత్మఁ దలంప; మితండు సత్కృపన్
దండనఁజేసి బోధన మొనర్చె
నిటుల్ ప్రకృతి ప్రభావమున్. 27

కం రామా! కృష్ణా! యనిమది
వేమాఱు భజించికొనుచు విశ్వాత్ముని లీ
లామహిమలఁగని శాశ్వత
ధామేచ్ఛఁ దపంబు సేయఁ దగదే యనుచున్. 28

కం. ఘనపశ్చాత్తప్తమతుల
మును లటు ధ్యానంబు మౌనముంబూని యనే
చ్ఛను జనిరి; దుఃఖరహితం
బును నిత్యానందమైన ముక్తి నరయుచున్. 29

తే గీ అంబరీషుండుఁ బెద్దకాలంబు నేల
నేలి, శ్రీహరిభక్తులే యెల్లయెడల
నిండఁగాఁజేసి, వైకుంఠ నిలయమునకు
శాశ్వతానందుఁడై యేగెఁ జక్రికృపను. 30

చ. పరమపవిత్రులౌ మ హరిభక్తికిఁ గేవలతాపలంబులై
వరలెడు నంబరీషకులవర్ధను లెందఱో రాజులైరి, యం
దరయఁగఁ బుట్టె నాదశరథాఖ్యుఁడు, ధార్మికచక్రవర్తి శ్రీ
హరి జనియించిమించెఁదగ నాతనియందవతారమూర్తియై.

శా. ఆసూర్యాన్వయమందునన్ దశరథనాథరాజ్ఞీమణీ
కౌసల్యాసతి రామునిన్ గనఁగనాకైకేయియున్ గాంచె, శో
భాసౌశీల్యుని బుత్రుఁగా భరతునిన్; భద్రంబుగా నాసుమి
త్రాసాధ్వీమణి లక్ష్మణాహ్వయుని నంతన్ గాంచె
శత్రుఘ్నునిన్. 32

సీ. దిశలెల్ల నిర్మల ప్రశమనభావసం
పదవహించెను ధాత్రి ముదమునందె,
సర్వర్తుసుమఫల సంపదతో వనం
బులునిండె జీవావళులు చెలంగ
సకలసస్యములతో క్ష్మాదేవి పసుపుకుం
కుమలలందినరీతి కొమరు మిగిలె
కారణంబును జెప్పంగాఁ జాలకుండియు
జనులెల్ల రానందచకితులైరి

తే. గీ. సురగణము పుష్పవృష్టులఁ గురిసినార
లప్సరస లాకసమున నృత్యము లొనర్చి
రమరవాయిద్యములు హృద్యమగుచునింగి
బోరుమని విన్చె రామావతారవేళ. 33

తే. గీ. భూమి నవతారుఁడైన శ్రీరామునకును
గార్యవశమున సంస్మృతి గలుగుచుండు
నితరవేళల నతఁడు రాజేంద్రుఁడనఁగ
మసలు మాయావృతుండగు మనుజునట్లు. 34

మ. పరిపూర్ణాత్ముఁడె మాయఁజూపుట్లనీపూ
ర్ణాత్ముండుగానొచు, నీ
నరజన్మంబు వహించె భక్తివరులన్
రక్షింపఁగా; లోకులె
వ్వరు నేపండితులైన మాయలను జూ
పన్ రాదు; వైకుంఠుఁడే
గురియర్మ్యోన్ గద పెక్కుపాట్ల! కొరులన్
గొండాడఁగా నేటికో! 35

కం॥ హరి మాయావిత్వము వం
బరీష భక్త్యాత్మచరిత వదలక నీకు నా
దరమతిఁ జెప్పితి వినఁగాఁ
బరమపవిత్రం బిదియగు భారద్వాజా.

శ్రీనారాయణ దేవమాయలను, నా
శ్రీరామజన్మంబు, న
న్యూనాశక్తిఁ బఠించినన్ వినిన ము
క్త్యంబొందు, మాయా విము
క్తానందాత్మకుఁడై, పరాత్పరుఁడు తా
నై, శాశ్వతుండై భవం
బేనాఁడున్ గనకుండు, నొందును
శుభాలీలోకమం దెప్పుడున్

ంబురుహావృత్తము –
శ్రీయుత రాఘవసిద్ధ
మనోంబుజభృంగ! జానకిఁగూడి, శో
భాయిత భర్మవినిర్మిత
రత్నమయాసనంబుననుండు భూ
నాయక! దాశరథీ! నిగమా
గమ నైజసన్నుత! రామ! నిన్
బాయక నాకవితామణి
వన్నెల వాసికెక్కి రమింపదే!

# కౌశికాభ్యుదయము

కం. శ్రీరామా! సూరీంద్రా
త్మారాధ్యా! సకలదానవాంతక! భక్త
ప్రారబ్ధ కర్మభంజక!
తారకనామా! యనంతధామోద్దామా. 1

వ. అవ్వాల్మీకియు, శిష్యుండైన భరద్వాజు నుద్దేశించి, యోయీ! యింక సీతాజన్మకారణంబు వినిపించెద నావధానుండవగు మని యిట్లనియె 2

చ. కలఁ డొకవిష్ణుభక్తుఁడయి
కౌశికసంజ్ఞ వెలుంగువాఁడు, ని
శ్చలహృదయుండు, నిత్యహరి
సన్నిధిఁ గల్గిభుజింపఁ బోయినన్
గలిత సుహృత్ప్రసంగములు
గల్గినవేళలనైన; నిద్రలోఁ
గలఁగను నప్పుడైన హరి
గానమువీడఁడు తన్మయంబునన్. 3

కం. ఆత్రేతాయుగమున నతఁ
డాత్రమున ననుక్షణమ్ము హరిగానములన్
బాత్రుఁడన నొప్పి శ్రీశ
క్షేత్రము విష్ణుస్థలమ్ముఁ జేరియు నచటన్. 4

ఉ. తాలలయానుసమన్విత సు
ధామధురోక్తులం బాడి, మార్గ్యవో
న్మీలితనేత్రుండై మిము, నవ
నీరదగాత్రుని వేదవేద్యునిన్
బాలితభక్తకాము, భవ
బంధవిమోచనుం బాడుకొందుం, దా
వేళకు బిచ్చమెత్తుచును
వీడంను విష్ణుని రూప మూన్చెంగోన్ 5

వ. ఇట్లుండం గొంతికాలంబునకు. 6

తే. గీ. అట్టి విష్ణుస్థలంబున హరిమనస్కుం
డైన కౌశికుంబిలచి, పద్మాక్షుం డనెడు
విప్రముఖ్యుండు తనయింట విందు సేయు
దినదినంబును సౌదార్యదీప్తి మెఱయ. 7

మ. సకుటుంబంబుగం గౌశికుం డటనుభిక్షన్
గొంచు, శ్రీవిష్ణుగా
నకళాతన్మయచిత్తుండైన యతనిన్,
బద్మాక్షుం డారీతి, వా
రక తద్గానరసోల్లసాత్ముండయి
చేరన్, గాల మీరీతి సా
ర్థకమై సాగెను; నిత్యశోభనముగా దా,
దైవభక్తాళికిన్. 8

వ. ఇట్లుండం గొండొకదివసంబునం, గౌశికునకుం బ్రియ
శిష్యులును వాసుదేవపరాయణులును, నాత్మజ్ఞానులు నైన

య్యొగు బ్రాహ్మణులు వైశ్యులుం గలసి, శ్రీవిష్ణుక్షేత్రం
బున కేతెంచి సద్గురుపాదసందర్శనానందులై యుండ
నా క్షేత్రంబునందు. 9

ఉ భక్తుఁడు మాళవాహ్వయుఁడు
వైశ్యుఁడు, శ్రీహరిపాదపద్మ సం
సక్తమనస్కుఁడై యలరి;
నాతనిభార్య భర్తృహితైక భావ స
ద్వ్యక్తియునైన మాలతి, ముదం
బున నాతని ధర్మపత్నియై
శక్తికొలంది సేవలను సల్పును,
వైష్ణవభక్తమండలిన్ 10

తే. గీ ఆహరిక్షేత్రమందుఁ దా ననుదినంబు
గోమయాను వేపనములఁ గూర్చి, రంగ
వల్లులం దీర్చి, భర్తతో భక్తిమీర
వినును గౌశికు హరిగాన విమలమహిమ 11

తే. గీ ఆకుశస్థలి నున్న బ్రాహ్మణులు, వ్రతప
రాయణులు గాన విద్యావిరాజమాన
తత్త్వవేదులు, కౌశికోద్భాసమాన
విష్ణుగానంబు వినుచుండ్రు వీనులలర. 12

వ. ఇట్లు కౌశికుం డొనర్చు శ్రీహరిసంకీర్తనానందకంద
ళిత హృదయారవిందులైన భక్తసందోహంబు దినదినప్రవర్ధ
మానంబై యుండ, భూమి నెల్లెడలఁ దత్కీర్తి విస్తరించె.
అంతం గళింగాధీశ్వరుండును, గౌశికవృత్తాంతంబంతంతన
యాలకించి, విష్ణుక్షేత్రంబునకు నేగుదెంచి యిట్లనియె. 13

మ. సరసంబై యలరారుఁ, గౌశిక ! భవ
త్సంగీత సాహిత్యముల్
ధర సర్వానికి సార్థకంబుగ ననున్
ధాత్రీశుఁ గీర్తింపుమా !
వరభోగంబుల నందుమా! సకలవి
ద్వద్గ్రామణీ సత్సభాం
తర దివ్యోన్నతపీఠముం గొని, మహో
త్సాహంబుఁ బాలింపుమా. 14

కం. నీవున్ నిశిష్యులు, సం
భావన నను బొగడవలయుఁ బరమానందం
బై, వినవలయు జనౌఘము
నావిని కౌశికుఁడు శాంతనయముల ననియెన్. 15

కం. ఓరాజా! నా నాలుక
నారాయణ గుణకథానునయ కీర్తనలన్
వారని భక్తిన్ గడుపును
వేరొకనిఁ తలంపదెంత విభవోపేతున్. 16

వ. మఱియు నాకౌశికశిష్యులైన, వశిష్ఠగౌతమామాంశి సారస్వత వైశ్యచిత్రమాల శిశువులనంబడు నేస్తురుం బాడి గురువాక్యంబులనే యనువదించిరి. అప్పురవాసులై నిరంతర హరినామ సంకీర్తనాపరులై శ్రీకరులైన భక్తులెల్లరును నాగౌతమవాక్యంబు లనే పునరావృతంబు గావించిన 17

తే. గీ. ఎంతఁ జెప్పినఁగాని తా నిచ్చగించ
నట్టి యాభక్తవిప్రుల నరసి, రాజు
కోపఘూర్ణిత నేత్రుఁడై కుటిలబుద్ధిఁ
గలిగి యిట్లను స్వభట సంఘంబుతోడ 18

ఉ. పాయక నాదుశాసనము వ
ర్తిలఁ జేయుఁడు, పీను బ్రాహ్మణుల్
న్యాయము దప్పి సేయు హరినా
మగుణోన్నత గానశబ్దమే
చాయను నెవ్వరున్ విననిచాయ
మదీయయశోనుకీర్తనల్
జేయుఁడు! వాద్యఘోషముల ని
త్యము నీపురి నెల్లతావులన్. 19

ఉ. అంతట నా కళింగవిభు
నాజ్ఞభటావళి యాక్షణంబె య
త్యంతము వాద్యఘోషముల నప్పుర
మందున మూలమూలలన్
బంతముమీరఁ గర్ణపుటవారము
గింగురువెట్ట బోరనన్
గంతులువైచుచున్ బ్రభునిగాన
మొనర్చిరి; విష్ణుభక్తులున్. 20

తే. గీ. రాజశాసనమాట, మౌర్ఖ్యమునుగల్గు
బంటులాటను వారింపవఁనుగాక
నెంతఁగాఁ జెవుల్ మూసినఁ, గొంతమైన
వినఁగనయ్యెను మానవవిభుని వినుతి. 21

చ. హరిపదపంకజంబులను
నాత్మలనిల్పియు, విష్ణుదేవ నా
మ రహితమ_ర్యకీ_ర్తనల,
మానసమైన్యము నొంది, శూలముల్
గిరములఁబట్టి దారుణము
గాఁజెవులంటఁగ గ్రుచ్చుకొన్నయా
హరిపరభ_క్తి నిర్మలమ
హాత్ములు హాయినిగాంచి ర_త్తఱిన్. 22

కం; ఆరాజభటులు భక్తా
వారము సుఖముంటఁజూచి, వక్రఘోషితులన్
మీరును మాతో నాడుచు
మారాజు నుతింపుఁడనుచు మంతఁదనమునన్. 23

కం. పలుకుచు సంజ్ఞలొనర్పఁగఁ
దలఁకుచు నవ్వారు విష్ణుతత్పరమతులై
యలయక చురకత్తుల నా
ల్కలు చెగిపడఁ గోసికొనిరి; కడు నవలీలన్. 24

శా ఆకాళింగవిభుండు వైష్ణవ గణ
వ్యాపారముల్ గాంచి, చి
త్తైకాహంక్రియఁ గోపఘూర్ణిత
ముఖుండై. యీర్ష్యతో వారి న
ఱ్ఱాకల్ వెట్టఁదలంచి; 'పోవలయు
మీరల్ రాజవిద్రోహులా
రా ! కాలంబు సహించ'నంచుఁ గృత
వైరస్ఫూ_ర్తిఁ దావెండియున్. 25

కం. వారల సర్వస్వముఁ గొని
యా రాజ్యము వీడిపోవ నాజ్ఞాపింపన్
నారాయణునై కథనులై
కారడవుల నుత్తరంబుగాఁ బోయిరటుల్. 26

కం. ధనమద మధికారమదం
బునుగల యాభూమిపాల మూర్ఖునివారల్
మనములనైన స్మరింపర
విను సాత్త్వికభక్తవరుల విధమిదియెగదా! 27

కం. ఆవిధినడవులఁ బడి యా
భూవిబుధులు పోయిపోయి మోదాత్మకులై
యావిష్ణునె ధ్యానించుచు
నావల నుత్తరధరిత్రి కరిగిరివారల్. 28

ఉ. ఉత్తరదేశ మేఁగిన మహోదయు లాహరిభక్తు లెల్లరున్
జిత్తము లాపరాత్పరుని జెందఁగ దేహములెల్ల వీడఁగా
నిత్తఱి వీరికిన్ దగిన దేవధమానోయటం చుబ్రహ్మయున్
దత్తఱపాటునన్ సురవితానముఁబిల్చి వచించె నీగతిన్. 29

తే. గీ. దేవతాధిపులార! భక్తిప్రపత్తు
లనుపమానముగా,హరి ననవరతముఁ
గీర్తనాయత్తచిత్త సద్వర్తులైన
కౌశికాదులఁ గొనిరండు కలుగుశుభము. 30

తే. గీ. ఆవిరించికి దిక్పాలకాది సురలు
శీర్షములవంచి ప్రణుతులఁజేసి, తత్ష

ణామున నేగియు భయభక్తి నమితులగుచుఁ
గాశికాదుల వేర్వేరుగాఁగఁబిలిచి 31

వ. వ్యోమయానంబుల నర్ధనిమేషంబున నవ్వారిం దోడ్కొని బ్రహ్మలోకంబునకుం జనుదేర, నాపితామహుండును నప్పరమభక్తుల కెదురేగి స్వాగతంబుం బలికి, సుఖాసీనులఁ గావించి యథోక్తంబుగ నర్చించె 32

తే. గీ. ఓ భరద్వాజ! బ్రహ్మయే శోభనార్థి
యూచు వారలనర్చింప, నమరగణము
లచ్చెరువు నంది నిశ్చేష్టులైచు నరసి
యెల్లవారలు వారి నుతించినారు. 33

తే. గీ. దేవగణములతో బ్రహ్మదేవుఁ డప్పు
డాదరము సూపి కౌశికాద్యఖిల విప్ర
భక్తబృందంబుఁ దోడ్కొని పద్మనాభు
సన్నిధికి నేఁగె, సంతోషసారగరిమ. 34

వ. అవ్వైకుంఠంబున శ్రీమన్నారాయణుండును. 35

సీ. జ్ఞానమోక్షైశ్వర్యఘనులు శ్వేతద్వీప
వాసులు హరిభక్తవర్యు లనఁగ
విష్ణుచిహ్నంబుల వెలుఁగుచు, నాల్గుభు
జంబులఁ గలిగి శోభాఢ్యులౌచు
సనకులు సిద్ధులు నాత్మస్వయంప్రకా
శులు ననుక్షణము సంశుద్ధులౌచు
ఘనమనోవేగంబు కంటెనుమించిన
వేగంబు గలిగిన విబుధులౌచు

తే. గీ. సభ్యులెల్లరుఁ దనుఁగొల్వ సనకనార
దాది సన్మునిగణములు నఖిలభూత
సంఘమును దేవతాస్త్రీలు సన్నుతింప
నామహాసభమధ్య శ్రీహరి వెలింగె. 36

వ. ఓ భరద్వాజా! అట్టిసమయంబున నా సభాంతరంబున నుండు మహాద్భాగ్యంబు నాకునుం గలిగె. మఱియు వినుము! వేయి యోజనంబుల పొడవును వేయిద్వారంబులుం గలిగి, మణిమయంబై, శుభోదర్కంబై నిర్మలంబైన యొక్కవిమాన మధ్యంబున భద్రసింహాసనారూఢుండై శ్రీమహావిష్ణుండు లోక కార్యప్రసక్తులైన సభ్యభక్తజనంబులఁ గటాక్షించు నవస రంబున. 37

తే. గీ. అమ్మహావిష్ణు దర్శించినట్టి బ్రహ్మ
కౌశికాదులు సాష్టాంగకలన మ్రొక్కి
వినయవినమితగాత్రులై వినుతిసేసి
రతులసద్భక్తిఁ దనయులౌచు వారు. 38

శ్రీనారాయణ! వాసుదేవ! జయ
లక్ష్మీనాథ! సర్వేశ్వరా!
దీనోద్ధారక! సత్యమూర్తి! త్రిగుణా
తీతా! జగన్మోహనా!
గానానంద! సనందనాదివినుతా!
కాలాత్మకా! శ్రీహరీ!
ధ్యానాయత్త మునీంద్రచిత్త విలస
ద్వ్యాపార! పీతాంబరా! 39

ఉ. వేయి శిరంబులం గలిగి
విద్యలనెల్ల నెఱింగి,నిన్ సదా
కాయమునన్ భరించు ఫణి
గణ్యుఁడు శేషుఁడె నీ మహ
త్త్వాయత కీర్తనల్ సలుప
నంత మెఱుంగఁ డటన్న, మాదృశుల్
బాయనిభక్తి మ్రొక్కుటయె
పండువుగాదె! రమామనోహరా! 40

శా. ఈవిశ్వంబున కెల్ల సత్త్వగుణమేయీరీతి నిల్వంగ, నో
దేవా! రక్షణసేయుచున్నది రజోత్తేజంబు; సర్వంబు నీ
లోన త్రిల్లలయంబొనర్చుఁ దమ, మో లోకేశ్వరా! నిపుణా
జ్ఞావర్ధిష్ణుత నీగుణత్రయవిలాసం బొప్పదే! శ్రీహరీ! 41

వ. మఱియు ననేకప్రకారంబుల వినుతించువారలం
గాంచి మహావిష్ణుండు. 42

చ. జయజయ! మాధవా! యనెడు
శబ్దము లెల్లెడ మిన్నుముట్టె, న
వ్యయుఁడగు విష్ణుదేవుఁడును
బ్రహ్మను జేరఁగఁ జీఱి, మునులన్
బ్రియమునఁ గౌశికాదులను
బిల్చి స్వకీయజనంబుమాడ్కి; ని
శ్చయమగు రక్తిఁ జూపి ముర
జధ్వనితో హరి యిట్లువాకొనెన్. 43

సీ. ఓ చతురాననా! యొకమాఱు వినుమోయి
కౌశికు గార్గ్యమహా గానమునకు
సాఖ్యసాధకులైన సరసాగ్రగణ్యులు
నాకుశస్థలినుండు నఖిలజనులు
మత్కీర్తి వినుచు నిర్మలచిత్తులౌ వారు
గానవిద్యాతత్త్వ ధీనిరతులు
ననవరతంబు నన్యంబెఱుంగక నన్నె
భజియింతు బ్రాహ్మణవరులు వారు

తే. గీ. సాఖ్యదేవతతో మనిచ్చటనె యుండి
నాదుసామీప్య మంది యుండంగవలయుఁ
గాన నీవట్లు వారలఁ గరుణసేయు
మను మ, నారాయణుండుఁ దా ననియెమఱియు. 44

తే. గీ. కౌశికా! నీదుప్రాజ్ఞతఁ గంటి; నీవు
బలుఁడవౌదువు, గాణాధిపత్య మంది
యెచ్చటెచ్చట నే వసియించుచుందు
నచ్చటచ్చటనే యుండుమయ్య! నీవు. 45

వ. వెండియు నప్పద్మనాభుండు. 46

ఉ. 'మాలతిఁ' గూడియున్న యల
'మాళవు' నిన్ గని, మీరు భక్తినా
లీలలు శ్రద్ధతో వినుచు,
రేఁబవలున్ నను సేవసేయుమన్

గాలము పుచ్చియుంటఁ గల
కాలము మామకలోకమందు నీ
కాలుమగల్ చరింపఁదగు
హాయిగ నెల్లెడ నెల్లవేళలన్ 47

తే. గీ. ఓమహాశయ! పద్మాక్ష! యోగిభక్త!
నీవు ఘనమూఁడవై యుండి నిఖిలధనము
లకుఁను నధిపతివగుమోయి! లలితరక్తి
ననుభవింపుము భోగభాగ్యముల నెప్డు 48

వ. అని వెండియు బ్రహ్మదేవుంగాంచి నారాయణుం
డిట్లనియె. 49

సీ. ఇటుకౌశికుఁడు గణాధీశ్వరుఁడై యుండె
దా నొనర్చిన సుకృతంబుకతన
సకలజనంబు లీ సన్మూర్తి నను గొల్చి
ఘనతరమగు సలోకత్వ మంది
న్యాయమార్గమున ననన్యభక్తిని శంకు
వులఁ గర్ణపుటములఁ బాడిచికొనియు
ననృకీర్తనవిన నాత్మఁ గోరనివార
లాట, దేవత్వంబు నంది, మఱియు

తే. గీ. నతుల సాన్నిధ్యభాగ్యంబు నందినారు
మాలతీమాళవులు గానమానములను
నన్ను నర్చించి నాకీర్తనముల వినుట
నాసనాతనలోక నివాసులైరి, 50

శా. ఈపద్మాక్షుఁడు కౌశికాదులకు సం
తృప్తిన్ ధనంబీయఁగాఁ
బ్రాపై మామక దివ్యకీర్తనలు స
ద్భక్తిన్ వినన్, వీనికిన్
బ్రాపించెన్ ధనదేశ్వరత్వ సుమహా
భాగ్యంబు మత్సన్నిధిన్
నాపాదాబ్జయుగంబె నమ్మిన లస
న్మాన్యుల్ గదా! యెల్లరున్. 51

వ. అనుచు నివ్విధంబున విరించిం దృప్తుఁగావించి, సకల లోక పూజితుండును సర్వశరణ్యుండును నైన శ్రీమహావిష్ణువు రమాసమేతుండై, సమస్తభక్త పరివారపరివృతుండై రత్న ఖచిత కనకసింహాసనారూఢుండై యుండ నెల్లవారు జయ జయ ధ్వానంబు మిన్నుముట్ట వినుతించిరి.

మనోరమావృత్తము —

హరిహరాత్మకా! యఘౌఘ నా
శ! రఘువంశ! దాసపోష! ని
ర్జరనుతా! నిశాచరాంతకా!
పరమగాన తృప్త! చిన్మయా!



# నారదమాత్సర్యము

కం. శ్రీకర ! సుగుణాకర ! దే
వా ! కరుణారస పయోబ్ధి ! భక్తార్తిహరా !
శ్రీకమలాక్షా ! రఘుకుల
రాకాశశి ! శ్రీకిరాఖ్య ! రామా ! శ్యామా ! 1

వ. ఓయి భరద్వాజా ! ఒక్కవిశేషంబు నాలింపు మని వాల్మీకి యిట్లనియె

తే. గీ. ఆపరాశక్తిమూర్తియే యాదిలక్ష్మి
శ్రీమతియునాఁగ నుండుట, శ్రీహరికడ
ముందెయున్నట్టి యాలక్ష్మియందు నాఁడు
శ్రీమతియు నైక్యమున్ బొంది చెన్నుమిగిలె. 2

వ. కొంతొక సమయంబున వైకుంఠంబునందు శ్రీమన్నారాయణు సభాంతరంబునఁ గౌశికాది భక్తసమాగమంబునకుం బరమానందంబుగా శ్రీమహాలక్ష్మి ప్రీత్యర్థంబై మృదుమధుర రస యుక్తంబై గానరసోల్బణంబైన యొక్క మహోత్సవం బయ్యె నద్దానిం దిలకింప నమ్మహాలక్ష్మిదేవియు.

సీ. అడుగుల మడుఁగులన్ దడబడియొత్తుచు
సఖులు గొందఱు ముందు సాగుచుండ

నిరువంకలను మనోహర చామరంబులన్
గాచి, కొందఱు చెలుల్ వీచుచుండ
వేణువీణావాద్య విద్యావిశేష సం
పదఁ గొందఱబలలు పాడుచుండ
జయజయధ్వాను లొక్కసరణి నూటిగ మిన్ను
ముట్టఁ, గొందఱు సతుల్ వొగడుచుండ

తే. గీ. నరుగుదెంచె మహాలక్ష్మి హరిసభాంత
రమున వర్తిల్లు నుత్సవార్థంబు తాను;
నగణిత పరివారము తన్ను నావరింప
సరసగుణమణి జగజ్జనని దేవి 5

వ. అట్టి మహా కోలాహల సమయంబున 6

ఉ. ఆదట నాసభన్ గల మహా
త్ములు త్రొక్కిసలాడుచుండ, బ్ర
హ్మాదుల నెల్లవారలను
నారసి, 'యడ్డములెండ'టంచు, 'వా
గ్వాదముమాని దూరముగ
వర్తిలుఁ'డంచు చటవేత్రహస్తులై
కాదనువారు లేమి, త్వర
గా నటుమార్గము సేసి రాభటుల్. 7

తే. గీ. అంత బ్రహ్మాదులెల్ల రత్యాదరమున
వచ్చు జగదేకమాతృ వైభవము గనుచు
వాద్యఘోషలుగల గానఫణితి వినుచు
దవ్వుదవ్వులఁ దొలఁగి రాత్మలను వలరి.

వ. అవ్విఘంబున నరుదెంచి 9

శా. జ్ఞానాకారుఁడు యోగిహృత్కమల భా
స్వన్మూర్తియై చిత్సుఖా
నానందాత్మకుఁడై చరాచర జగ
ద్వ్యాపారుఁడై డాపలన్
మానప్రాణ ధనాదులిచ్చి సతతం
బ్రక్షింపఁగాఁ గోరు న, నా
శ్రీనారాయణ వామభాగియయి ల
క్ష్మీదేవి కూర్చుండఁగన్ 10

సీ. సనకసనందనాది నిలింపమునిశ్రేష్ఠు
వేదఘోషలను సద్యోతిసేయ
నారదాదులు విపంచికల గాంధర్వ
గానమాధురిని సంస్తుతులఁ గొలువఁ
శౌనకాదిక భక్తగణ మంతయును, సన్న
యుతఁ గీర్తనలతోడ నుతు లొనర్ప
నింద్రాది దిక్పాలురెల్లరు దేవతల్
గొంతెత్తి బహుపరాక్కులను బలుక

తే. గీ. సకల భువనైకమోహన ప్రకట దివ్య
రత్నసింహాసన ప్రభారాజి మధ్య
నీలమేఘమువిద్యు దన్వితమనంగ
విష్ణుదేవుండు లక్ష్మితో వెలసి యలరె. 11

కం. ఆవిధి నలరుచు లక్ష్మీ
దేవియుఁ దుంబురునిఁ బిలువఁ దెల్పినఁ, జెలులున్

వేవేగఁ గొనితెచ్చిరి,
యావిష్ణు సభాంతరస్థుఁ డగు నవ్వానిన్. 12

ఉ. నారదుఁడాది సన్మునిజ
న ప్రకరమ్ములు, సర్వదేవతా
వారముఁ, గౌశికాదులుం
బితృగణంబులుం జాల నుండఁగా
శ్రీరమణీసమేతుఁడయి
శ్రీహరి తుంబురుగానమాధురిన్
గోరిక నాతఁ డంత వినె
సంస్థితసారసభావగానమున్. 13

వ. అట్టియెడ సభాస్తారు లిట్లని తలపోసిరి 14

ఉ. కొందఱు వేదపాఠులును
గొందఱు గానకళావిశారదుల్
కొందఱు తత్త్వవేత్తలును
గూడిన యీసురమాని భక్తస
ద్బృందము దవ్వులన్ నిలువఁ
బ్రియమునఁ దుంబురుఁ బిల్చె నీతఁ డీ
య్యలనాలోన నెంతటి య
హీనకళా విభవాత్ముఁడో గదా! 15

కం. అని యచ్చెరువున నెల్లరుఁ
గనుచుండఁగఁ దుంబురుఁడు ఘనదివ్యవిభూ
షణ రత్నదీధితుల శో
భనుఁడై బహుమానమంది వచ్చుచునుండన్ 16

శా. శ్రీనారాయణుఁడే స్వయమ్ముగను ల
క్ష్మీదేవితోఁ గూడి స
మ్మానం బింతయొనర్చె, నెంతటి సుహృ
న్మాన్యుండవో తుంబురా!
కానంజాలము పూర్వ మిట్టి ఘనతన్, ని
గానంబు నాలింపఁగా
ఔరా నే! నెంతటి వాఁడవో' యనుచు నా
హ్లాదంబు చూపింపఁగన్. 17

కం. శ్రీలక్ష్మీనారాయణ
పాలిత బ్రహ్మాదిదేవ చక్రజనంబా
లీలలఁ గని యానందించి చె
చేలన్ పొగిలుచుఁ బ్రణుత శీర్షములలరన్ 18

ఇట్లు శ్రీహరి యనుగ్రహింప నెల్లరుం దమతమ నిలయంబు
లకుం జనిరంత నారదుండు మహతి మీటుచుం బోక తన
మనంబున. 19

ఉ. 'నారదగాన' మన్నదియె
నల్దిశలన్ ఘనకీర్తి నందె; నీ
శ్రీరమణుండు నన్నెపుడుఁ
జేరఁగఁ జీరి, మదీయ గానవి
ద్యారభటీశ్రుతిన్ మిగుల
హాయిని బొందుచు గారవించు, నీ
నారమణీయ వాద్యమున
నాసముఁ డెవ్వఁడు ముజ్జగంబులన్. 20

మ. సచ్ఛ్లోకంబులఁ గల్గు పండితమునుల్
పూజించి కైసేయఁ నిం
కెల్లన్ భక్తిఁ బితామహాది సురలెం
తేఁ గొల్వ, నారాయణుం
డుల్లాసంబడ, లక్ష్మి తుంబురుని నెం
తో మెచ్చి పిల్పించి, సం
పల్లాభంబగు దివ్యభూషలను సం
భావించె నిప్పట్టునన్. 21

తనకాంతాహానికాత్మతృప్తికయి, యో
తన్మాత్రు నీతుంబురున్
ఘనసత్కారముఁ జేసి పంపె; నటులే
గాకున్న సంగీతనా
ధనలోనాకుసమానుఁ డొండుగలఁడే
తానై మహావిష్ణువే
వనితాలాలసుఁడై చరించె నిటు, స
ఖ్యత్వంబు నూహింపకే. 22

సీ. సంగీతసత్కళాచక్రవర్తిని నన్ను
విడచి సామాన్యుని బిలువఁదగునె?
పిలిచెఁబో, యాతని బెద్దఁగాఁ జేయుచు
వివిధభూషల గౌరవింపఁదగునె?
గౌరవించెనుబో, ప్రకాశంబుగాఁ దాన
విద్వాంసుఁడని విజ్ఞపీగఁదగునె?
విజ్ఞపీగెనుబో, వివేకంబు విడచి, బ్ర
హ్మములాతని ఘనుండనఁగఁ దగునె!

తే గీ. కన్నులారంగ నిన్నియుఁ గాంచుచుండి
వీనులారంగ నిన్నియు వినుచునుండి
యిట్టి యవమానమెల్లను సహించువాఁడ
నగుదు, లోలోనఁ గ్రోధాగ్ని కనలుచుండ 23

కం. ఒడలు కిసుకేఁడిఁ జూపన్
దడబడుచును మూర్ఛనంది తమపటి తెలివిన్
బడసియుఁ గోపోద్రేకం
బుడుగనిమతి నారదుండు నోటికి రగులన్ 24

వ. అంతట నెదుటనున్న లక్ష్మీనారాయణుల నిరీక్షించి 25

తే గీ. బెత్తములువట్టి రాణివాసీలలామ
దాసిదాసీజనం బయ్యెడాగి నన్ను
పరువఁజేసిన యీలక్ష్మి దానవాన్వ
యమున జన్మించుఁగాక! యియ్యతివమటియు. 26

తే. గీ ఈమె దాసీజనం బవహేళనముల
నన్ను నవమానితుం జేసియున్నవారు
కాన నీలక్ష్మి రాక్షసీగణముచేత
హేళనమ్ములఁ గుములుచు నిలను బుట్టి. 27

కం. అని శపియించిన నారద
ముని వచనమ్ములకు వడకె భువనత్రితయం
బును, తత్త్వమెఱిఁగి నారా
యణుఁడున్ మందస్మితాస్యుఁడై వినుచుండెన్ 28

కం నాకులు గంధర్వులు హా
హాకారమ్ముల నొనర్చి రబ్బురపడి, తా

మాక్రించిన తోడనె
ప్రాకృతుఁ డీనారదుఁడు బాలిశుఁడనుచున్. 29

వ. మఱియు నారదుండుం దనమనంబున. 30

ఉ. పాయక సన్నిధానమున
వర్తిలు నేదవ్రుకవ్వులేగ, న
న్యాయముగాఁగఁ ద్రోలఁబడి
నాఁడను, దూరగుఁడైన తుంబురుం
డాయతి గౌరవం వెసఁగ
నాహరి సన్నిధిఁ బిల్వఁబోయె, నా
రాయణుఁ డాది లక్ష్మి విని
రాతనిగానము నేకతంబునన్. 31

ఉ. ఇంతటి మానహీనతను
నీపయినేఁ దలయెత్తికొంచు, వి
శ్వాంతరవర్తినై యెచటనై
నను, నెవ్వరిముందు నిల్వఁగా
నెంతయు మోముచెల్లునె? యి
సీ! యికజన్మ మిదేల? నిట్లు నా
పంతములెల్ల బూదిఁ గలు
పంబడు నంచుఁ దలంప నెన్నండున్. 32

ఉ. గానకళాప్రభావమునఁ
గాదని నన్నెదిరించి నిల్చు వి
ద్యానిధి మూఁడులోకముల
యందును లేఁడను కీర్తిఁగాంచి, సు

జ్ఞానఘనుండు, భక్తజన
గణ్యుఁడునా, యశమంది, నేఁటికే
హీనతగల్గ సేవకుల
ధిక్కృతి నందితి నేమిచెప్పుమా? 33

వ. అని యీ విధంబున లోలో వగచుచున్న నారదుం
గాంచి 34

కం. అంతట శ్రీహరి లక్ష్మీ
కాంతియుఁ దన్ననుగమింప, ఘనతరమాయా
నంతవిలాసుఁడు నారదు
చెంతకుఁ దావచ్చినంత, శ్రీయిట్లనియెన్. 35

ఉ॥ ఓమునివర్య! తావక మ
హోజ్జ్వలశాపము తప్పిపోవునే?
నామనవిన్ వినందగు, వ
నౌకస గాత్రము ద్రోసిఁబట్టి, యే
భామిని జిహ్వకుం జీవులు
పుట్టఁగఁ గొంచెము కొంచె మాయనో,
యామెకుఁ గ్రూరరాక్షసికి
నాత్మజఁగా జనియింపఁ బ్రోవుమా. 36

వ. అనవిని బ్రహ్మమానసపుత్త్రుండైన నారదమునీంద్రుఁడు, పవిత్రభావగర్భితంబులైన మహాలక్ష్మి వచనంబుల కలరి 'వల్లె' యన శ్రీమన్నారాయణుం డిట్లనియె. 37

కనెన్ని దానంబులన్
విన్నాణంబుగఁ జేసియుండినను, మ
త్ప్రేమంబలభ్యంబు; తాఁ
గన్నుల్ బాష్పములొప్ప నాదుసుగుణో
ద్గానంబులన్ మత్తుఁడై
యున్నన్ నిత్యము నామసంస్మరణ
లో నున్నన్ మదాత్మీయుఁడౌ 38

ఉ. ఇచ్చటఁ గౌశికాదులకు
నిచ్చిన సన్నిధిఁ జూచినావుగా!
మెచ్చుటకైన గానముల
మూర్ఛలన్ హృదయంబులందు నే
నచ్చుపడంగ నిల్పుకొని
యన్నియుపేడి మదీయకీర్తనల్
నిచ్చలొనర్చుచుండుట నే
నిల్చెదను మ్మట దివ్యమూర్తులై 39

ఉ. కేవలమైన నాసుగుణ
కీర్తనలన్ దగుమూర్ఛనాదులన్
భావమెలర్ప వీణియను
బట్టి ఘనంబుగ నన్నుఁగొల్చు స
ద్భావుకుఁ డౌట మాయుగళ
భావములందున నిల్చె నేడుసం
భావితుఁ డయ్యెఁ దుంబురుఁడు
వర్తిలుమీరును నవ్విధంబునన్. 40

ఉ. క్రోధముమాను! మానసస
రోవరతీరపు టుత్తరంబునన్
భూధరమం దులూకలము
పొందుగ నున్నది, 'గానబంధు' నాన్
బోధలొనర్చు సర్వమును;
బొమ్మిక! నాతనినుండి నీమనో
వ్యాధిఁ దొలంగఁజేసికొను
మంతియు నీకు శుభాంతమయ్యెడిన్. 41

వ. అంత నారదుండును బశ్చాత్తప్తుండై 42

కం. తనకోపంబును శాపముఁ
గని వినియును, మాధవుండు కరుణామయుఁడై
యనుమాటలు వరములుగాఁ
గొని, నారదుఁ డరిగె స్పర్థఁగూడినబుద్ధిన్. 43

తే. గీ నారదుండును నారాయణ ప్రబోధ
మాలకించి 'యులూకలు' నాశ్రమమున
కరిగి, యట దేవగంధర్వయక్షకిన్న
రాప్సరో గణములఁ గాంచె నతనిమ్రోల 44

ఉ. అచ్చట వారలందఱు మ
హాత్తర శిక్షణలంది, గానసం
పచ్చరితార్థులై, పరమ
భక్తులుఁ గోమలకంఠనాదులున్

పచ్చని మేల్సువర్ణసమ
వర్ణశరీరులునై, యులూకలున్
బొచ్చెము లేని సేవలను
బూని యొనర్చుచు నుండిరందఱున్ 45

ఉ. ద్వారమునుండి నారదుఁడు
వచ్చినయంతనె, గానబంధువున్
జేరఁగఁజేరి, గౌరవవి
శేషములన్ బరితుష్టుఁ జేసి, యో
నారద! యేమిగా వలచి
నన్ను గృతార్థుని జేయ నిర్విధిన్
భారము నాక, వచ్చితివి?
నాపని యేమొ యెఱుంగఁ బల్కుమా! 46

ఉ, నావుఁడు నారదుండు ముని
నాథుఁ డులూకలుఁ జూచి, యిట్లనున్
శ్రీవిభుఁ డింతకున్ మును, ప్ర
సిద్ధసభాస్థలినుండి, సన్మునీం
ద్రావృతుఁడై, పితామహాము
ఖామరవర్గముఁ గొల్వ, గానసం
భావితకౌశికాదులకు
భాగ్యము పండ ననుగ్రహించినన్. 47

చెలికత్తెల్ దనుఁ గొల్వ, ల
క్ష్మియరుదెంచెన్ దత్సభామండప
స్థలికిన్ శ్రీహరిఁ గూడి గాన
రసమాస్వాదింప. నా వేత్రహ

స్తులు బ్రహ్మాదుల మమ్ము మా
రగులుగాఁ దోలంగ, నంతంత, శ్రీ
లలనారత్నము తుంబురాఖ్యునటఁ బి
ల్వం జేసి తద్గానమున్. 48

ఉ. వీనులవిందుగా వినియు
వేయివిధంబుల సంస్తుతించి స
మ్మానము సేసె, భూషలను
మానికముల్ మెఱయంగ; నంతనా
మానసమందు నీసువొడ
మంగఁ బరాభవమంది, లక్ష్మికిన్
బూనిశపింప, శ్రీహరి య
మోఘవచస్కుఁడు పల్కెనీగతిన్. 49

తే. గీ. నారదా! నీ వులూకుఁ జేరి, గాన
విద్యయందునఁ దత్త్వసంవేదివగుము!
తుంబురుని తోడఁ దులఁ దూఁగుదువనిన, గురు
వర్యునిగ నిన్ను సేవింపవచ్చినాఁడ. 50

కం. గానమునంగల తత్త్వ
జ్ఞానము నుపదేశమిమ్ము! సార్థకమతినై
పూని హరిసేవ సేయఁగ
దీనతఁగనకుండ నన్ను దీవింపఁగదే! 51

కం. అనవినిన గానబంధువు
విను! మునివర! యొక్కకథను విభ్రమజనకం

బనఁ, గానమహిమఁ దెలియఁగ
ననువఁగ నఘరాశితోలఁగు నాలించినచోన్. 52

ప్రహరణ కలితము.—

సలలితహరియంశను పరశువుతో
చలమున నెదిరించఁగ, గబగబచం
చలుఁడయి భృగువంశఘనుఁడు నినుఁజే
రి, లఘుత జయమున్ రఘువర ! గొనవే ! 53



# భువనేశ్వరుని చరిత్ర

కం. శ్రీ రఘువర! యఘనాశక!
తారకనామా! సమస్త తాపసవంద్యా!
క్రూరాసుర భంజక! ధా
త్రీరమణా! రామచంద్ర! దేవేంద్రనుతా! 1

వ. వాల్మీకి భారద్వాజుంగాంచి, భువనేశ్వరచరిత్రను
లూకలు వచనంబుగా నిట్లనియె. 2

సీ. భువనేశుండను పేర భూమీశుఁడొక్కఁడు
కలఁడు ధార్మికుఁడు సత్కర్మయోగి
యశ్వమేధంబుల, నావాజపేయాది
యాగదీక్షితుఁడు ధన్యాత్ముఁడతఁడు
గోభూసువర్ణాది కోట్యర్బుదంబులు
విప్రులకిచ్చిన విమలయశుఁడు
వేదశాస్త్రప్రోక్త విధులనేమరక, ని
త్యముఁ గాలముంబుచ్చు ధర్మచిత్తుఁ

తే. గీ. డతఁడు తనరాజ్యమందు నెందైనఁగాని
శ్రీహరిని గానయోగాన సేవసేయఁ
దగదటంచును శాసించి, తగినభటుల
నెల్లయెడలను నియమించి యేలుచుండె. 3

ఉ. విప్రులు వేదపారముల
నెల్లవలెన్; దగ నన్నిజాతులున్
శ్రీప్రభ నెల్లి భక్తిమెయిఁ
దెల్లముగాఁగ మదీయసద్గుణ
శ్రీప్రకటంబుగాఁగఁ గడు
ప్రేమనుగానము సేయఁగావలెన్
యీప్రజ నాదు శాసనము
నెల్లెడఁ దప్పదటంచ హాంకృతిన్. 4

ఉ. ఈవిధి సూతమాగధుల
కెల్లర కాజ్ఞలు చేసి; దివ్యశో
భావహమై ధరిత్రి వెలయన్
బరిపాలనఁ జేసె; నిత్యమున్
దేవతలున్ మునీంద్ర ధరణీ
సురవర్గము దృప్తిఁ జెంద సం
భావన సేయుచున్, నిగమ
మార్గముఁ దప్పక కర్మయోగియై 5

వ. ఇట్లుండఁ గొంతకాలంబునకు. 6

మ. హరిమిత్రుండను బ్రాహ్మణోత్తముఁడు భ
క్త్యావేశభావుండుఁ బ్రే
మ రసోదంచిత చిత్తవృత్తి, హరినా
మం బాగుణోత్కర్షమున్

బరితుష్టిన్ నిరతంబు గానమొనరిం
పన్ దాని నాపౌరులె
ల్లను రాజాజ్ఞకుఁ భీతులయ్యు నొకమూఁ ల
విందురాసక్తితోన్. 7

వ. ఇట్లుండ నాహరిమిత్రుండు. 8

మ. అది యేకాదశి, జాహ్నవిపులినభాగ్య
మ్మౌము, యందెంతయున్
మనమారన్ హరిమూర్తి నిల్పియు, సుమం
బుల్ ధూపదీపంబులున్
గదళీద్రాక్షఫలాదులున్ వెలయఁగాఁ
గర్పూరనీరాజనా
ది దుకూలద్వయిఁగూర్చి, వేదవిధి నెం
తే భక్తిఁ బూజించుచున్. 9

శా. శ్రీమద్విష్ణుని దివ్యనామములతోఁ
జెల్వొందు తద్దివ్యలీ
లామాహాత్మ్య విశేషభావములతో
లావణ్యలాలిత్యభా
షామాధుర్యముతోడఁ గీర్తనముల
శ్రాంతంబుగావింప, నా
త్మామోదంబుగ గానముల్సలిపి భ
క్త్యావేశగాత్రోన్నతిన్. 10

కం. ఆ పర్వదివసమందు, మ
హాపుణ్యుఁడు ద్వంద్వములను నతిదూరముగాఁ

బాపుట, నృత్యంబులతో
దీపించుచుఁ బాడుచుండెఁ దృప్తివిరక్తిన్. 11

చ. హరిమహిమాను కీర్తనలు
హాయిగ తాళలయాన్వితంబులై
వరలఁగ వీణమీటుచు సు
పర్వులు మెచ్చఁగఁ గానసంగతుల్
జరుపుచు, మూర్ఛనాదులఁ బ్ర
శాంతతనొప్పుచు, శ్రీరమేశసుం
దరవరరూప మాహృదయ
ధామమునందున నిల్పియుండఁగన్ 12

మ. భువనేశుండును జారచక్షువుల సం
పూర్ణంబుగాఁగాంచి, క్రో
ధవిశాలాక్షుల విస్ఫులింగములు చో
ద్యంబైన, "నాయాజ్ఞకున్
భువి నుల్లంఘనఁ జేయువాఁడుఁగలఁడే,
పొండింక; నవ్వానివ
స్తువులన్ ధ్వంసమొనర్చి వాని నిటకున్
దోడ్తెండు! పొండో భటుల్." 13

తే. గీ. అనుచు ముష్కరులౌ వారి నాజ్ఞ సేయ,
భటులు యమభటులై, హరిభక్తుఁడగుచు
వెలుఁగు హరిమిత్రుపాలికి వేగనరిఁగి
యతనిపూజోపకరణమ్ములడఁచివైచి. 14

తే. గీ. ఎల్లవస్తువులంబట్టి యింతవింత
లగువిధంబునవిఱచి నెవ్వగలఁగొలిపి

వేగహరిమిత్రుబంధించి, విభునికడకుఁ
దోడితెచ్చిన, వాని నాఱేఁడుజూచి 15

కం. కోపోద్రేకంబున నా
బాపని సర్వస్వహరణ పాపమునకుఁ దా
నాపోవక తనరాజ్యము
నీపై విడి పొమ్మటంచు నేలికసేసెన్ 16

ఉ. ధర్మముతప్పకుండ విభు
ధప్రకరమ్ములు సంస్తుతింప స
త్కర్మపరాయణుండగుచుఁ,
గాలమువచ్చినయంతమాత్రమునే
నిర్మలచిత్తమేర్పడునె?
నీతియుతుండగుచెల్లు భక్తితో
నర్మిలిఁజూపి విష్ణుఁబర
మాత్మునిగానము సేయకుండినన్. 17

కం. ఆజేనికర్మలన్నియు
నీఱునఁబన్నీరుపగిది నిస్సారములై
యాజడికిఁ గారణములై
యేఱువజనములకునెల్ల నేవముఁగొలిపెన్. 18

తే. గీ. కేవలముఁ గర్మరుండయి యీ విధమున
రాజ్యమేలుచు భువనేశరాజు నొక్క
కాలమునఁ గాలధర్మముఁగనె, యులూక
ల, భవమందెను. నేనెయా రాజుసుమ్ము. 19

పనమయూర వృత్తము:-

రామరఘురామ జయరామ! యనుచు ని
న్నేమనుజుఁడైన గళమెత్తి వినుతులన్
వేమరునొనర్ప భవభీతిదొలఁగు; నీ
నామమిహలోక పరనందమొసఁగదే! 20



# కర్మానుభవము

కం. శ్రీకర! సుగుణాకర! ల
క్ష్మీకర! సత్యప్రతిజ్ఞ! శ్రితమందారా!
రాకేందు బింబవదనా!
నాకేశ్వరవినుత! భక్తనాయక! రామా! 1

వ. ఓ భరద్వాజా! గానబంధుండనంబరగు నయ్యులూక
లుండు నారదుంగాంచి, యనంతరంబ స్వకీయచరితంబు నివ్వి
ధంబునం జెప్పందొడంగె. 2

కం. వినుమా! నా దురవస్థను
వినుపించెద, దానిఁబట్టి విష్ణునిగానం
బునఁగలమహిమ మెఱుంగుదు
వనఘా! మునిచంద్ర! నారదా! విమలాత్మా! 3

ఉ. ఆకలిమంటతోఁ గడు
నార్తుఁడనై సకలప్రదేశముల్
వీఁకఁజరించి, యెంతయును
వేసరి, యీనకులాఖ్యదేహ, మ
జ్ఞాకలఁజెంద, నాయమునిఁ

మ. హరిమిత్రున్ హరిగానకోవిదుని నీ
వారీతిఁ బీడించి, ము
ష్కరివృత్తిన్ ధనమెల్ల దోచుకొన నా
జ్ఞల్ వెట్టి, నీ దేశమం
దిరియన్ నిల్వఁగనీక ద్రోలినయఘా
ఘావాప్తిచే, నీవు దు
ర్భరకష్టాత్ముఁడవైతి, నీసుకృతముల్
ధ్వంసంబులై పోవఁగన్. 5

తే. గీ. పూర్వజన్మంబునందీవు భూధవుండ
వౌచు, భువనేశసంజ్ఞ నత్యంతదీక్ష
యాగములఁ జేసినాఁడ వహంకరించి
భక్తిభావములేని సంపత్తితోడ. 6

ఉ. కేవలకర్మతత్పరతఁ
కేవలభక్తియుఁగాక రెండిఁటిన్
జేవకొలంది చూపుచును
శ్రీహరిగానమొనర్ప, నంత్యమం
దావిభుసన్నిధిన్ బడయ
నౌను; ద్వితీయమొకండెయైన, నా
తావును జేరవచ్చు; నమి
తంబు విలంబముమాత్రమయ్యెడిన్. 7

ఉ. నీవటుగాక, దానములు
నిస్తులలై చిర ధర్మకర్మముల్
భువనేశయజ్ఞములు
పెంపుగఁ జేసినవాఁడవయ్యు, సం

భావనమూని భక్తునకు
బాధలఁ బెక్కొనరించియుండుటన్
నీవిటు దుఃఖమందితివి,
నిష్కృతివే దనుభోగ్యమంతయున్. 8

తే. గీ. మనుజుఁడెవఁడైన నాత్మ ధర్మమున నెలఁగి
విష్ణుగుణనామకీర్తనాన్వితుఁడునైన
ముక్తుఁడగు, భక్తిలేకున్నఁ బూలఁబత్ర
ములను బండ్లఁ బూజింప ముక్తిగలదె! 9

కం అంటఁబోనక భక్తునిఁ
జింతలవంతలను జివ్రుకఁ జేసితివాహా!
యెంతటిపాపమొ? దానికి
సుంతయుఁబరిహారమనఁగఁ జూతుమె మెంచున్? 10

తే. గీ. విధివిధానముగాఁగ జీవితముగడపి
నట్టియీ దేహమున మోహమ్ముట్టిపడఁగ
ఖననదహనాదుల నొనర్పకయె, సుతాది
బంధువులు దాని మానసపర్వతమున. 11

కం వెలసిన కోటరమునవిడి
రలఘుమతీ! యీశరీర మారసితినుమా!
బలుపగునాశవమే నీ
కి లక్షత్తును దీర్పఁగలుగు నెంతయువినుమా! 12

తే. గీ. ఆశవంబది సంపూర్తినందువరకుఁ
దినుచు, మన్వంతరంబైనఁ దిరిగిపోనక

జన్మమందుదు వాపై నిఁజాలకాల
మునకు మానవజన్మంబుఁబొందఁగలవు. 13

చ. ఇటులవచించి యాయముఁడ
దృశ్యతనందె, మదీయదుష్కృతో
త్కటమున ముంగిరూపమును
గైకొని యీగుహనుండి యింతసం
కటమునఁ బూర్వదేహమును
ఖాదనఁజేయుచునుంటి, భక్తులన్
గటకటఁజేయుప్రాకృతుల
కష్టములిట్టివిగావె! నారదా? 14

తే. గీ. ఈశరీరమునిలిచెఁ నామృతకళేబ
రమును దినుచుంట; నట్లయ్యు నమితమైన
యాకలింగల్గి యార్తినేయందుచుంటి
భక్తిహీనుని కర్మలపాట్లుగాఁగ. 15

వ. ఓయీనారదా! వినుము. నేనొల్లుండ నొక్క పర్వ
దివసంబున. 16

సీ. సూర్యసన్నిభవర్ణ శోభాయమానమై
వరలువిమానంబుపై వెలింగి
యప్సరోగణము లత్యంతంబునెదురుఁగా
నృత్యవాద్యంబుల నేర్పుసూప
గంధర్వవనితలు గడువేడ్కఁదనకీర్తిఁ
బాడంగ భగవదర్పణమొనర్చి
దేవతాసమితి విధేయత ఛత్రచా
మరముల సేవించి మురియుచుండ

తే. గీ. మునుపవజ్ఞతఁ జేసి నేఁబోనడంచి
నట్టి హరిమిత్రుఁడాకీర్తి హరిపథంబు
నరుగుచో; నన్ను నాకళేబరముఁ దినెడు
వానిఁ, గనుఁగొనిఁ నిలచియుఁ బలికె నిట్లు 17

కం. ఇది భువనేశ నిదేహం
బు, దినంగా నేమికతము? ముదమున కెలుపం
గదె, యోయులూకలంబా!
మదినవ్యముఁ దలఁపకుండుమా! మహనీయా! 18

ఉ. నారద! యీమహామహుఁడు
నన్నిటు ప్రశ్నము సేయ, నమ్రతన్
వారనిభక్తి నేవినయ
భావముఁ జూపుచుఁ బ్రాంజలుండనై
కారణమొల్లఁ దెల్పితిఁ బ్ర
కాశముగా, యమధర్మరాజు ము
న్నారసి నాకుఁ దెల్పినది
యంతయు, గౌరవభాషణంబులన్. 19

మ. హరిమిత్రా! విను, పూర్వజన్మమున నీ
యందేను గ్రూరంబుగాఁ
జరియింపన్, దగ నాత్మశాంతియొకలే
శంబైనలేకుండ, దు
స్తరదుఃఖాంబుధి మున్గియుంటిఁ; బరమో
దారుండవై నన్ను ను
ద్ధరణన్ జేయఁగదయ్య! యార్తుఁడను నీ
దాసుండ భక్తాగ్రణీ! 20

శా. జ్ఞానాగ్ని ప్రవిదగ్ధచిత్తమునఁ బ
శ్చాత్తప్తభావుండనై
నేనారీతిని విన్నవింప, నతఁడున్
ప్రేమాంతరంగంబునన్
సానందుండయివల్కె నివ్విధిని
'రాజా! నీయకృత్యంబులున్
బోనయ్యెన్ గనుపింపదీ శవము నీ
వున్నాదువాక్యంబులన్ 21

శా నీకంఠంబిటనుండి గానమునకున్
నిస్తుల్యమై శ్రావ్యమై
నాకానీకముఁ గిన్నరీచయము గం
ధర్వాదులెల్లప్పుడున్
నీకున్ సేవలొనర్చి శిష్యులగుచున్;
నీయాశలిందీరు, న
స్తోకంబైతగు భక్ష్యభోజ్యములు, సం
తోషంబుచేకూరెడున్. 22

ఉ. నాకరుణాకటాక్షము గ
నంబడ గానవిశారదుండవై
శ్రీకరవిష్ణుకీర్తనము
సేయుచు నుండుము! కుక్కపుట్టువున్
నీకటుతప్పిపోయినది;
నిశ్చయమింతయుఁ; గొన్నినాళ్ళకున్
బ్రాకటమద్వితీయమును
భవ్యమునౌ పథమందిమించవే ! 23

తే. గీ. అనివచించినయంతలో నాకశేబ
రమ్ము మటుమాయమయ్యె, చిత్తమ్ము శాంతి
నొందె; నాకష్టములుఁదీరె; నోయి నార
దా! మునీశ్వర! గానవిద్యయులభించె. 24

ఉ. నారదసంయమీంద్ర! హరి
నామము గానమొనర్చువారి పా
పారటమెల్ల చల్లఁబడి,
యన్నిసుఖంబులఁ గూర్చునంచుఁ దా
మీరిన ప్రేమఁబల్కె హరి
మిత్రుఁడు శ్రీహరిఁజేరె; నెంతయున్
గోరకగల్గుభక్తుల య
కుంఠితపూ దయయిట్టిదేగదా! 25

తే. గీ ఇదియెనాజన్మవృత్తాంత మిట్టి దీని
నెవఁడుచదివిన విసిన లిఖించియైనఁ
గష్టములఁబాసి వాఁడుసౌఖ్యములనందుఁ
బరమునను విష్ణులోక నివాసియౌను. 26

పంచచామరవృత్తము :— భవత్పదాబ్జసేవకై వి
వాదమేల యంచు, సం
భవత్ఫలాదు లిచ్చియున్ శు
భంబుగాఁగ, యానిశా
దివంబులందు నప్రమత్త
ధీవిశేషమొప్పఁగా
సువర్తియై గుహుండు నిన్ను
జూచె భక్తిరాఘవా! 27

# నారద గర్వభంగము

కం. శ్రీ భక్తపాలనా! వర
దా! భయహరణా! విభీషణార్చితచరణా!
శోభనకర! హనుమద్హృద
యా! భూభారాసురాంతకా! శ్రీరామా! 1

వ. ఓ భరద్వాజా! మఱియు నాగానబంధువు నారదునితో
నిట్లనియె. 2

తే. గీ. నారదా! వినుమోయి! కిన్నరచయంబు
నప్సరస్త్రీచయింబు విద్యాధరచయ
మనగ, నను 'గానబంధు' సమాఖ్యఁ బిలచి
గానభిక్షనుగొందు రనూనగతుల. 3

కం. తపమున ధీసామర్థ్యము
నుపయోగించినను గాన మొకయింతేనిన్
సఫలంబుగాదు; శ్రమచే
నపురూపాభ్యాసవిధుల నలవడుననఘా. 4

ఉ. కావునగానవిద్య నటు
గైకొనఁగాఁదగు, దీక్షతోడ నీ
చేవకొలంది సర్వమును
సిద్ధిలుసంచు వచింప, మానియున్

భావన 'గానబంధు' పద
పంకజయుగ్మమువట్టి మ్రొక్కి, సం
భావనఁజేసి విద్యకు ను
పక్రమణంబొనరించె శ్రద్ధతోన్. 5

కం. నారదుఁడారీతిని శ్రీ
నారాయణు సంస్మరించి, నయవినయములన్
ప్రారంభించియు విద్యను
నేరుపుమైనేర్చుచుండె నిశ్చలబుద్ధిన్. 6

వ. అట్టినారదమునీంద్రుంగాంచి గానబంధుండిట్లనియె. 7

మ. వనితాసంగమమందు గానకళ న
న్వాఖ్యానయోగంబునన్
ధనధాన్యాదుల నిచ్చిపుచ్చుకొనుటన్
దాత్కాలికంబౌ ఋతం
బున; నాయవ్యయరీతులం దెపుడుమో
మోటంబులున్ సిగ్గులున్
గనరానీక చరింపఁగావలయు సౌ
ఖ్యశ్రీయశఃకాములై. 8

చ. బయటకునాల్కఁ బ్రేలుటయుఁ
బ్రావరణాదుల గూఢవృత్తియున్
రయమునఁజేయుత్రిప్పటలుఁ
గ్రన్ననోటిని విప్పుచుండుటల్

నియతములేక వెక్కుటయు,
నిల్కడదక్కుట కాననైనచో
ప్రియమునుగూర్ప దేరికి,
నికృష్టపుగానముసుమ్ము, నారదా! 9

తే. గీ మఱియు గానమొనర్చెడు మహితయశుఁడు
తనశరీరావయవములఁ గనుచు నెదుటఁ
గలజనంబులఁ గనుచుండవలయు, నూర్ధ్వ
బాహువును నూర్ధ్వదృష్టియై పాడరాదు. 10

సీ. హాసంబు భయమును నాఁకిలి కంపంబు
నన్యస్మరణము దుఃఖార్తి తృష్ణ
యనునేడు గాయకునందుండరాదు, తా
లమ్మొక్కచేఁ జూపలగ్గుగాదు
క్షుధచేతనార్తుఁడౌచు, భయార్తుఁడై తృషా
ర్తుఁడౌచుఁ బాడఁగాఁదొడరరాదు
గానమ్మునెపు డంధకారమ్మునం జేయఁ
దగదిట్టినియమముల్ దత్త్వసరణి.

తే గీ. నెవ్వఁడైనను బాటించి నివ్వటిలఁగ
వానిగానమె యుత్తమత్వమున వెలయు
శాస్త్రమర్యాదలివి జనాసక్తినరసి
గానయోగంబు నెఱపుము మౌనిచంద్ర! 11

కం. నారదుఁ డీసర్వమును విని
వారకనొకవేయి దివ్యవర్షంబులు, వి

ద్యారాధకుఁడై, శాస్త్రవి
చారుఁడునై, గానబంధుసన్నిధి నుండెన్. 12

శా. చాతుర్యంబున గానవిద్యఁగల ప్ర
స్తావాదులున్, విశేయన్
జేతన్ బూని విశేషమంజుల రవా
శేషంబులన్ మీటుటల్
ఖ్యాతిన్ జెందిన సప్తసుస్వర విధా
గ ప్రక్రియల్ నేర్చె; సం
పూతాత్ముండయి గానబంధునికడన్
మోదంబుసంధిల్లగన్. 13

కం కిన్నరులును గంధర్వులు
మున్నగుసురసంఘమెల్లఁ బూజింపఁగ, వి
ద్వన్నుతుఁడై నారదుఁడును
వన్నెలఁగని, యనియె గానబంధునకిటులన్. 14

ఉ ఓమహనీయమూర్తి ! పర
మోన్నత గానరహస్యవిత్త్వవే
త్తా ! మఱినీకుశిష్యుఁడను
నై సకలంబునునేర్చినాఁడ, నీ
ప్రేమ మమోఘ మాఋణము
విజ్ఞతఁ దీర్చుకొనంగజాను, నీ
కేమియభీష్టమో ? తెలుప
వే ! యనికోరిన, గానబంధువున్. 15

కం. ముదమయ్యె నారదా! విను!
పదినలువురుమనువు లెపుడు పంచతనొందున్
బదిలముగ బ్రహ్మలోకపగ
లదియగు, నాపైని బ్రళయమగు నందాకన్. 16

కం. నాకీర్తివిశ్వమున న
స్తోకముగానిండనలయుఁ జొక్కుచుదానిన్
బ్రాకృతులైనను వినఁగా
శ్రీకాంతునిపరమకరుణఁ జెందగఁవలయున్. 17

కం. అనిగానబంధు వనఁగా
విని నారదుఁడిట్టులనియె, వివరముగనినున్
ఘనముగజగములు కీర్తిం
చును, నస్మద్గురుఁడవౌటఁ జోద్యంబేలా! 18

శా. ఆనందంబున సర్వకాలముల స
ర్వావస్థలన్ భక్తితో
శ్రీనారాయణనామకీర్తనరతిన్
జెన్నొందె, కల్పాంతమం
దానారాయణవాహనంబు గరుడా
ఖ్యన్ జెంది, యాపైని బ్ర
జ్ఞానావాప్తినిఁ బొందఁగాఁగలవు భా
స్వద్విష్ణుసాయుజ్యమున్. 19

వ. అనిపలికి యులూకలునకుం బ్రణమిల్లి, విజయోత్సా
హంబునఁ దుంబురునింటికింజనిన నారదుండును దత్ప్రాంగ
ణంబున. 20

ఉ. కొందఱు చేతులున్ మఱియుఁ
గొందఱు కాళ్ళును గర్ణమూలముల్
కొందఱు, నాసికాగ్రములు
కొందఱు, వక్షములున్ శిరంబులున్
గొందఱు, ద్రుంపివేయఁబడి
ఘోరవికారశరీరులైన, యా
బృందమునందు స్త్రీపురుష
విగ్రహములన్ గని విస్మయాత్ముఁడై 21

మ. వికృతాకారులు మీరలెవ్వరు? మిమున్
వీక్షింప నాశ్చర్యమౌ
నిఁక మిమ్మిట్లొనరించియేచిన ఘనుం
డెవ్వాఁడో? తత్కారణం
బు కృపాదృష్టి నెఱుంగఁ జెప్పుఁడని సం
బోధింప, నవ్వారు గా
నకళన్ గల్గిన భిన్నరాగముల బృం
దం బేము విన్మింతకున్? 22

చ. ఇటువికలాంగముల్ గలుగ
హేతువు తావకగానమే సుమా!
కుటిలతమాదుసంధులను
గూల్చి వికారులఁగా నొనర్చె, ని
చ్చటమముఁ దుంబురుండు ఘన
సాహితిఁ జూపి, సురూపయుక్త సం
కటములఁ బాయఁ జేయఁగల
గానవిశారదుఁ డాతఁ డెంతయున్. 23

కం. మమ్ముల నీగానమ్మునఁ
గ్రమ్మించుఁ దనుమాడఁ దుంబురుండును దయతోఁ
గ్రమ్మఱ నెప్పటికప్పుడు
నిమ్ములసరిఁ జేయుచుంట సీతని మేమున్. 24

వ. సర్వకాలంబులను విడువక యాశ్రయించి యుందుము. 25

చ. అనవిని నారదుండుఁ బర
మాద్భుతమందుచు, నోటమాటరా
క, నిలచెఁ జేష్టఁదక్కి, యటు
గ్రమ్మఱ నొయ్యనఁ దెల్వినంది, లో
ననుకొనె నిట్లు, 'జన్మమిది
వ్యర్థము; ఛీ! యిటుగానమందు సా
ధన మొనరించి, తుంబురుని
దాటక పోయితి నెంతనీచమో?' 26

తే. గీ. అనుచుఁ దనుదాననిందించుకొనుచుఁ విష్ణు
సన్నిధికి నేగియును నిరుత్సాహుఁడగుచుఁ
బలికె. జరిగినతన గర్వభంగ, మంతఁ
జిఱునగవుతోడ వెన్నుఁడుఁ జెప్పెనిట్లు 27

ఉ. నారద! గానబంధునిఘ
నంబుగ సేవలొనర్చి, గానమున్
నేరిచినావహంకృతివి;
నీ వల తుంబురుఁ గెల్వలేవు; నే

ద్వారకయందు యాదవుల
　　వంశమునన్ జనియించువాఁడ, నీ
వారిఖనింతు మంతనము
　　నొప్పఁగఁజెప్పెద గానవిద్యమున్.　　28

ఉ. దేవకియందు నాఁడు వసు
　　దేవునకున్ జననంబునంది, కం
సావితమూర్తినౌచు. మన
　　పద్ధతి నేర్పుదు గానవిద్యమున్,
నీవటు తుంబురున్ గెలువ
　　నిల్తువు తథ్యము చింతయేల? కా
ర్యావసరంబు లెప్పుడును మ
　　హత్తరకాలము రాక కీదునే,　　29

తే గీ. అటులిరువదెన్మిదైన మహాయుగములు
　　గడువ, నాపైని ద్వాపరాఖ్యయుగమునను
　　నేనవతరింతు నందాకఁ బూనినీవు
　　దేవగంధర్వ శుశ్రూషఁ దెలిపెదనుము.　　30

కం. అనియంతర్ధానముఁ జెం
　　దిన హరినిఁ దలచి మ్రొక్కి, తేజోనిధియా
　　మునినారదుండు వీణా
　　స్వనముల శ్రీవిష్ణుదేవభజనారతుఁడై.　　31

వ. మహతీవీణాధరుండై వాసుదేవపరాయణుండై దిగంత సంచారంబుల నందందు గంధర్వాప్సరోగణంబులొసంగెడు

నర్చనంబులంగైకొనుచు నొక్కనాఁడాత్మగురుండైన విరించిని సందర్శించె. నచ్చట. 32

శా. ఆనందంబున గానముల్ సలుపు
"హాహాహూహూ"లన్ గాంచి, వి
జ్ఞానైశ్వర్యము గానవిద్యవడయన్
గాంక్షించి, సేవించి యెం
తో నైపుణ్యమునంది మించిఁ ఘనసం
తోషంబు మిన్నందఁగా
శ్రీనారాయణ దివ్యనామగుణకీర్తిన్
బాడుచున్ భక్తితోన్. 33

ఉ. ఆపరమేష్ఠికిన్ బ్రణుతు
లందఁగఁజేసి, స్వకీయ వీణతో
దీపిత బాహుమూలగుచిఁ
దేలుచు నెల్లెడ సంచరించుచున్
గోపముదీరఁ దుంబురుని
గోరి జయింపఁగవచ్చి చూచెఁద
ద్వ్యాపకమా గృహాంగణము
నందుఁ గలట్టి విచిత్రవైఖరిన్. 34

మ. సురకాంతాకృతులంది ద్వారముకడన్
సొంపారు షడ్జాది సు
స్వరకాంతల్ దమసన్నిధిం బొలుచు భా
స్వద్దివ్యహానీంద్రునిన్

గర వీక్షింపక, యోరమోములిడి
యున్నన్ గాంచి, యత్యంత దు
ర్భర లజ్జానమితోత్తమాంగుఁడయి
నిర్భాగ్యంబు భావించుచున్ 35

ఉ. అవ్వేళ నుండఁజాలకయు
నాతని గెల్వఁగలేమి నారదుం
డెచ్చటికేనియుం జనియు,
నిచ్చటనచ్చట గానవిద్యలో
నచ్చలు వోసినట్టి విబు
ధావళిఁగాంచుచు, శాస్త్రపద్ధతుల్
పొచ్చములేని పట్టుదలఁ
బూనుచు నభ్యసనంబొనర్పఁగన్. 36

ఉ. అంతటఁ గాలముంగడువ
నాహరి నాఁడు వచించినట్టి వృ
త్తాంతముఁబట్టి యాదవసు
ధానిధిచంద్రుఁడు కృష్ణమూర్తి, ధీ
మంతుఁడు పుట్టియుండునని
మానసమందు నెఱింగి, నిర్మల
స్వాంతుఁడు నారదుండు గన
వచ్చెను రైవతకాద్రిభూమికిన్. 37

శా. శ్రీకృష్ణుండును జూడవచ్చిన ముని
శ్రేష్ఠున్, మహాద్భక్తి న
స్తోకార్ఘ్యాదు లొసంగి స్వాగతము సం
తోషంబుగాఁ బల్కి, వి

ద్యాకాముండగు నారదుండనియెం
గృష్ణా! నాడునీవన్న య
ట్లా కారుణ్యముఁజూపి, గానమున ధ
న్యాత్మున్ ననుం జేయవే! 38

కం. అని ప్రార్థించినఁ గృష్ణుఁడు
విని పక్కననవ్వి యంతఁ బ్రియమలరఁగ ని
ల్లినె జాంబవతిన్ గని, యీ
మునివరునకు గానవిద్య బోధింపగదే! 39

వ. తదనంతరంబ. 40

సీ. జాంబవతీదేవి శాస్త్రోక్తముగ నొక్క
సంవత్సరము గానసరణి నేర్పె
నటులె జనార్దను నాజ్ఞను సత్యభా
మయు వత్సరము నేర్పె మహితవిద్య
నారీతి రుక్మిణి యాదరంబున రెండు
వత్సరంబులు గానఫణితి నేర్పె
నాలుగేండ్లిట్లు గానమునేర్చినం గాని
స్వరకాంతి లీమునీశ్వరునిఁ” జూడ
తే. గీ. నైన లేదని యంతఃపురాళి యెల్ల
ఎనఁగ, షాడ్గుణ్య సంపద నలరువాఁడు
వాసుదేవుండె స్వయముగఁ బట్టిపట్టి
స్వరములను నారదునకు నేర్పంగ దొడఁగె. 41

తే. గీ. ఆ జగద్గురుఁడైన జనార్దనుండు
కృష్ణుఁడే నారదునకు సంగీతశాస్త్ర

షడ్జాదుల నేర్పఁ సరిగమపదని యనెడు
స్వర సరసిజాక్షు లప్పుడు ప్రసన్నులైరి. 42

శా. నా కా తత్కృష్ణజగద్గురుండె గురుఁడై
సంగీతముం నేర్పఁ బ్ర
త్యక్షంబైన స్వరాళిఁ గాంచి, ముని స
త్యానంద బోధాత్మ స
ద్వీక్షాగ్నిన్ దనమత్సరంబు నటు
బూదిన్ జేసె, నెందైన న
గ్నిక్షోభంబున నెందుకట్టియలకున్
నిల్వంగఁ దావుండునే? 43

ఉ. అంతట నారదుండు పర
మాద్భుతమందుచు, భక్తిభావ మ
త్యంతమునంది పొంగుచు, న
నంతునిలీలలఁ బ్రస్తుతించుచున్
చెంత నెయున్న కృష్ణపద నీ
రజముల్ శిరసావహించుచున్
జింతలు లేక మైమఱచి
చెంగున గంతులు వైచి యాడుచున్. 44

మనోజ్ఞవృత్తము —

పరమదయానిధీ! భక్తపాలనపండితా!
నిరుపమ కాంతివిశేష నీరదదేహా! సుం
దరదరహాసవిలాస! తాత్త్వికరూప! నీ
వరమహిమంబును జెప్ప వాక్కులు చాలునే? 45

కం. నినుఁ దెలియ నంతవరకును
ఘనతర విద్యలను నేర్చి గర్వించిన వాఁ
డను, నిన్నెఱింగినంతనె
వినయముఁ జూపించు నెంత వెఱ్ఱికి నైనన్. 46

వ అని యింకను నివ్విధఁబున వినుతించు నారదుం గని
హరి యిట్లనియె 47

ఉ. పూర్వము నుండియుం గలదు
పుణ్యఫలంబగు భక్తి నీకు నీ
గర్వ మొ యింత సేసినది;
గానమహిమ్నుఁడ నైతి; జ్ఞానమున్
సర్వము నీకుదక్కినది,
సత్య మెఱింగితి వీవు, తుంబురున్
బర్వముగాఁగఁ గూగుకొని
పాడుకొనందగునయ్య! యీపయిన్. 48

ఆ. వె. నీకుఁగల్గినట్టి నిస్తులమైన ప్రా
చీనయోగమునను, బూని నాదు
సన్నిధి నెపుడుండి సంగీతమును బాడు
కొనుము చిత్తశాంతిఁ గొను మనంగ. 49

వ. నారదుండును మహాప్రసాదంబుగఁ దదాజ్ఞం గైకొని
రుక్మిణీసత్యభామాజాంబవతీ సమేతుండైన యాశ్రీకృష్ణ సన్ని
ధానంబునఁ దన యనన్య సామాన్యగానవిద్యా విశార
దత్వంబుం దెలుపు గానంబొనరించి, యవ్వారి యాత్మా
నందంబుం జూఱఁగొనియె. 50

సీ ఓ భరద్వాజ నీవొప్పుగవింటివే
గద! గానవిద్యాప్రకార మెల్ల
నారాయణుని గుణనామకీర్తనముల
సర్వజ్ఞుఁడై విష్ణుసన్నిధిఁ గొని
యానందమును బొందు; నటుగానిచోఁ గొఱ
గానివాఁడయి నరకంబు నొందు
హరినామకీర్తన మాలకించినసైన
హరియనుగ్రహపాత్రుఁడై వెలుంగు

తే, గీ జానకి జన్మవృత్తాంత మేను నీకుఁ
దెలుపుమఁ బ్రసంగవశమున దివ్యదృష్టి
ముందు రాబోవునవతారమూర్తి యైన
కృష్ణు నీక్షించి తెలియ వచించినాఁడ. 51

పద్మనాభవృత్తము —

శ్రీరామనామం బెలెంద్దైన గానంబు
జేయంగ నావాయుసూనుండు భక్తిన్
జేరంగనై ప్రాంజలిం బట్టి తాదాత్మ్య
సిద్ధిన్ మహోత్సాహుడై పాడుచున్, నా
ట్యారంభుఁడై నేత్రయుగ్మంబునం దప్పు
డానందబాష్పంబు పూరంబు లొల్కన్
ధీరాత్ముఁడై యుండఁడే! జానకీనాథ!
నే నెంతవాఁడన్ బ్రశంసింప నిన్నున్.



# రా వ ణ వి జ య ము

కం. శ్రీమత్కోదండధరా!
భూమిపరాపహరణ! సురపూజితచరణా!
ప్రేమానందాభరణా!
ధీమద్వాయుసుతహృదయ దీప్తాభరణా! 1

తే. గీ. అంత వాల్మీకి తనశిష్యు నరసి మఱియు
నో భరద్వాజ! నారదుఁ డొక్కనాఁడు
లక్ష్మి కిచ్చిన శాపఫలంబుగాఁగ
నామె రాక్షసికిన్ బుత్రియయ్యె ననఁగ. 2

వ. విని భరద్వాజుండును దద్వృత్తాంతంబు సవిస్తరంబుగా
నెఱింగింపు మనిన వాల్మీకి యిట్లు చెప్పందొడంగె. 3

చ. వినుము దశాస్యముల్ మఱియు వింశతి బాహువులుం గలట్టి దు
ర్జనుఁ డగు రాక్షసుండు యమరాజ జయించి జగాల నేలఁగా
ఘనతప మాచరించె నల కంజభవార్థ మనేక వర్షముల్
వనములఁ దీవ్రనిష్ఠఁ గొని వాయువె తిండిగ నుండి చండతన్.

కం. ఆ రావణుని దపోగ్నికి
వారక లోకాలు భగ్గుభగ్గున మండెన్
ధీరతఁ జెడి పరమేష్ఠియు
నారక్కసు ప్రోల నిలిచి యమమలు గొలువన్. 5

తే. గీ. ఓయిపౌలస్త్య! విరమింపుమోయి! తపము
దీనితాపాన లోకవిధాన మెల్లఁ
దారుమారగుచుండెఁ జిత్తమునఁ గల్గు
వరము దెల్పు మొసంగెడివాఁడ ననిన. 6

కం. రవిబింబంబున దీక్షన్
దవిలించినచూపు నల్లనన్ మరలించి, యా
దివిజార్చిత విధిపదముల
కవనతుఁడై రావణుండు నడిగె వరములన్. 7

తే. గీ. ప్రభువరా! దేవదేవ! వరమ్ము లొసఁగి
నన్ననుగ్రహింపఁగ వచ్చినాఁడవుగద!
చావులేనట్టి వరము నొసంగుమయ్య!
యనఁగ విని బ్రహ్మదేవుండు ననియె నిట్లు. 8

కం. నీవడిగిన యీవరమును
నీవలదు, మఱెద్దియైన నిచ్చెద, నడుగం
గావచ్చు నీవటన్నన్
రావణుఁ డిట్లడిగెఁ గపటనయమార్గమునన్. 9

సీ. అమరత్వ మీయఁగా ననువుగాకుండిన
నర్థింతు వేరొండు నరయు మింక
సురరాక్షస నిశాటవరయక్షు లురగులు
నప్సరోగణము విద్యాధరులును

గిన్నరు లాదిగా నున్న దేవగణంబు
నను(జంపలేనట్టి ఘనవరంబు
నిడు మని వేడఁగా నిచ్చి, బ్రహ్మయుఁ బల్కె
నొకనాఁడు నీకూతు నొడిసి పట్టి

తే. గీ. పొందుఁ గోరంగ నిన్నామె పొందకుండు
నదియె కారణముగ మృత్యువౌ నటంచు
నమరగణపరివృతుఁడయి యంతలోనె
చిత్రముగ నదృశ్యుండయ్యెఁ; సృష్టికర్త. 10

వ. అంత నారావణుండును దనమనంబున. 11

తే. గీ. మానవులనంగ నొకలెక్కలోనివారు
గారటంచును, దనచావు వారినుండి
కలుగనేర దటంచును దలఁచి; యట్టి
వరము నాకేల ? యనుచు నిబ్బరమునుండె. 12

వ. మఱియు నారావణుండు. 13

మ. వరగర్వంబున వీర్యదర్పమున దేవవ్రాతమున్ గెల్చి, యు
ద్ధుర దీక్షన్ జగతీత్రయంబునకు నెందున్ దానె యీశుండునై
మరలన్ దానొకనాఁడు మానులజయింపన్ గోరియాదండకన్
దురితాత్ముండయి చేరిబుద్ధిఁగలచెన్ గ్రూరంబుగా నిర్వ్యధిన్.

కం ఈమునుల గెల్వకుండఁగ
నే. "ముల్లోకముల గెల్చి నిల్చితి"నన రా

దేమాత్రము. వీరలఁగాని
నేమించియుఁ జంపవలయు విష్ణులమైనన్, 15

మ. అని భావించి మునీంద్రులన్ బిలిచి "యారా! మూఁడులోకంబులన్
ఘన దోశ్శక్తి జయించినాఁడ, నిటుపై నాపూజలే సల్పుచున్
నను గీర్తింపుఁ డనన్యభావముల" నన్నన్, వారు నిర్భీకులై
"వినుమా! రావణ! నీకుమాకు జగతిన్ విశ్వేశ్వరుం డొక్కఁడే! 16

ఉ. కావున నిన్ను దైవతముగాఁ గ భజించుట యెట్లు? ని మనో
భావము మార్చుకొమ్మిదియు భౌతికదేహ మనాశ్వతంబు, ని
వేవిధ మెమ్మునర్చినను నిందలి యాత్మను జంపలేవు, నీ
చేవ యడంగు కాలమును జేకురునెన్నటికైన రావణా! 17

చ.

విశసనముం బొనర్చుట
కు వేగమె వారిపయిన్ శరంబులన్
నిశితములన్ విడల్చి యొ
కనేర్పునఁ దద్రుధిరంబు గైకొనెన్ 18

వ. అట్టి సమయంబున. 19

చ. సుతశతకంబు గల్గిన వి
శుద్ధుఁడు, కృత్స్నమదుండు నా, మహా
వ్రతుఁడగు వానిలక్ష్మి తన
పట్టిగఁ బుట్టఁగఁగోరి, పాలతో
సతత మొకపాత్ర నర్చనము
సల్పుచు నుండఁగ, దానిఁబట్టి క్రూ
రత మునిరక్తపూరణ ప
రంబొనరించియు దర్పమేర్పడన్. 20

ఉ. మోదముతోడ నాకలశ
ముంగొని, లోకవిజేతయౌచు, ర
క్షోదయితుండు రావణుఁడు
పోక్కుచు, లంకకుఁబోయి, యందుమం
దోదరిఁ గాంచి యాకలశ
మొప్పుగఁ జూపుచు "నోసి! దీనిలో
మేదురమై మహామునుల
మేనుల రక్తము నిండె వెండియున్. 21

కం. ఈరక్తంబును ద్రావకు
మేదినిడఁ బోకు; మిద్దియెంతియు విసమై
దోరించు, దీని విజయో
దారంబగు విఘ్నముగనె, తెనివింగనుమా! 22

తే. గీ. ఆమహోమునుకైన బ్రాహ్మణులకోశి
తమిదియు మనకుఁ ద్రావంగఁ దగదు వినుము!
కాలకూటమునకు మించి కాలుఁజేర్చు
గాన భద్రంబుగా దీనిఁ గాంచవలయు. 23

కం. మూఁడుజగంబుల గెలిచిన
వాఁడని నాబిరుదు నిదియె ప్రకటింపంగా
నోడక గొని తెచ్చితి, నే
నాఁడేమఱకుండ దీని ననువలెఁ గనుమా! 24

ఏశావృత్తము :—

పదిదెసలను పిర
వర్యాల్ మహారాక్షసుల్ దండకన్
గదిసిన జగమెల్ల
గాటంపుఁ జీకట్లతో నిండ, నా
యదనున నొకఁడీవె
యంతన్ ఖరాఖ్యాదులన్ జంప, స
మ్మదము సకలజీవ
పుంజంబు నొందెన్ గదే! రాఘవా! 25

# సీ తా జ న న ము

కం. శ్రీసూర్యాన్వయనాయక !
భాసురసూర్యాత్మ జాత్మవందితమిత్రా !
దాసవిభీషణశరణో
ద్భాసిత చరణారవింద ! భక్తోద్ధరణా ! 1

వ. ఓ భరద్వాజా ! రావణుండు త్రైలోక్య విజయ సరంభుండై. 2

ఉ. అంతటఁ దృప్తిఁజెందక య
హంకృతి రూపము దాల్చినట్లు ల
త్యంత మహోగ్రహాగ్రుఁడయి
ధర్మముపీడి సురప్రకాండమున్
వంతలఁ బెట్టుచున్ మునులఁ
బట్టుచుఁ గొట్టుచుఁ గంతుచేతిలో
నింతఁగనోడి దేవతల
యింతులఁ దాఁజెఱవట్టి యేఁచుచున్. 3

ఉ. గర్వము మేరమీఱుటయుఁ
గాముకుఁడై సురయక్షనాగ గం
ధర్వ విలాసినీమణులఁ
దారలుగాఁ గొని మందరాఖ్యమా

గమగమావాసిత సుమమంజరుల నొక్క
యలివేణి కొప్పున కందగించు
మృగమద సౌరభస్థగిత తాంబూల మొ
క్కలతాంగి మోమున వెలయఁజేయు

తే. గీ. పచ్చకప్పుర మొలసి, సువాసనలను
విరియు గంధంబు నొకచేత వెలయ, నొక్క
లలిత పీనస్తనీ స్తనలవాళిమమునఁ
బూయు, రావణుఁ డిట్లుపభోగగరిమ. 7

వ. ఇవ్విధంబున ననేకవర్షంబులు కామోపభోగ పరాయణుండై, యంతఃపుర స్మరణంబైన మాని, మారదేశంబగు మందరాద్రినున్న ప్రాణనాథుం దలంచిన మందోదరీ సతీమణియుం దనమనంబున నిట్లని విచారించె. 8

శా. ఆనందంబున కాదిపీఠమయి యా
త్మారాధ్యుఁడౌ నాథుఁడే
తానీరీతిని మేనుఁగానక యనం
తశ్రీల భోగింపఁగా
నానే! యంతిపురంబునన్ గలుగు న
ర్ధాంగిన్ ననుం జూడఁగా
మానెన్, ఛీ! యిక జన్మమేమిటికి? సం
పద్రాజి నాకేటికిన్ ? 9

తే. గీ. భర్తచే వంచనంబు, సపత్నులగమి
చే నిరాదృతి నందిన స్త్రీకిఁ బ్రాణ

భరణమేటికి? ప్రాణావనభర మదేల?
పతినిరాదృతి జీవచ్ఛవంబుగాదె! 10

ఉ. ఇంతకుఁ బూర్వ మవ్విధి ము
నీశ్వరశక్తియుతోడ నింపి, యే
కాంతమునందు నున్న విష
కల్పముఁ దత్కాలశంబునన్న, మః
ఖాంతముగాఁగఁ ద్రావెద, న
టంచును వేగఁ దకీయ ప్రాప్తమున్
నాంతముగాఁగఁ గ్రోలు విను
సంబున గర్భమువాల్చి, యిట్లునన్, 11

ఉ. నాపును నోరి యియ్యదివి
షంబని ప్రాపతి సక్రటా! యిటుల్
జీవితశీలసంపదకుఁ
జేటునొసంగున శోణితంబు? నే
నేవిధి నీయపప్రథను
హేయముగాఁ దలఁదాల్చుదాన? నా
భావమునందు నొందుదలఁ
పన్ విధిచైదము వేర యయ్యెనే? 12

తే. గీ. ప్రాణనాథుండు కొన్నివర్షములనుండి
పరవనితలందు సంభోగ పరవశుండు
నౌచు, దేశాంతరుండైన, నతివ యెట్లు,
గర్భవతియౌట? హేతువుగలదె పలుక! 13

ఉ. ఎప్పటికైన నాదుహృద
యేశుఁడు నన్ గనరాకయుండునే?
యిప్పటి నాదుగర్భము స
మీక్షయొనర్పడె? హేతువేమటం
చప్పుడు చప్పునన్ బలుక
నాతని కేమని చెప్పుదాన? నేఁ
జెప్పెడి సత్యమున్ వినునె?
చేయున దేమిక? శంకరా! ప్రభో! 14

కం. చింతానలదగ్ధంబగు
స్వాంతంబునఁ బాగిలి యిట్టివాడు దొలంగన్
శాంతపడుదారిఁ గానక
చింతలలో మునిఁగి యిట్లు చింతించె మదిన్. 15

కం. ఒరు లెఱుఁగరాని విధమునఁ
బఱచియు నెందేని దీనిఁ బాపుకొనంగాఁ
గర ముత్తమసాధన మగు
నరయన్ వేరొండు మార్గమున లేదనుచున్. 16

ఆ. వె. పుణ్యతీర్థసేవఁ బోవలెనని చెప్పి
పుష్పకంబు నెక్కి పోయిపోయి
దీక్షబట్టి యులకురుక్షేత్రమున కేగ
నంత నచటఁగనియె నాడుకూన. 17

కం. దిశలు ప్రసన్నములయ్యెఁ; బ్రది
దశలంతటఁ బుష్పవృష్టిఁ దగఁగురిసెను; ధా

త్రిశేషంబు వహించెను; నట
దశకంఠుని గుండెలదరెఁ దక్షణముననే. 18

కం. మందోదరి తనగర్భము
నం దుదయమునఁదియున్న యానిసువు మొగం
బందముగఁ జూచినంతనె
కందై తిలకంబు నేలఁ గ్రక్కున వ్రాలెన్. 19

ఉ. ఆవిధిఁ బుట్టియున్న పరమాద్భుత సుందరదివ్యరూప శో
భావహమంగళాకృతిని నారసి యారసి, దాని విడఁగా
భావము నిచ్చగింపని యపారవిచారవిదారితాత్ముఁడై
కేవల శీలపాలన, మకీర్తి వినాశమె బుద్ధినిల్పుచున్. 20

తే. గీ. శ్రీకురుక్షేత్రమందునఁ జేవఁ గొలఁది
వేగముగ విస్తృతంబగు వివరమొకటి
యేర్పడనొనర్చి, శిశువు సమీక్షఁ జేసి
దాని యపరూపసౌందర్య మానియాని. 21

తే గీ. సౌరుమీరిన జిలుగుబంగారుపెట్టి
నొక్కదాని నాగోతిలో నుంచి యందుఁ
బచ్చనగు పట్టువస్త్రంబుఁ బఱచి, భద్ర
ముగ శిశువునందులోఁ బెట్టి పూడ్చెఁ దలఁచె. 22

కం. చిత్తసమాధానమ్మునఁ
దత్తఱపడి గోతవెట్టె; దయతోఁ గరముల్
మెత్తనయి పట్టుఁదప్పిన

తే. గీ. మనసు నొప్పింపఁ గరములు వినకయుండఁ
గరములకుఁ జెప్పియొప్పింపఁ గా మనంబు
వినక బీష్మించు, నీరీతి మనముఁ గరము
లొక్కరీతి నొనర్పక చిక్కువెట్టె. 24

తే. గీ. కన్నబిడ్డను గోతిలోఁ గప్పిపోవఁ
దలఁచి ముద్దాడి, యందుంచి, తక్షణంబ
మరల పైటను బెట్టుచు, మానసమునఁ
జేవచాలక యక్కునఁ జేర్చికొనును. 25

శా. ఆలస్యంబయినంత మాలవులు నే
దైనన్ స్వకార్యార్థ మీ
వేలన్ వచ్చి మదీయగోప్యమును ను
ర్వీన్ జాటఁగావచ్చు, వే
దాఁ లోలాత్ములు దేవతాగణములే
యాకాశమందుండి యీ
బాలన్ నన్నును జూచి, రావణుని దె
ప్పంబోదు రిప్పట్టునన్. 26

తే. గీ. అనుచు నీరీతి లోలోనఁ బనవి, మనసు
రాయిఁగాఁ జేసికొనియు నేత్రములుమూసి
చేతులారంగ బిడ్డను గోతఁబెట్టి
నేల నెలువలెసరిఁ జేసి నిలువలేక. 27

తే. గీ. ఏడ్చుచును, గంటికిన్ వంటి శోకధార
గాఁక [illegible] జేగఁబోవఁ

గాల్పు రాక, మందోదరి, కడకు నెన్గొ
స్నానమాడ సరస్వతినదికిఁ జనియె. 28

కం. స్నానమొనర్చియు మైలన్
బోనాడి విమానమెక్కి పూర్వాకృతినై
తా నేఁగి లంకకును, దన
దీనత బయలుబ్బనీక తేకువ నుండెన్. 29

వ. ఓయి! భరద్వాజా! మఱియువినుము. 30

ఉ. అంతటఁ గొంతకాలమున
కామితఫలాప్తిప్రఁ బార్థలాన, న
త్యంత సముత్సుకత్వమున
యజ్ఞముసేయఁ దలఁచి, యాత్మలోఁ
జింతలుమాని యచ్చటకుఁ
జేరియు, నాఁగటిచేత దున్నఁగాఁ
గొంతుల నీను నట్టియొక
కందుబయల్పడె చాలులోపలన్. 31

కం. బంగరుపెట్టియం దప్పుడు
భంగురమై కనుపట్టుచుండి యా
బంగరు బొమ్మయై మెలఁగు
బాలికఁగాంచిన రాజయోగి, స
ర్వాంగమనోహరాంగిని స్వ
హస్తములన్ గొని, యీమె జన్మకున్
సంగతియైన యీపృథివి
నన్ గృపఁజేసి నటంచు నెంచుచున్. 32

ఉ ముద్దులు మూటఁగట్టు నెల
మోమున నవ్వులు మోసులెత్తఁగా
నద్దిర ! కాలుసేతులును
నట్టిటులాడఁగఁ, జూపరిచిత్తరుల్
దద్దయుఁ జిత్తశాంతినిడ,
దైత్యకులాంతక దీక్షఁబూని న
ట్లగ్గిశలోనె ముచ్చటగ
నాపిడికిండ్లను బట్టె బాలయున్ 33

వ అట్టి దివ్యబాలారత్నంబు గాంచుచు జనకుండును
దనమనంబున. 34

ఉ. చిత్రముగాఁగ మంగళవిశేషములన్ వెలుఁగొంది యీకుగు
క్షేత్రపవిత్రభూమి నెటుచేరెనొ యీ శిశుమూర్తి ? యింతకున్
బాత్రుఁడ నౌదునే పరమపావన యోగవిశేషదీక్షకున్
శాత్రవవిఘ్నమేమొ? య ని.చాలఁగనాజనకుండుచింతిలన్.

శా. ఆకాశంబుననుండి యంత నశరీ
రాశ్చర్యవాక్యంబు లి
ట్లాకాలంబున విన్చె, "నోయి జనకా !
యాత్మానుమానంబు లే
లా ? కల్యాణము లెల్లలోకముల క
త్యంతంబు సంధిల్లె; నీ
వీకన్యామణిఁ గూతుఁగాఁ దలఁపుమో
యీ ! శాశ్వతానందమా. 36

ఉ. నాఁగటి చాలులోన జన
నంబును బొందినదాట నీమెకున్
రాగమెలర్ప 'సీత' యను
నామముఁ గూర్పుము, యజ్ఞకార్యమున్
వేగమె దీక్షఁబూని నెర
వేర్పుము విఘ్నములేక; డటంచుఁ దా
బాగుగఁ బల్కె యా గనన
వాణియు సత్యముఁ దెల్పెనమ్మలిన్ 37

ఉ. ఆ యశరీరవాగ్విభవ
మంతయు మైథిలుఁ డాలకించి, యా
ప్యాయముమీర సీతఁగొని.
యంతిపురంబును జేరి, రాజ్ఞకిన్
బాయక సర్వమున్ దెలియఁ
బల్కుచు, బాలనొసంగ, నామెయున్
దీయనిప్రేమ నాశిశువు
నెక్కొను నక్కునఁజేర్చె ముద్దుగాన్. 38

వ. అట్లంతఃపురంబున దినదినప్రవర్ధమానయగు
నబ్బాలయు. 39

సీ. పకపకనవ్వగా బాప్పంబులేగాని
యితరమహా కన్నీరు నెఱుఁగకుండు
స్నానకాలమునందె మేను గన్పడుఁ గాని
యేవేళ భూషల నెనసియుండు

కాలిమువ్వలసద్దు గలుగఁగోరినవేళ
నేగాని, నేలఁగా ల్నిలుపకుండు
నిద్రలోఁ గదలిక వదలియుండుటె గాని
చుఱుకుఁదనంబెడ్డప్ప చూపుచుండు

తే. గీ. ఇట్టి లల్లారుముద్దులపట్టియగుచు
నామహాలక్ష్మి సీతాసమాఖ్యవడసి
యలరె నెలబాలుపగిది నత్యంత నేత్ర
పర్వముగ జనకాధీశు భవనమునను 40

తే. గీ. ఓ భరద్వాజ! జానకీశోభనాంగి
పుట్టినవిధంబు వింటి వీపుణ్యచరిత
నెవరు వినినను జదివిన నిహపరముల
భుక్తిముక్తులఁ దప్పక పొందఁగలరు 41

చంద్రకళావృత్తము —

జానకీహృదయాంబుజభృంగా!
సాధుమునీశ్వరసంగ! స
మ్మానితాఖిల నిర్జరసంఘా!
మర్దితదైత్యసమూహా! రా
మా! నిరంతరమున్ భవదంఘ్రుల్
మానక సేవలఁ జేయఁగా
దీనభావములేని సుఖాప్తిన్
గేవ! శరణ్య! యిడంగదే!

# సీతాకళ్యాణము - శ్రీరామమహిమ

కం. శ్రీకర ! రణరంగమహా
భీకర ! మమమానిచిత్త విలసన్మవప
ద్మాకరహంసా ! ఘనసుగు
ణాకర ! శ్రీరామచంద్ర ! హరిహరరూపా ! 1

వ. మఱియు నో భరద్వాజా! సీతారాముల కల్యాణంబును శ్రీరామమహిమావిశేషంబును దెలిపెద నాకర్ణింపు మని వాల్మీకిమునిపుంగవుం డిట్లని చెప్పందొడంగె. 2

సీ. దశరథతనయుండై దశముఖాదుల జంపఁ
బుట్టిన శ్రీరామ భూవిభుండు
జనకు నానతి విశ్వామిత్రమానితో
నరిగి తాటకిఁజంపి, యంత నసురుఁ
డౌ సుబాహునిఁగూర్చి యపుడె మారీచరా
క్షసు నబ్ధిఁద్రెళ్ళఁగా ఘనత నేసి
కౌశిక యాగరక్షణ జేసియు, నహల్య
కును శాపముం బాపి, జనకపురముఁ

తే. గీ. జేరి, శివధనుర్భంగము సేసి, వీరుఁ
డై, దశరథుఁడు బంధుమిత్రాది జనులఁ

గూడిరా, రామచంద్రుఁడు గోర్కెమీఱ
విధివిధానముగా సీతఁ బెండ్లియాడె. 3

వ. అట్టి శ్రీరామభద్రుండును. 4

చ. జనకుని పూజలన్ గొని ప్ర
శాంతమనోహర దివ్యభావశో
భనహృదయంబుతో, సకల
బంధుజనంబులు తోడురాఁగ ద
ద్ఘనతర తూర్యనాదము లె
కాయెకి దిక్కులఁబిక్కటిల్ల, సీ
తను దన తేరిపైనిడి ము
దంబున నేఁగె నయోధ్యఁ జేరఁగన్. 5

మ. అటు శ్రీరాముఁ డయోధ్యకుం దరలు నా
యధ్వంబునన్ గ్రోధదృ
క్ఛట లాశాంతములంట భీకరమహో
గంభీర వాగ్వైఖరిన్
గుటిలభ్రూకుటి ఫాలభాగవికట
త్వాకారంబుగా నొప్ప నా
ర్భటిమీఱన్, జమదగ్నిసూనుఁ డెదురై
వచ్చెన్ ధనుర్ధారియై 6

ఉ. ఫాలమునన్ విభూతియును,
బచ్చని దీర్ఘజటన్ శిరంబునన్
వ్రేలఁగ, నోష్ఠముల్ వడఁకఁ,
గృష్ణమృగత్వచమున్ ధరించియు

క్ష్వేలమహోగ్రుండై, పరశు
దీక్షితు లెల్లెడఁబర్వ, రక్తనే
త్రాలను రాముమ్రింగెడి వి
ధంబునఁ దోఁచెను జామదగ్నియున్. 7

ఉ. రాముఁడు ధీరతన్ బరశు
రాముని వాలకమెల్ల,జూచి, నె
మ్మోమున మందహాసరుచి
పొంపిరివోవ, వచించె, నిట్లు, ఓ
హో! మునివర్య! స్వాగతము!
యోగివరేణ్య! మదర్చనావిధుల్
ప్రేముడిఁ గైకొనంగదె! ప
విత్రముఁ జేసి మదీయవంశమున్. 8

కం. సాక్షా జ్జంగమదేవత
లీక్షితి బ్రాహ్మణులె యన్న, ఋషిపుంగవులన్
దక్షుల వచింపఁదరమే!
యక్షీణ సపర్యలంది యలరింపుఁ డిఁకన్. 9

చ. అన విని జామదగ్ని హృద
యంబున విస్మయమంది, వీని యా
ననమున భీతి దోఁపదు, మ
నంబున ధీరతఁ గల్గియుండియున్
వినయవచః ప్రసంగముల
విజ్ఞతఁ జూపుచు నున్నవాఁ డహో!
ఘనతర రామనామమునఁ
గల్గు మహాత్వపటుత్వమే యగున్. 10

ఉ. వీనికిఁ గల్గుధైర్యమును
వీనిపరాక్రమ మెంతదాకఁ గా
లూనఁగ నౌనొ? యింతయును
నొక్కక్షణంబున మాడ్చివైతు, నెం
దేనియు నెవ్వఁడేనిఁ గను
పెట్టి ననుంగని మన్నవాఁడిలన్
గానఁగ నయ్యెనే? ముసలి
కాలమువాఁడ నటంచు నెంచెనో? 11

తే. గీ. అనుచు లోలోనఁ దర్కించుకొనుచుఁ, బరశు
రాముఁ డాగ్రహోదగ్రుఁడై రాముఁజూచి
పలికె, వర్షర్తుగంభీర జలదగర్జ
నానుకారి వచస్సుల నడరియిట్లు. 12

శా. ఓరీ! రాఘవ! నేనెవండనని నీ
యుద్దేశ్య? మీవింతకున్
'పోరా! బోనముసేసి' యన్నటుల సం
బోధించు చున్నావు, నీ
బీరం బిప్పుడు సూపఁగావలయు
రావే! ప్రాతదై త్రుప్పుతో
జీరల్ వారిన విల్లువట్టి విరువన్
జేకూరునే? సర్వమున్. 13

మ. ఇదె బాణాసన మిద్ధవైష్ణవము నీవి
ద్దానిఁ బూరించి, బా
హు దురాడంబర మిప్పుడాపఁ బస
[illegible]ంతో! తెలు; నాపైని నీ

మదమొల్లన్ భటితంబొనర్చెదను,
రమ్మా! యంచు వేఁ బిల్చినన్
మదినేమాత్రము సంచరించక చిదా
నందుండు రాముండనెన్. 14

తే. గీ. బ్రాహ్మణోత్తమ! మునివరా! పరశురామ!
యింతవరకును నైష్ఠ్యాకు లెంతయైన
బ్రాహ్మణతిరస్కృతిని బరాక్రమముఁజూపు
వారులేరన్న నామాటవలుకనేల? 15

తే. గీ. బ్రాహ్మణులయందు నాపరాక్రమముఁజూపఁ
బోవుట యధర్మ మట్లటఁ బూజ్యభావ
మునవచించెద నాసపర్యనుగ్రహించి
నన్ను ధన్యాత్ముఁగాఁ జేయుఁడన్న, మునియు 16

తే. గీ. చాలుఁ జాలింక నీవినయూ లవేల?
బాపఁడనటంచు నన్నొక పందఁజేసి
పలుకుచున్నావు; మాటలఁ గొలఁగువాఁడఁ
గానని యెఱుంగవే మాయకళలయేల? 17

శా. ఆమాటల్ విని రామమూర్తియును
గోపాటోపముం జూపి, "యో
దీ! మీదౌధనువిండు! నా"కనుచు నెం
తే బాహువున్ జాచి, యా

రాముండిచ్చిన విల్లువట్టికొని,
చక్రప్రక్రియన్ వంచి, ప్ర
జ్ఞామార్తాండుఁడు నారినెక్కిడి ధను
ష్టంకారమున్ జేసినన్. 18

కం. నారిని నాకర్ణాంతము
గా,రయమున లాగి విడువఁగాఁ, గల్గిన;వి
స్తారరవంబది జగతిన్
వారకదశదిశలునిండి భరమై తోఁచెన్. 19

చ. ఉరుములులేక యాకసము
నుండి హఠాత్తుగ భూతరాశి,తా
నురుగతిఁ ద్రుళ్ళిపాటుగనె,
నొప్పుగ భార్గవుఁజూచి, రాముఁడున్
"వరధరణీసురా! మఱియు వాంఛి
తమెయ్యది? వల్కు"మన్న నా
శరమిది దీనినిన్ దొడిగి చా
తురిఁజూపు మటంచుఁ బల్కెనన్. 20

ఉ. రాముఁడు భార్గవాస్త్రము బి
రాన గ్రహించియు; నారిఁగూర్చి, సం
గ్రామవిశేషలాఘవము
గన్పడఁ గర్ణమునంటలాగి, యో-
రామ! భవత్ప్రతాపమున
రాజులఁజంపితి వింతదాక, యెం
తో మహిమాన్వితుండవయి,
దుర్భరమయ్యెది యింకనీపయిన్. 21

శా. ఓయీ! భార్గవ నన్నెఱుంగక
తిరస్కారోద్ధతిన్ జూపి నా
వాయారీతుల, నేనొసంగెదను
దివ్యంబైన యాదృష్టి, నా
త్మాయత్తంబగు జ్ఞానమార్గమున
సత్యంబౌచు జీవావళీ
ధ్యేయంబై తగు విశ్వరూపమును
భక్తిన్ గల్గి వీక్షింపుమా! 22

కం. అనవినిన పరశురాముఁడు
ఘనలజ్జావినయభక్తి గౌరవములు మో
మున వెలఁగొని కనుపింపన్
గని విశ్వుని దివ్యమూర్తిఁ గడు విస్మయతన్. 23

సీ. ద్వాదశాదిత్యు లేకాదశరుద్రులు
నష్టవసువులు సాధ్యవరులటులఁ
బితృదేవతలును నశ్విన్యాదినక్షత్ర
ములును, బ్రచేతాఖ్యులు మునిగణంబు
నల మరుద్గణములు యక్షులు గంధర్వు
లును, గ్రహమ్ములు, నదులును, సమస్త
దేవర్షులును, బుణ్యతీర్థంబులును, నెల్ల
భూతంబులు, సముద్రములును, బర్వ

తే. గీ. తములు, నుపనిషత్సహిత వేదములు నాల్గు,
సాధ్వరవషటులును, ఋక్ప్రసారములును
మఱి ధనుర్వేదములు మేఘమండలములు
మెఱపు లుఱుములుఁ గాన్పించె వరుసమీఱి. 24

కం. నెలలును ఋతువులు, నయనం
బులు, వత్సరములును, సకలభోగములును జీ
వుల, లోకావళులును, గాం
చె; లయంబయి సృష్టియగుట శ్రీరామునిలోన్. 25

తే. గీ. తోకచుక్కలు పిడుగులు పేఁకవడిన
యట్లు, భూకంపములు గల్గినట్లు, మిగుల
భీకరధ్వను లెసఁగ నావిల్లునుండి
విడిచె బాణంబు శ్రీరామవిశ్వమూర్తి. 26

కం అదియును భార్గవుఁగప్పిన
మదమాయామత్సరముల మాయించి, వెసన్
బొదిలోనదూరె; భువనము
లదరెన్ జూపరులచూపు లట్లేనిలువన్. 27

ఉ. రాముని విశ్వరూపముఁ ది
రంబుగ వర్ణనముం బొనర్చి, యా
రాముఁడుఁ జేప్టదక్కి యటుక్ర
న్ననఁ దెల్వినిగల్గి భక్తిభా
వామృత హృద్వికాసుఁడయి,
యక్షరమూర్తి పరద్వయంబునన్
వేమరు సాగిలంబడుచు,
వేవినుతింప దొడంగె నీక్రియన్ 28

దండకము —

దేవాదిదేవా! దివారాత్రముల్ నీవ, యాదిత్యుఁడున్ జంద్రుఁడున్ దారలున్, సర్వభూతంబులున్ భూతతన్మాత్రలున్

నీవ; వేదంబులున్, వానిభావంబులున్ భాషలున్ సర్వ కావ్యంబులున్ గావ్యసారంబులున్ నీవయై; యెల్లలోకంబులన్ లోపలన్ వెల్పలన్ నీవె వర్తిల్లుచున్నావు; శిష్టావలిన్ బ్రోవఁగా దుష్టులం ద్రుంపఁగాఁ గష్టముల్ దీర్పఁగా విష్టప శ్రీసతిన్ బుష్టిఁబోషింపఁగా ధర్మసంస్థాపనోద్ధారివై శౌరివై శూలివై బ్రహ్మవై వజ్రివై నిర్జరుల్ కిన్నరుల్ యక్షగంధర్వులున్ నాగులున్ దానవుల్ దైత్యులున్, రాక్షసుల్ సర్వ జీవావళుల్ గొల్వఁగా వారలే నీవుగా నీవె నారంభజాండమండలీ, యీవిశ్వకావ్యంబునన్ నాయకుం డీవవై, తద్రసంబీవయై, రీతులున్ శయ్యయున్ వాకులర్థంబులున్ సర్వపాత్రంబులున్ నీవయై, కావ్యకర్తృత్వమున్ సూత్రధారిత్వమున్ సర్వ నేతృత్వమున్, సత్త్వమున్ దత్త్వమున్ నీవయై, సచ్చిదానంద రూపుండవై, త్యాగులున్ యోగులున్ మానులుం గొల్వ నాత్మస్వరూపుండవై, స్వర్గపాలాది దిక్పాలకుల్ బ్రహ్మముఖ్యామరుల్ నిన్ను సేవింపఁగాఁ శంఖచక్రాదులంబట్టి శ్రీవత్సమున్ గల్గియున్ గౌస్తుభోద్దీప్తవక్షుండవై శేషశయ్యా విశేషంబునందుండి, యీపక్షిరాడ్వాహనంబొప్ప, శ్రీకామినిన్ వక్షమందూని, శ్రీనారదాద్యాత్మభక్తావళిన్ దేవమానీంద్ర బృందంబులన్ గూడి పేరోలగంబుండి, ముల్లోకరాజ్యంబు నేలంగ మాయావిలాసుండవై, వేయినామంబులం గల్గి, వైతాళికానంతసంస్తూయమానుండవై, వజ్రవైడూర్య మాణిక్య ముక్తాఫలాద్యాభమా భర్మసింహాసనారూఢ తేజోమయాకారముం బొల్చు దేవా! పరబ్రహ్మమూర్తీ! సదా

నందవర్తీ! స్వభక్తార్తి సంత్రాసకీర్తీ! నమస్తే నమస్తే నమస్తే
నమః. 29

తే. గీ అనుచు వినుతించి, శిరమున నంజలించి
యమిత సాష్టాంగవినతుల నాచరించి
వేదవేద్య! సదానంద! విశ్వరూప!
రాఘవాకృతిఁ జూపింపరావె! యనిన. 30

ఉ. రాముఁడు శాంతినొంది భృగు
రాముని ముందర సస్మితాస్యుఁడై
హైమవిలాసభాసురశు
భాభరణంబులఁ దాల్చి, జానకీ
శ్రీమతిఁగూడి, దీర్ఘమయి
చెన్నసలారు ధనుస్సుపట్టి, ప్రే
మామృతమొల్కు చూపుల మ
హాత్మ్యమునన్ గనుపట్టె నెంతయున్. 31

వా. ఆమూర్తిన్‌గని భార్గవుండు రఘు
రామా! నన్నుమన్నించి, ని
ర్వ్యామోహాత్ము నొనర్చినాఁడవు; మహేం
ద్రగ్రావముంజేరి, హృ
త్సీమన్ దావకవిశ్వరూపమును
సంసేవింతు, నాకాజ్ఞ నీ
వే! మద్గర్వమడంగెఁ, దేజమును
నిన్నే యావహించెన్ గదా! 32

తే. గీ. అనుచు నిస్తేజుఁడై రాము ననుమతిఁ గొని
తరలెను మహేంద్రగిరికి నెంతయును క్షేత్ర
మెడలి దైన్యంబు నొందియు, హృదయమందు
రామచంద్రునిపై భక్తిరంజిలంగ. 33

వ. అట్టియెడ నాతని దీనత్వముం గాంచి. 34

కం. భృగువంశ్యులు పితృదేవత
లగువారలు వచ్చి, "పుత్త్ర! హరిమాయయె, ని
యగడునకు మూలమైనది
తగఁ దీర్థంబులకు యాత్రఁ దరలుము, సేకున్". 35

కం. పూర్వపు ధీరతయిబ్బున
"సర్వము శుభమగు" నటంచు సత్యమువలుకన్
బర్విన విశ్వాసముతో
నుర్విన్ దీప్తోదసేవ లొనరఁగఁ జేసెన్. 36

కం. శ్రీపరశురాముఁ డటు హృ
త్తాపంబులడంగ దివ్యతాత్త్వికమతియై
తాపస భావము వెలుఁగన్
దీపిలెఁ జిరజీవియగుచు నిర్మలబుద్ధిన్. 37

మ. ఇట శ్రీరాముఁడుఁ బూర్వతేజమునకున్
హెచ్చైన తేజంబుతోఁ
బటుబాహాబలమొప్ప, సీతయును బా
ర్శ్వంబందు వెల్గొంద, నా

దట మాతాపితృబంధువర్గముల యా
త్మల్ విస్మయానంద సో
ద్భటవృత్తిన్ వెలయంగఁ, దాఁ జని నయో
ధ్యాపట్టణంబున్ వెసన్ 38

వ. ఓభరద్వాజా! యింతయును వింటివేగదా! 39

తే. గీ. జానకీరాము కల్యాణ చరితమందుఁ
బరశురాముని గర్వంబు భంగమగుట
దాశరథి విశ్వరూపసందర్శనంబుఁ
జదివినను విన్నఁ దాపప్రశాంతిగలుగు 40

ఏకరూప వృత్తము —
శ్రీరామా! నీచరణ శ్రీయొకండే
యీరేడున్ లోకముల నేలఁగా, యా
కారంబే ధర్మమది, కంజనేత్రా!
శ్రీరమ్యా! భక్తజన సేవ్యధామా!



# హనుమత్సమాగమము

కం. శ్రీకువలయనాథా ! సీ
తాకాంతా హృదయపద్మధామా ! హనుమ
ద్వ్యక్తకృత తారకనామా !
సాకారబ్రహ్మమూర్తి ! జయజయ ! రామా ! 1

వ. తదనంతర శ్రీరామచరితంబాకర్ణింపు మనుచు శాంతి సుతుండు భరద్వాజ శిష్యుం గాంచి యిట్లనియె.

సీ. దశరథుండును జ్యేష్ఠతనయుని రాజ్యప
ట్టాభిషిక్తుని జేయునట్టి తఱిని
నైకవరంబులు కారణంబుగ, రాము
వనవాసమునకును, భరతు రాజ్య
మేలుటకును, నెట్టకేలకు నియమింప
శ్రీరాముఁడంతట సీతతోడ
సౌమిత్రితోడను సత్యప్రతిజ్ఞుఁడై
చిత్రకూటంబునఁ జేరియుండ
ఆ. వె. వెంగను దశరథుఁడు వీడి ప్రాణంబులు,
భరతుఁ డన్న వేడి పాదుకలను
దెచ్చి గద్దె నునిచి, యచ్చటఁ దాప్రతి
నిధిగ నేలె నేల నిండుభక్తి.

చ భరతుఁడు రాజ్యభార వి
భవంబుల నెల్లను రామపాదుకో
ద్ధరణము లట్లఁ జేసియు, ము
దంబున వల్కలధారియై, జడల్
వరలఁగ రామచంద్రుని శు
భంబగు రాకఁదపించిమించి, ని
బ్బరముగఁ దా నరణ్యమున
వర్తిలునట్లు దలంచె రాముతోన్. 4

చ. దశరథసూతి రాముఁడటు
దండకఁ జేరియు సీతతోడఁ దాఁ
బ్రశమనచిత్తుఁడై, యొకటఁ
బంచవటీస్థలి దివ్యగౌతమీ
దిశ నొకపర్ణశాలను సు
ధీమణి లక్ష్మణమూర్తి గట్ట మా
నిశతశరణ్యుఁడై నిలిచె,
నిర్మల తత్త్వవికాసభాసుఁడై. 5

తే. గీ. తమ్ముఁడైనట్టి భరతుని ధర్మసూక్ష్మ
విజ్ఞతకు మెచ్చికొనుచు, నాపిన్నవాఁడు
భూమి పరిపాలనా భారమును వహించి
యెట్టులున్నాఁడో? యను చింత నెందునొందు. ౬

వ. ఇవ్విధిం గడపుచున్న కాలంబున నొక్కనాఁడు 7

సీ. రావణావరజ శూర్పణఖ, శ్రీరామునిఁ
గామించి వలుక లక్ష్మణుఁడు చూచి
నాసికాకర్ణకృంతన మొనరించి, కు
రూపినిఁ జేయ ఖరుండు దూష
ణాదులు రాక్షసు లా వెంటఁ బదునాల్గు
వేలసైన్యము రాముపైఁ గని డరికి
నరుదేర వారల నర్ధఘటికాంత
రాముఁ డొక్కఁడె బహురాములగుచు

ఆ. చె విశ్వరూపమంది యశ్వర మొనరించ
రావణుండు మాయఁ జేవమీఱి
యపహరించి సీత, నతిమోహవివశుఁడై
లంకలోన నునిచె సంకటమున. 8

ఉ. అంతట రామచంద్రుఁడు ధ
రాత్మజ గన్పడకున్నఁ జిత్త వి
భ్రాంతినిఁ జెంది, దుఃఖమున
బాష్పములన్ గురియింపఁ దజ్జలం
బెంతయు భూమిపైనిఁ బ్రవ
హించెను వైతరిణీసమాఖ్య, న
త్యంతపవిత్రతాగరిమ
నందెఁ బిత్ర్యాణముఁ దీర్చువారికిన్. 9

కం. రాముని దుఃఖముఁగని, యా
సౌమిత్రియు నధికదుఃఖచకితుం డయ్యెన్
దామనమున నిగ్రహుఁడై
స్వామి ననునయించెఁ గొంత శాంతిని బొందన్. 10

ఉ. రాముఁడు లక్ష్మణుండును ధ
రాసుతఁ గానక యెల్లతావులన్
వేమరుఁ బిల్చుచున్ నెమకి,
పృథ్వినిబడ్డ జటాయు దుస్థితిన్
దా మటుచేరి కాంచి, విశ
దంబుగ భూసుతఁగూర్చి తెల్పు నా
ధీమహితాత్మునిన్ విగత
తేజుఁడుగాఁగ నెఱింగి జాలితోన్. 11

తే. గీ. మరలఁ బ్రశ్నించుచున్న రామధరణీశు
వీక్షసేయుచుఁ బ్రాణముల్ విడచె నతఁడు,
పితృసమానునిగా నెంచి ప్రేతకర్మఁ
జేసి, యతనికి మోక్ష మిచ్చెను విభుండు. 12

ఉ. ఆపయి నేగి చంపిరి మ
హాద్భుతదైత్యుఁ గబంధు; నాతఁడున్
శాపవిముక్తుఁడై, ధరణి
జాతను దెచ్చు నుపాయపద్ధతుల్
దీపిలు వాక్యముల్ వలుకఁ
దృప్తిని బొందిన రామలక్ష్మణుల్
శ్రీపతిఁ గొల్చుచుండు శబరిన్
గన నేగిరి తద్వనాంతమున్. 13

చ. గబగబ చిన్ని రాఘవు
లెకాయెకి నన్ గనవచ్చుచుండి రం
ట, బహుకృతార్థతన్ దన
గ నాభవ మంచును దీపిపండ్ల నే

దబదబ నేరి తెచ్చి, సము
దంబున రామునితోడి తెచ్చి, యా
శబరియు రామపాదముల
నాగిలి, విందు నొసంగె భక్తితోన్. 14

తే. గీ. దాశరథియును శబరివాత్సల్యభక్తి
నారముగ్గినపండుగా నరసి మెచ్చి,
యాత్మసాయుజ్య మోక్షమ్ము నందఁజేసి
చేరువను గల పంపను జేరియుండ 15

సీ. నీలమేఘచ్ఛాయ నింపారు బంగారు
వన్నెలమీఱిన వారలగుచు
నాయత ధనువుల నక్షయతూణీర
ములను ధరించిన మూర్తులగుచు
వల్కలమ్ములఁగట్టి వర్ధితదేహులై
జడలుధరించిన సాధులగుచు
క్షాత్రమ్ము ఋషితైజసమును రెండును సమం
బుగ వెల్గువారలై పూజ్యులగుచుఁ

తే. గీ. పంపతటమున విహరించువారి, రామ
లక్ష్మణుల నెఱుంగక, వానరప్రభుండు
వాలిపనుపున వచ్చినవార లెవరొ?
యనుచు, భీతిల్లి సుగ్రీవుఁడ తిరయమున. 16

వ. ఋష్యమూకాద్రి నొక్కచో నిలుపోపక. 17

కం. అటునిటుఁ బరువులనిడి, త
త్తటమున నైదుగురు మంత్రిధార్మికమతు లో
క్కటఁ గలియ, నందు హనుమన్
బటుధీయుతుఁ బంపె వారిభావము నరయన్. 18

మ మతిలోకో త్తరుఁడైన వాయుసుతుఁ డా
త్మన్ దా విలోకించి, భా
సుతనూజాజ్ఞను రామలక్ష్మణుల పొం
దున్ గోరి యవ్వారితో
హితసంభాషణఁ జేసి, వారిఁ గొనిరా
నే తేర. నత్యద్భుతో
న్నతవృశ్యంబది యమ్మహాత్మునకు గ
న్పట్టెన్ మహాత్తేజమై. 19

సీ. శంఖచక్రమ్ములు శార్ఙ్గగదాయుధ
ములుఁ జతుర్భుజముల వెలుఁగువాని
వక్షస్థలంబు శ్రీవత్సాంకితంబునై
సువిశాలమై యుండఁ జొక్కువాని
కటిభాగమునఁ బీతకౌశేయపరిధాను
రత్నకిరీట శీర్షంబువాని
నీలమేఘచ్ఛాయ నేలు దేహమువాని
నాయత పద్మాక్షుఁడైనవాని

తే గీ వామభాగాన లక్ష్మితో నరలువాని
దక్షిణంబున వాగ్దేవిఁ దనరువాని
నటు సనందాదిమునులు నయ్యమరవరులు
భక్తిఁ బ్రస్తుతింప నలరెడువాని, మఱియు. 20

తే. గీ. వేయి సూర్యులకాంతితో వెలుఁగునాని
జంద్రశతచంద్రికా సుప్రసన్న ముఖు, స
హస్ర ఫణఫణిరాజ దివ్యాతపత్రు
గరుడసేవిత పాదపంకజుని మఱియు. 21

ఉ. ఎంతటి యోగిపుంగవుల
కేని యలభ్యుని, నాదిశేషుఁడున్
స్వాంతమునందుఁగూడ నుతి
సల్ప నశక్యుని, విశ్వరూపు, నా
ద్యంతము లేవిలేని పర
మాత్ముని రాముని( గన్నులార, నా
శాంతుఁడు వాయుసూనుఁడతి
సాధ్వసవృత్తిఁ గనెన్ హనూత్తుగా. 22

శా. ఆ దివ్యాకృతి యాంజనేయుని విశు
ద్ధాత్మన్ బ్రకాశింప, స
మ్యోద్యాశులల్ ముఖమండలమ్మును నుర
మ్మున్ నిండ, నిశ్చేష్టతన్
భేదం బాపరమాత్మజీవులకు లే
నేలేని తత్త్వజ్ఞుఁ డ
ట్లే, దీవ్యన్మతివెల్గెఁ గొంతవడి నోలిన్
బ్రహ్మభావంబునన్. 23

తే. గీ. అంత హనుమంతుఁ డాశ్చర్యమంది, మోద
భక్తిభావములొక్కట ప్రబలి పొంగ

గన్నులనువిప్పి యచట నైక్ష్వాకు రాము
ద్విభుజ సంయుతుఁ గాంచి నుతించెనిట్లు. 24

ఉ. శ్రీజగదీశ్వరా! నిగమ
సేవిత దివ్యపదారవింద! య
వ్యాజకృపానిధీ! సకల
భక్తజనావన! మానిమానసాం
భోజనివాస! రాజగుణ
భూషణ! దానవనాశకా! మహా
భ్రాజిత విశ్వరూప! పర
తత్త్వహారీ! యభవా! శుభోదయా! 25

తే. గీ. ఆదిమధ్యాంతరహిత! సత్యప్రకాశ!
పరమ యోగీశ్వరేశ్వరా! పరమపురుష!
విమల యాజక యజన హవిస్స్వరూప!
సచ్చిదానందమయ! నిత్య! సామగేయ! 26

శా. నే సుగ్రీవునిమంత్రినై యతనికిన్
నీభీతిమాన్పింపఁగా
నీ సద్భావ మెఱుంగవచ్చితిని, నీ
నిస్తుల్య తత్త్వోన్నతిన్
దాసత్వంబు వహించి గాంచితిని, మ
త్కార్యంబు లావాసనల్
గాసింజెంది నశించిపోయినవిః నీ
కారుణ్యప్రశీలాత్మశ్రీన్.

ఆ. వె. నిజము దెలుపుమయ్య! నిత్యసత్యవ్రతా;
నీ వెవండ వౌదు? నిర్మలాత్మ!
మహిమ! వెలుఁగుచివు మానవుఁడవు గావు
హరివి నీవిఁకఁ బరమాత్మ వౌదు 28

కం. అను హనుమంతుని వినుతుల
విని రాముం డాత్మనలరి, 'విశ్వంబును నీ
తని కొక్కనికే నాయా
త్మను దెలిపెద వినిజన్మ ధన్యతఁ గాంచన్'. 29

వ. అని యాత్మం దలపోసి. 30

ఉ. వ్యాకులపాటు భక్తియును
నాత్మసమర్పణ భావమొక్కమాఱుగా
వాకులఁ జేతలం దెలియ
వందనముల్ గయి సేయుచుండి. యీ
లోకము విస్మరించి, యెటు
లో నిలువంబడియున్న యాంజనే
యాకృతిఁ గాంచి రాముఁడు
ముదాన్వితమంజులవాక్కి నిట్లనెన్. 31

మహాస్రగ్ధర —
పరమానందంబు నీవిశ్వమునకు నొసఁగన్
భర్గుదు విల్ ద్రుంచి, సీతా
కరపద్మగ్రాహివౌచున్ ఘనపరశుభువి
గ్రామణిన్ జామదగ్నిన్

వరవీరోద్దాము గర్వాపహరణ మొనరన్
భవ్య తేజుండవౌ నిన్
దరమౌనే సన్నుతింపన్ దశరథతనయా
ధర్మత త్త్వస్వరూపా ! 32



# పరమాత్మ తత్త్వము

కం. శ్రీవానరపతి సంసే
వావిమలపదాబ్జయుగ్మ! వైదేహీనా
థా! విశ్వోద్ధరణచణా!
ప్రావృడ్ఘన నీలదేహ! ప్రజ్ఞానఘనా! 1

వ. ఓ భరద్వాజా! శ్రీరామభద్రుండు స్వస్వరూపంబుం
దెలియఁజేయుచు నాంజనేయుంగాంచి యిట్లనియె వినుము! 2

తే. గీ. వత్స! హనుమంత! భక్తిహృద్భాసమాన!
నీవెవఁడవని, నన్నుఁ బ్రశ్నించినాఁడ
వతిరహస్య మవాచ్య మయ్యది సనాత
నంబు, విను నామతత్త్వమున్ శ్రద్ధఁజూపి. 3

కం. సురలును ద్విజులుఁ బ్రయత్నం
బురవడిఁ గావించియైన నొక్కింతయుఁ దా
మరయంగలేని తత్త్వము
హరివర! యెఱిఁగింతు నీకు నాలింపఁగదే! 4

తే. గీ. ఇట్టి నాజ్ఞానమున్నె యాశ్రయించి మించి
బ్రహ్మవాదులు ద్విజులు తద్బ్రహ్మభూతు
లౌచు, మఱిజన్మ లేనివారైరి, జ్ఞాన
సంపదకు భక్తిమూలమ్ము సత్యమిదియె. 5

వ. ఓయీ హనుమంతా! ఆత్మస్వరూపుఁడనైన నేను, కేవల శాంత స్వచ్ఛ సూక్ష్మ సనాతనత్వంబులం గలిగి యుండు అట్టి యాత్మ సర్వాంతర్యామియు సాక్షి చిన్మాత్రంబును దమస్సునకంటెం బరంబును నై యుండు అదియే పురుషుండును సప్రాణుండును మహేశ్వరుండును గాలాగ్నియు నై యుండు అట్టి నాయందే యీవిశ్వమంతయు నుద్భవించి వృద్ధినై లీనంబగుచుండును. అట్టి నన్నవ్యక్తునిగా వేదంబులు వినుతించు మఱియు నేను మాయకున్ బద్ధుండనై, మాయావినై యీజగత్తున శరీరంబులం గల్పించుచు, నందు లగ్నంబుగాక సాక్షీభూతుండనై యుందు. వెండియు నోయాంజనేయ! సావధానుండవై వినుము! ఈదృశ్యాదృశ్య ప్రపంచ ప్రకృతులుగాని, తన్మాత్రలుగాని నేనుగాక వేఱయుండు. జ్ఞానకర్మేంద్రియవ్రాతంబును నేనుగానని యెఱుంగుము. వెలుఁగునకుం జీకటికిని సంబంధము లేనట్లు పరమాత్ముండనైన నాకును మాయకును పంబంధంబు శూన్యంబు. వృక్షచ్ఛాయలకు సంబంధంబు లేనట్లే ప్రకృతికిని బరమేశ్వరుండనైన నాకును సంబంధంబు మృగ్యంబు. 6

తే. గీ. మలినమయి యస్థిరంబగు మానసంబు
ప్రకృతిచేతనె యది వికారంబు నొంది
యుండ, వాజీవునకు ముక్తియుండదోయి!
[illegible] చేతవల్లయు. 7

తే. గీ. ఏ వికారంబులేనిది, యెట్టిదుఃఖ
మైన నంటని దీయాత్మయనుచు బుధులు
నిత్య మవ్యయ మానందనిరతిశయ మ
నంత మంచు నాత్మ నెఱిఁగి తరింతురోయి! 8

తే. గీ. నేనె చేయుచునుంటిని నేనె సుఖము
దుఃఖమును బొందుచుంటిని గాలమయితి
నేనెకృశియించితి ననుచు, నజ్ఞనిలెఁచి
తన యహంకృతి యాత్మకుఁ దగులఁబలుకు. 9

కం ప్రకృతికతీతము సాక్షియు
నకలంకము నక్షయమ్ము, నగునాత్మయె యీ
సకలమునఁ గర్తభోక్తయు
నకుటిల మనిపండితాళియందురు హనుమా! 10

కం. కావున సంసారంబే
జీవుల కజ్ఞానమూలసేవ్యంబగు, నా
భావమున నన్యథాజ్ఞా
నావృతియగుఁ బ్రకృతిజన్యమజ్ఞానమనన్. 11

కం. సర్వగుఁడు స్వయంజ్యోతియు
సర్వోత్తముఁడయ్యు నింతజ్ఞానములేమిన్
గర్వావివేకిజీవుఁడు,
సర్వమునకుఁ గర్తనని యసన్మతిఁదలఁచున్. 12

తే. గీ. బ్రహ్మవాదులు ఋషులు, నవ్యక్తుఁడౌచు
సదసదాత్మకుఁడున్ నిత్యసత్యుఁడైన

వాని నెఱిఁగినవారలై ప్రకృతిఁ గాంచి
బ్రహ్మభావనచే ముక్తిఁబడయుచుంద్రు. 13

వ కావున నో వాయునందనా! కూటస్థుండును నిరంజనుండును నైన యీపరమాత్మయే యిక్కడసంగతుఁడయ్యె. అవివేకు లగువార లాత్మనశ్వరంబుగా నెఱుంగంజాలరు ఆత్మపదార్థమునందే యీయాత్మవిజ్ఞానము కలుగుచున్నది. భ్రాంతిజన్యంబైన రాగద్వేషాదులవలన సర్వానర్థంబులును గలుగుచున్నవి. నిత్యుఁడును సర్వవ్యాపియుఁ గూటస్థుండును దోషరహితుండును నేకాకారుండు నైన పరమాత్మయొక్కఁడే తన మాయచేత నానావిధభేదరూపముల నందుచున్నాఁడు. అందుచేతనే తత్త్వవేత్తలైన మును లద్వైతంబునే పేర్కొందురు పరమాత్మయొక్క యవ్యక్తప్రకృతిచేతనే మాయావశంబయి యీభేదము కలుగుచున్నది. 14

తే. గీ. ధూమమునఁ జేసి, యద్దము దోషరహిత
మయ్యు, మలినమ్ముగాఁ గననైనయట్టు
లాకసంబును బోలు నీయాత్మ మలిన
మనఁగఁ దోఁపించుఁగాని సత్యంబుగాదు. 15

తే గీ. స్ఫాటికోపల మెంతయో స్వచ్ఛమయ్యు
నది, యుపాధినిగల భేదమంది, వివిధ
వర్ణముల నొందువిధమున, వరలు నాత్మ
యును నుపాధులఁబట్టి యే యుండు నెపుడు. 16

తే. గీ. కాన బరమాత్మ నిత్యుఁ డక్షరుఁడు శుద్ధుఁ
డవ్యయుండు మహాత్ముఁడు, నంతటను జ
రించువాఁడును మంతవ్యుఁ డంచితముగ
నతఁడె శ్రోతవ్యుఁ డెఱుఁగుమో యాంజనేయ! 17

తే. గీ. ఎల్లయెడలను వ్యాపించి యొప్పుచుండు
నట్టి చైతన్యమది మనమందు వెలుఁగు
నపుడె యీసర్వభూతములందు స్వాత్మ
రూపము, కనంబడుచునుండు రేపుమాపు 18

వ. ఓకీశాగ్రణీ! ఆత్మజ్ఞానియగువాఁడు సమాధినిష్ఠుఁడై సర్వభూతంబులను వేఱుగాఁ దలంపక పరమాత్మానుసంధానుండై శుద్ధాత్మస్వరూపుండై యుండును. అట్టి పండితుండు హృదయమునంగల కోరికలెల్లం దిగవిడచి యున్నవాఁడే, యమృతస్వరూపుఁడై క్షేమము నందుచున్నాఁడు. అట్టివాఁడు భూతములయొక్క వేర్పాటుం గణింపక యేకస్థంబుగనే యంతటను దర్శించినవాఁడై, బ్రహ్మత్వంబు నందుచున్నాఁడు. మఱియు నోవనచరోత్తమా! తన్ను దాను కేవలునిగా నెప్పుడు చూడఁగలుగుచున్నాఁడో, యప్పుడే వానికీ జగంబంతయు మిథ్యామాత్రంబని తోఁచును. ఆత్మజ్ఞానమే జన్మజరామరణ వినాశక మహౌషధంబై, తక్షణ సదాశివత్వప్రాప్తిం గలిగించుచున్నది. కావున నీవిశ్వంబున విజ్ఞానం బొక్కటియే యున్నదిసుమీ! అయ్యది జీవులయం దజ్ఞానావృతంబై తెలియంబడక యడఁగి యున్నది. ఓవాయునందనా!

లోకంబంతయును మోహమునే పొంది యున్నది. జ్ఞానంబెప్పు
డును నిర్మల సూక్ష్మనిర్వికల్పంబై యున్నది. ఈ జగం
బంతయు నజ్ఞానావృతంబు ఓయాంజనేయా! అత్యంతరహస్యం
బైన యీ బ్రహ్మతత్త్వంబు నీకుపదేశించితిని ఇదియే సర్వ
వేదాంతసారము. వెండియు నాలింపుము ! 19

తే. గీ. యోగ మది జ్ఞానమునఁ గల్గుచున్నదయ్యు
యోగమును జ్ఞానమును గల్గియున్నవాఁడు
పొందరాని దొకింతయుఁ బొసఁగఁబోదు
యోగులును సాంఖ్యులును బొందుచున్న దొకటె, 20

కం. హనుమా! యోగము సాంఖ్యము
లను రెండిటి నొకటిగాఁగ నరసినవాఁడే
ఘనతత్త్వవేత్త యనఁబడు
వినుమీ గోప్యంబు! దీని వివరింతుఁ దగన్ 21

తే. గీ. జ్ఞాన మెఱుఁగని యోగు లైశ్వర్యమందుఁ
దవిలియుండిన చిత్తులై తనువుతోడ
విషయసుఖముల నంద, సంప్రీతు, లింక
జ్ఞానయోగుల సంగతి, బూని వినుమ! 22

తే. గీ. సర్వగతమును నిత్యమ్ము, సత్యశాంత
నిలయమును నిర్మలమ్మును నిత్యమగుచు
నన్నిఁటను నధికమ్మగు నట్టిపథము
నందుచుందురు వారు దేహాంతమందు. 23

తే. గీ. అడిగితివి నన్ను దెలియంగ నాంజనేయ!
వినుము, నీకింతవరకుఁ జెప్పినవియైన
యాత్మయే నేను, మాయావిష్టమైన యాప
రాత్పరుఁడఁగాఁగ నన్ను నీ వరయుమయ్య! 24

తే. గీ. ఎల్లకాలములు, రసములెల్ల, గంధ
సమితియంతయు నేనె, యీజరయు మరణ
మనఁగ లేకుండునాకు; నెందును మదీయ
కరచరణములె నిండఁగాఁ గలిగియుండు. 25

వ. మఱియు నోసమీరకుమారా! సమస్తాంతర్యామినై సనాతనుండనై, పాణిపాదరహితుండనయ్యు సకలజనంబునం జనుమందు. ఎవ్వరిచేనైనను గ్రహింపఁ బడనివాఁడనై, యందఱి హృదయంబులందును నివసించియుందు. నేత్రములు లేనివాఁడనయ్యు సర్వసమీక్షకుఁడనౌదు. శ్రోత్రములు లేకున్నను ధ్వనుల నెల్ల నాలింతును. ఏలోకంబునందైన నాకుం దెలియనిది లేదు. కాని నన్నుమాత్ర మెవ్వండును దెలిసికొనలేకుండును. ఓ నానరోత్తమా! తత్త్వవేత్తలు నన్ను మహాపురుషుండైన విశ్వరూపుంగాఁ దెలిసికొనుచున్నారు సమస్తదేవతలును మదీయమాయామోహితులై, నిర్గుణ నిర్మల నిత్యసత్యంబైన నావిభూతి నెఱుంగలేకున్నారు. ఓయంజనీతనయా! తత్త్వవేత్తలైన యోగిపుంగవులు సర్వవ్యాపకంబును నత్యంతరహస్యంబు నైన నాదేహంబునం బ్రవేశించి, నాసాయుజ్యంబు నందుచున్నారు. మఱియు నీరహస్యంబు వినుము! జగద్వ్యాపిణియగు మహామాయ

యెవ్వారియందుఁ బ్రవేశింపక దూరంబై యుంకునో, యట్టి వారే మదీయాత్యంతపరిశుద్ధ బ్రహ్మనిర్వాణము నొందు చున్నవారై యెన్నికల్పంబులైనను జన్మంబులేని వారగు చున్నారు. మఱియు నోసుగ్రీవసచివా! మదీయాత్మ తత్త్వంబుం దెలిపెద నాకర్ణింపుము. 26

తే గీ. ఆంజనేయ! జనించె నవ్యక్తమునను
గాలమిద్ది; ప్రధానము, నోలిఁబరమ
పురుషుఁడును గాలముం బట్టిపుట్టె సర్వ
జగము, వీని నెఱుంగుము! సాధుభావ! 27

తే. గీ స్థలము లెల్లెడఁ బాణిపాదములు, నేత్ర
ములు, శిరోముఖములుఁ, గర్ణములును గలిగి
యఖిలమును నిండి పరతత్త్వ మమరియుండె
ననుచు నెఱుఁగుము! హనుమ! నీయాత్మలోన. 28

వ. ఓవాయుపుత్రా! ఇంకను వినుము! సర్వేంద్రియంబులును సర్వగుణంబులుం గలిగిన వానింబోలె గోచరించు వాఁడయ్యు, నయ్యింద్రియ గుణరహితుండై, సర్వాధారుండును సుస్థిరానందమయుండును నవ్యక్తుండును ద్వైతవర్జితుండును సర్వోపమానశూన్యుండును సకలప్రమాణంబులకు నగోచరుండును నిర్వికల్పుండును నిరాభాసుండును సర్వాభాసుండును నభిన్నుండును భిన్నసంస్థితుండును శాశ్వతుండును నవ్యయుండును నిర్గుణుండును సర్వోత్తముండు నైన యాత్మ స్వరూపునే జ్ఞానస్వరూపంబుగా నెఱుంగుము. ఓపవన

తనయా! అట్టిపరమాత్మ సర్వభూతబాహ్యాంతరవ్యాపియై యుండును. అట్టి పరమాత్మ నే నేసుమీ! నేనే యీ సర్వంబునై యుండ నాచేతనే యీ ప్రపంచమంతయు నావరింపఁబడి యున్నది. సర్వభూతాత్మకుఁడను నేనే యని యెఱింగినవాఁడే సర్వజ్ఞుండగుచున్నాఁడు. ఓనిర్మలస్వభావా! ప్రధానము పురుషుఁడు నని రెండుతత్త్వంబులం జెప్పితిని గదా! ఆరెంటింటిం గలుపు కాలమొండుగలదు మొత్తమిీ మూఁడును ననాదులుసుమా! ఇవి యవ్యక్త తత్త్వంబున నిలచియున్నవి. పైనాల్గును నాయధీనంబులు. సకలప్రాణి మోహజనకంబైన యీప్రకృతితత్త్వమే జగములఁ సృజింపఁ గలుగుచున్నది. ఓయీ! లసన్మతి! పురుషుండు ప్రకృతి తత్త్వము నందున్నను ప్రాకృతంబైన గుణంబులకాతఁడే యనుభోక్తయై యున్నాఁడు. ఈ తత్త్వంబులన్నియుం గలసి యిరువదియైదగుచున్నవి అందు మొదటిదియైన వికారమే ప్రకృతియనియు;మహదాత్మయనియు నెఱుంగుము. విజ్ఞానము వలన జ్ఞానశక్తియు దానివలన నహంకారమును గలుగుచున్నవి. ఈ యహంకారమే యాత్మయనియు నంతరాత్మయనియు-దత్త్వవేత్తలు పలుకుచుందురు జీవరూపకమైన యంతరాత్మ, జననరూపక సుఖదుఃఖాదుల ననుభవించుచున్నది అట్టిదానికి మనస్సే యుపకారమై యున్నది. ఆమనస్సుయొక్క యవివేకమే పురుషునకు సంసారమును గలిగించుచున్నది. కాలము ప్రకృతితత్త్వసంబంధి యగుటచేఁ గ్రమముగ నవివేకము గలది యగుచున్నది. ఈకాలమే జనన మరణములకుం గారణం

బగును. ఈసర్వంబును గాలవశంబగుఁ గాని కాలముమాత్రము దేనికిని వశంబుగాదు 29

తే. గీ. వినుము! కాలమునా సనాతనము సర్వ
మునకు నదియె యంతర్యామి యనఁగ నుండు
నీప్రపంచము సర్వంబు నెట్టులైనఁ
గాలరూపంబె యై యుండుఁగాదె హనుమ! 30

తే. గీ. షడ్గుణైశ్వర్య సంపన్నసహితమగుచుఁ
బ్రాణమొప్పు, సర్వజ్ఞుఁడౌ పరమపురుషుఁ;
డన్నియింద్రియములకంటె నధికమగుచు
మనసు వెలుఁగొందు; నీఁక హనుమంత వినుము. 31

వ. అట్టిమనస్సుకంటె నహంకారంబును, దానికంటె మహత్త్వంబును, నద్దానికంటె నవ్యక్తంబును, నవ్యక్తంబుకంటెఁ బరమపురుషుండును నెక్కుడని తెలియుము. ఓపవనకుమారా! నేనీసర్వంబునందును వ్యాపించి యుంటిని. శాంతియు జ్ఞానంబును బరమేశ్వరుండును నేనే యయి యున్నాను. నాకంటె నితరం బెద్దియును లేదు. నన్ను దెలిసినవాఁడే ముక్తుండగు చున్నాడు. నే నొక్కండనుదక్క తక్కిన యీ స్థావరజంగమాత్మక సర్వప్రపంచంబును ననిత్యంబని యెఱుంగుము. ఈ లోకంబుల సృష్టిస్థితిలయంబులు నావలననే కలుగుచున్నవి. మాయామయుండనైన నే నీకాలముతోఁ గలిసియుండుదును. నా సాన్నిధ్యమువలననే యనం

తాత్మయగు కాలము సకలలోకములను సృష్టించుమని నియోగించుచున్నది. 32

తే. గీ. వత్స! హనుమంత! వేదాంతసార మిదియె
సుతసమానుని శిష్యునిజ్ఞానియైన
శిష్యసముఁడగు సుతుని పరీక్షించియైనఁ
జెప్పఁదగు దీని నొరులకుఁ జెప్పఁదగదు. 33

కౌముదీవృత్తము —

పరమభక్తాననో ద్భాసితాం
ఘ్రిరజ! నిత్యా! రిపుధ్వంసకా!
సురుచిరాస్యా! సుధామాధురీ
భరితనామా! పరా! రాఘవా!



# భక్తి తత్త్వము

కం. శ్రీవైదేహీ హృదయా
బ్జావాస విలాసభృంగ ! హరిహరరూపా !
దేవాదిదేవ ! దేవా !
భూవర దివ్యావతార ! మోహనరామా ! 1

వ. మరల శ్రీరామచంద్రుండు హనుమంతుం జూచి, దేనిచే నీస్వరూపంబు లభించుచున్నదో, దేనిచేత నీలోకంబం తయుఁ బ్రవర్తిల్లుచున్నదో యద్దానిం జెప్పుట కుపక్రమించె ఓభరద్వాజా ! సావధానుండవై వినుమని వాల్మీకి యిట్లనియె. 2

తే. గీ. నేను సర్వోత్తమంబైన నీదుభక్తి
చేత సాధ్యుండఁగాని, విశేషతపము
లైన దానమ్ములైనను, యాగముఖవి
ధానములునైన నను జేర్పఁదగినవౌనె 3

తే. గీ. సకల భూతంబులందు నేనొకఁడ బాహ్య
మునను నభ్యంతరంబున, మునిఁగియుందు
నేనె సర్వంబునకు సాక్షిని, ననునెవఁడుఁ
జూడఁ దెలియంగ శక్తుండుగాఁడు హనుమ 4

తే. గీ. సకలలోకము లెవనిలో సాగుచుండు
నెవ్వఁ డాసర్వసద్వ్యాప్తి నిప్పటిల్లు
నట్టి పరమాత్ముఁ డనఁ నేనె యనుచుఁ దెలియు
మయ్య! వానరవర్య! యోయాంజనేయ! 5

వ. ఈజగత్తున ధాతనై విధాతనై విశ్వతోముఖుండనై నేనే యున్నాను సకల మునిసురవిప్రసమ్యులును, దేవేంద్రాది దిక్పాలకులును నింక నెందఱెందఱో నన్నుం దెలిసికొనలేక ప్రవర్తింతురు వేదరాశియంతయుం బరమాత్మఁగా నన్నే కీర్తించుచున్నది. మానవులు యజ్ఞాదికర్మంబులచే నన్నే యజించుచున్నారు ఓమారుతి! సర్వలోకములవారును గీతామహుని ప్రస్తుతింతురు. యోగులగువారు భూతాధిపతియుసర్వేశ్వరుండు నగు నామహాదేవుని ధ్యానించుచున్నారు అన్నింటి యందు నున్న నేనే సర్వయజ్ఞభోక్తనై ఫలప్రదుండనై సర్వదేవతామూర్తినై సర్వాత్ముండనై సర్వజనక్షేమకుండనై యున్నాను. ఓయాంజనేయా! ధార్మికులును వేదవాదులును నన్నుఁ జూడఁగలుగుచున్నారుగాని వారిలోఁ బరమభక్తాగ్రేసరులై యెవరు నన్ను సేవించుచున్నారో, వారుమాత్రమే సర్వకాలంబులయందును నావారై నాసాన్నిధ్యంబున నుందురు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులలో. ధార్మికభక్తి తత్పరులైనవారే నన్ను సేవించి మహదానందధామంబైన నాస్థానంబుం జేరి నిత్యసుఖంబు ననుభవించుచున్నారు. ఓవానరోత్తమా! విశేషం బొకండు వినుము! వికర్మములందున్న

వారైన శూద్రాదులును నాయం దనన్యభక్తిం గలిగి యున్నచో నన్నే పొంది ముక్తింబడయుదురు. నాయందు భక్తిలేనివాఁ డెంతటిఘనుండైనను నశించుట తథ్యంబు నాయందు భక్తిఁగలవారు పాపరహితులై యెన్నఁటికిని నాశంబునొందరు. ఆంజనేయా ఇది నాయొక్క ప్రథమ ప్రతిజ్ఞఁగా నెఱుంగుము ! 6

తే గీ నాదుభక్తు నెవండు నిందలనుజేయు
నతఁడు నన్నవమానించినట్లే యగును
నాదుభక్తు నెవండు సమ్మోదమలర
పూజ సేయునో, వాఁడు మత్పూజ్యుఁ డగును. 7

కం నను భక్తి నెవఁడు పత్రం
బును బుష్పము ఫలము నొసఁగి పూజించునో, యా
జనునే ప్రేమింతును, నిత
రుని విలువల సరకుఁ గొనను శ్రుతులన్ శ్రీలన్. 8

సీ. ఆదిలోఁ బరమేష్ఠియా బ్రహ్మదేవుని
నియమించి యతనికి నిఖిలవేద
ములఁ జెప్పినాఁడ; యోగులకును నవ్యయుఁ
డైతి ధార్మికవర్యు లందరకును
నేనే రక్షకుఁడను, నిగమనిందలజేయు
వారిఁ జంపుదు, భక్తవర్యులకును
సంసారబంధంబు సమసిపోవఁగఁ జేతు;
సంసారమే లేని సాధునయ్యు

తే గీ నేను సంసారకారణమైనవాఁడ;
మఱియు సృష్టిస్థితిలయముల్ నెఱపువాఁడ
నేనె, నాకంటె నొరు లెవ్వరేని లేరు,
మాయకుండను నాశక్తి మాయయగును. 9

కం ఆమాయ సకలలోక
వ్యామోహము గలుగఁజేయు, నత్యుత్తమమా
నా మహిత శక్తియే వి
ద్యామూర్తిఁగ నొప్పు, నట్టి దాధారముగాన్ 10

కం. యోగీంద్ర హృదయములలో
నేఁగలుగుదు, వారలందు నిలిచిన మాయా
రోగములఁ బాపుచుండెద
నీగతి; నోయాంజనేయ ! యింకను వినుమా ! 11

తే గీ. సర్వశక్తుఁడ నేనె విశ్వమున నీప్ర
వృత్తియు నివృత్తియుంజేసి వెలుఁగుచుందు
భూతములకెల్ల నాధారభూతుఁ డేను
ఘనతరామృతమున కేనె కారణుండ. 12

వ. మెండియు నోభక్తాగ్రణీ ! సర్వాంతర్వర్తియైన నా శక్తియొక్కటియే సర్వలోకంబులను నడిపించుచున్నది. నేననంతుండను జగన్నాథుండను జగన్మయుండను నారాయణుండను నేనే సర్వనియామకుండనై యున్నాను. అత్యుత్కటమై మూఁడవదియగు నాశక్తియే సకలలోకంబులను నశింపఁ

జేయుచున్నది. అమ్మహాశక్తియే రుద్రరూపిణిగను దమో రూపిణిగను జెప్పఁబడుచున్నది. మఱియు నో యాంజనేయా! వినుము 13

ఉ. కొందఱు ధ్యానయోగమునఁ
గొందఱు జ్ఞానముచేత, భక్తిచేఁ
గొందఱుఁ, గర్మయోగమునఁ
గొందఱు, నన్ను నెఱుంగుచుంద్రు వా
రందఱియం దనుగ్రహుఁడ
నయ్యును, జ్ఞానియటన్న నెంతయున్
బొందెదఁ బ్రేమభావము, సు
పూజ్యత నాతనియందుఁ గాంచెదన్. 14

తే.గీ. సర్వకాలము నెవ్వఁ డీజగతియందు
జ్ఞానయోగముచే నన్ను సత్యరూపు
సేవలను దన్పు నాతఁడే సిద్ధుఁడగుచు
నందు నందర నుత్తముఁ డన్నకీర్తి. 15

వ. ఓ భక్తహృదయా! యింకను వినుము. ధ్యానజ్ఞాన భక్తి కర్మయోగంబులలో దేనినైన నవలంబించి, నన్ను సేవించుభక్తులు పునరావృత్తి రహితంబైన నాలోకంబునందే శాశ్వత నివాసులగుదురు. నే నీసర్వంబునకుం ద్రష్టనై, షడ్గుణైశ్వర్య సంపన్నుండనై ప్రభుండనై మహాత్ముండనై పరమేశ్వరుండనై యున్నాను. యోగీశ్వరుండనై ఓయాంజనేయా! యోగీశ్వరేశ్వరుఁడ నైన నన్ను నెవ్వఁడు యోగంబునం

దెలియుచున్నాఁడో, వాఁడు నాయోగంబున లీనంబగు చున్నాఁడు. పరమానందాశ్రయుండునగు నేనే యీసర్వంబును బ్రేరేపించుచున్నాను సర్వకాలయోగి యగువాఁడె వేదవేత్త యగుచున్నాఁడు 16

కం. హనుమా ! యిది వేదంబులఁ
గనుపించు నిగూఢమగుచుఁ, గావున దీనిన్
బూని వినిర్మలమాశ్ర
ద్ధను నడిగినఁ జెప్పఁదగును దత్త్వార్థంబున్, 17

వ మదీయ భక్తుఁడవైన యోహనుమంతా ! యీనాతత్త్వంబు నెంతఁగా నెన్నిమారులు వచించినను హరగాహంబై యుండుం గావున దీనికిం బునరుక్తిదోషంబు లేదు. నీవు మదీయమహాద్భుత విశ్వరూపంబుం జూడఁగల్గితివి ఇట్టిది నీకు గోచరించుటయు, నామాయయే యని యెఱుంగుము. ఓపవనతనయా ! ప్రకృతిము నను సరించి, నాయీప్రాకృత దేహంబును గూర్చి వచించెద వినుము ! నేను మాయనాశ్రయించి దశరథపుత్త్రుండనై జనించితిని నన్ను శ్రీరామచంద్రు డందురు లక్ష్మణుండును భరతశత్రుఘ్ను లిరువురును గృహంబున నున్నవారు నేనే యీనాల్గుదేహంబులను ధరించి యుద్ధరం బుట్టితిని ఓ సుగ్రీవసచివా ! నీభక్తిభావంబున కలరి యత్యంతార్ద్రహృదయుండనై యీతత్త్వరహస్యంబును జెప్పితిని. సమ్యగ్గర్భుండవై దీనినవధరింపుము ! లోకంబున నెవ్వండైన నీవిషయముం బరించినవాఁడు సర్వ

పాపవిముక్తుండై జీవన్ముక్తుండు కాఁగలఁడు, నన్నుఁగూర్చిన యీవిషయంబును బరిశుద్ధాంతఃకరణులగు బ్రాహ్మణాది చతుర్వర్ణంబులవారికిని వినిపించినవారును, నిందలి యర్థంబును బాగుగ గ్రహించినవారును, భక్తిశ్రద్ధలతో నాలించినవారును, సకలాఘౌఘవినిర్ముక్తులై బ్రహ్మలోకంబునఁ బూజ్యులై యుందురు. 18

మత్తకోకిల వృత్తము :—

రామరామ ! హరేహరే ! యని
బ్రహ్మముఖ్య సురాదులున్
శ్రీమహేశ్వరుఁడున్ సమస్తము
నీశ్వరుల్ నియతాత్ములై
నీమహత్వ మెఱింగి నిత్యము
నృత్యముల్ వెలయింపరే !
ధీమనోహర ! భద్ర ! దాశర
థీ ! సుధాసమ సన్నిధీ ! 19

# హనుమత్కృత శ్రీరామస్తోత్రము

క॥ శ్రీసీతానిజపద!
దాసజనావన! ప్రశాంత తాత్త్వికమూర్తీ!
యోసామగానలోలా!
భాసురరామావతార! పరమాత్మ! హరీ! 1

వ. ఓయి భరద్వాజ! భక్తివిహ్వలాంతఃకరణుండనై వినుము. ఇక్ష్వాకువంశంబున శ్రీరామచంద్రుండుపదేశించిన వేదాంతసారంబును భక్తితత్త్వంబును సవిస్తారముగ నాకళించుకొనిన యాంజనేయుండు విశ్వరూపధ్యానపరుండై, హృదయాంతరాళ విరాజమానుండైన దేవదేవుం దలంచి నమస్కరించి, యోంకారోచ్చారణపూర్వకంబుగా శరీరాంతర్గత గుహానివాసుండైన శ్రీరామపరాత్పరుని నమితశక్తి సామర్థ్యములుగల వానిగను. సనందాది సకలమౌని స్తుత్యునిగను నప్రమేయునిగను నవలోకించినవాడై వేదాధ్యయన నియమిత మనస్కుండగు నాంజనేయుం డిట్లని సన్నుతింపం దొడంగె. 2

సీ. ఓ రామచంద్ర! మహోదార! సర్వని
యామకా! ప్రాణేశ్వరా! పవిత్ర!
అంతములేని యోగాత్మ! ప్రచేతసాం
బ్రహ్మమయా! సర్వవరద! సుఖద!

జగతిసర్వాంతర సన్నివిష్టుఁడవైన
ప్రణుతులు నీకివే రామచంద్ర!
భక్తహృత్పద్మసంవాస! నీలాభ్రస
న్నిభగాత్ర! విద్వాంస! నిశ్చలాత్మ!

తే. గీ. దేహసందోహముల నీవె దేహివగుచు
పరమునకు నీవె పరుఁడవై వరలు విశ్వ
రూప! నిన్నె ధ్యానించెద రేపుమాపు
భజనఁజేయుదు శ్రీరామభద్ర నిన్ను. 3

సీ. ఈలోకములు భవదిచ్ఛాజనితములు
సర్వాత్మసృష్టికిఁ జాలునట్టి
పరమాణుభూతుఁడవరయ నీవేయాదు
వణువున కణురూపుఁ డౌదు నీవె
యలమహాత్మునకు మహాత్మువౌదు, పురాణ
పురుషుఁడ వీవు, నీముదలఁ జేసి
బ్రహ్మదేవుఁడు శాస్త్రపద్ధతి జగముల
నంతరాత్మండౌచు నఖిలసృష్టి

తే. గీ. జేయుటను సృష్టికర్తఁగాఁ జెప్పఁబడును
నీవలన వేదరాశి జనించిమించె
నఖిలజగములు నీయందె యధివసించుఁ
బ్రణుతులర్పింతునీకు శ్రీరామచంద్ర! 4

సీ. జగదేకనాథుఁడ వగణిత మాయావి
వని నిన్ను శరణంబు నందువాఁడ
నాకాశమధ్యంబు నందు నృత్యమొనర్చు
ఘనభవన్మహిమంబు గాంచినాఁడ
నఖిలాత్ముఁడవుఁ బరమాత్ముఁడవు ననేక
విధములుగా నున్న విశ్వరూపు
నిన్ను సందర్శించి నేను బ్రహ్మానంద
భరితుఁడ నౌచుంటి భవ్యమూర్తి!

తే. గీ. నీవె యోంకారశబ్దంబు, నీవె ముక్తి
కారణుండవు, నీవె యక్షరుఁడవౌదు
ప్రకృతియందు నిగూఢరూపమునఁ బొందు
వనుచుఁ దెలిసెను శ్రీరామ! ఘనసుధామ! 5

సీ. సత్పురుషులు నిత్యసత్యునిగ స్వయంప్ర
కాశునిగా నిన్ను గాంతు రెపుడు
సకలదేవతలు నిన్ సన్నుతింతురు, దివ్య
మునిపుంగవులు నీకు మ్రొక్కుచుంద్రు
బ్రహ్మనిష్ఠులు శాంతభావగరిష్ఠులై
సర్వోత్తమోత్తమ సౌమ్యమూర్తి
వనుచు నీయాత్మయందునఁ బ్రవేశమొనర్చి
నిశ్చలతత్త్వులై నిలిచియుంద్రు,

తే. గీ. రొకఁడవై యుండి వివిధరూపకుఁడ వౌచు
వెలుఁగునిను సన్నుతించును వేదరాశి
నీశరణమొందువానికే నెగడుశాంతి
సౌఖ్యములటంచు నుపనిషత్సరణి దెలుపు. 6

సీ. సకలలోకంబుల శాసించువాఁడవు
బ్రహ్మవు తేజోవిరాజితుఁడవు
నణిమాదులైన యష్టైశ్వర్యయుతుఁడవు
నీవె వరిష్ఠుఁడవై వెలుంగ
నిన్ను సేవించుచు నిత్యముక్తిని బొందు
చుందురు భక్తులానందమయులు
దేవోత్తముఁడవైన నీవొక్కరుండవే
యీ విశ్వమెల్ల సృజించి పెంచి

తే. గీ. సర్వము లయింపఁజేయుదు, సర్వసాక్షి
వగ్నియన వాయువన్నను నర్యముఁడనఁ
జంద్రుఁడన నీవొకండవె యంద్రు బుధులు
ప్రణుతులర్పింతు నీకు శ్రీరామచంద్ర

సీ. అక్షరుండవు నీవె యఖిలప్రపంచంబు
నకు మూలకారకుఁ డొకఁడ వీవె
ధర్మగోప్తవు సనాతనుఁడ వవ్యయుఁడవుఁ
జతురాననుఁడవు శాశ్వతుఁడ వీవె
పురుషోత్తముఁడవును నరయ విష్ణుండవు
రుద్రుఁడవును వీరభద్రుఁ డీవె
జగతిని షడ్గుణైశ్వర్య సంపన్నత
సర్వనియామకోత్సాహి వీవె

ఆ. వె. విశ్వనాథుఁడవును విశ్వేశ్వరుండవుఁ
బ్రకృతిరూపుఁడవుఁ బురాణపురుషుఁ

డవును సూర్యవర్ణుఁడవును నీవేమైన
రామచంద్ర ! నీకుఁ బ్రణతిశతము. 8

తే. గీ రామభద్ర ! పరాత్పరా ! రమ్యధామ !
సకలలోకంబులును నిన్నె శరణ మొందు
సర్వభూతాధినాథ ! ప్రసన్నమూర్తి
వగుము నాయెడ, నీకిదే ప్రాంజలింతు. 9

మ భవబీజంబులు భస్మమై చెడును నీ
పాదాబ్జయుగ్మంబు, నెం
దెవఁడేనిన్ హృదయంబునం దు నిచి,
ధ్యానింపంగ నానందధా
మ విశేషోన్నతి నందఁగల్గు రసన
న్మాధుర్యరూపంబునన్,
జపులూరన్ వినుతింతు నీకృపకునై
సర్వేశ్వరా ! రాఘవా ! 10

తే, గీ. కాలరూప ! భవోద్భవ ! కమలనాభ !
శ్రీమదాత్మాభిరామ ! శ్రీరామభద్ర !
లోకపద్ది ! మహాత్మ ! సర్వైకహరణ !
సతత మొనరింతు నిటు నమస్కారశతము. 11

కం అని వినుతించిన హనుమం
తుని కలసిన విశ్వమూర్తి తొల్లింటిరూపం
బును రామాంకితమును జూ
పెను లక్ష్మణసహితుఁడై చుఁ బ్రేమాస్పదుఁడై. 12

తే. గీ. పలికె వాత్సల్యమున రామభద్రుఁడంత
వాయుసూనుని వినయసంభరిత వివిధ
భావబంధుర సంస్తుతి వాక్యసరణి
వినుచు గాంభీర్యమున మితంబును హితంబు. 13

తే. గీ. వానరోత్తమ ! నీవు సద్భావమలరఁ
జేసియున్నట్టి స్తోత్రంబు చెవులఁజవులు
వుట్ట నెవ్వాండు వినునో యప్పుణ్యమూర్తి
యుత్తమోత్తమలోకంబు లొందఁగలఁడు. 14

వ. ఓ యాంజనేయా! నీవింకస్థిరత్వంబునొంది, యిాపైఁ జేయందగిన కార్యంబుఁ జక్కగ నాలోచించి, యాచరింపుము. 15

వసంతతిలకవృత్తము —

శ్రీమన్మహామునినిషేవిత పంపతీరో
ద్దామాశ్రమంబునను దాశరథీ ! దయాబ్ధీ !
రామా ! యటంచు నినుఁబ్రార్థనజేయఁగా, నీ
వే ! మోక్ష మాశబరి కెంతయుఁ బ్రీతితోడన్. 16



# రావణ సంహారము

కం. శ్రీవిశ్వరూప ! విశ్వా
త్మా ! విశ్వపతీ ! మహాత్మ ! దశరథపుత్రా !
దేవాదిదేవ దేవ ! సు
ధీవర ! వేదాంతసారదీప్తా ! రామా. 1

వ. ఓయి భరద్వాజా ! శ్రీరామచంద్రుండు హనుమంతుం
జూచి మరల నిట్లనియె వినుము, 2

మ. హనుమంతా ! విను రావణాసురుండు
నాయర్ధాంగియౌ జానకిన్
గొనిపోయెన్, దగ నిప్డు జాతనిని నేఁ
గూల్పంగ సుగ్రీవు మై
త్రిని గాంక్షించితి, దానినీవె
యనుసంధింపన్ సమర్థుండవౌ
దనినన్ వాయుసుతుండు నిట్లనియె
సమ్యగ్రీతితో నవ్వుచున్. 3

తే. గీ. నీచుఁడై రావణుండటు నీదుభార్య
నపహరించుట తెలిసెఁ, గీశాధిపతియు
మిమ్ముఁ దెలియంగ నన్నుఁ బంపించినాఁడు
నాదుభాగ్యమ్ముగ బండించినావు నీవు. 4

శా. స్వామిప్రేషితుఁడై తదాజ్ఞలను సం
భావించుచే యెన్నఁగా
సామాన్యంబగు లోకధర్మ, మిఁక
క న్యాస్కంధంబులన్ మీరు స్వే
చ్ఛామాత్రంబునఁ గూరుచుండుఁడని,
భాస్వద్వాయుసూనుండు శ్రీ
రామున్ లక్ష్మణునిన్ వహించి యిటు
గూర్పన్ బోయె సుగ్రీవుతోన్. 5

మ. ఇనసూనుండును రామలక్ష్మణులఁ దా
నీక్షించి యుప్పొంగె వా
లిని సంహారమొనర్చి భార్యనపుడా
శ్లేషించి కైకొన్నటుల్;
ఘనుఁడై యంతట రామసఖ్యమును
గాంక్షన్ జేసె; వెన్వెంటఁ
యనలుం డచ్చట సాక్షియై వెలుఁగ, స్నే
హంబది రయ్యిర్వురున్. 6

ఉ. రావణరాక్షసాధముఁడు
ప్రాజ్ఞత దక్కి హరించినట్టి సీ
దేవినిజూచి, సేమమును
దెల్పఁగఁ గీశులఁబంపువాఁడ, నా
రావణుఁ జంపఁ దోడ్పడుదు
రామ! యటంచుఁ బ్రతిజ్ఞఁజేసె సు
గ్రీవుఁడు; వాలిఁజంపుదును
గీశపతీ! యనె రామభద్రుఁడున్. 7

సీ. శ్రీరామభద్రుండు సుగ్రీవుఁ గావనొకకోల
చే వాలిఁ జంపి కిష్కింధ కప్రభు
ముదమున సుగ్రీవు మూర్ధాభిషిక్తుఁ
గావించె; నంత సుగ్రీవరాజు
జగతిఁ గల్గిన హరిగణముల రప్పించి
జానకీక్షేమంబుఁ బూని తెలియ
నన్ని దిక్కులకును నంపింప, హనుమంతుఁ
డతివేగముగ లంకకరిగి, సీత

తే. గీ. నరసి, రామచంద్రు నానందపరవశుఁ
గాఁగఁ జేసెఁ, గపిగణము లెల్ల
రావణాది సర్వరాక్షసులం జంపఁ
గడగి, వెడలిరి భువిఁ గప్పివైచి. 8

తే. గీ. అధివసించెను రాముఁడు హనుమద్భుజము
నంగదునిపైని లక్ష్మణుఁ డధివసించె
నఖిలవానరు లావెంట నరిగినారు
విశ్వమువడంక వీరాధివీరు లెల్ల. 9

కం. వారిధితటమున వానర
వీరులతోఁ గలిసి విడిసి, వీరాగ్రణి యా
శ్రీరామభద్రుఁ డంతట
ధీరున్ లక్ష్మణుని జూచి తేకువఁబలికెన్. 10

శా. ఈపాథోనిధిమధ్య లంకగలదో
యీ! లక్ష్మణా! సైనికా
టోపం బింతయు వెంటరాగ, మనమె
ట్లో దీనిలంఘించి. త

ద్వీపంబుం దగముట్టడింపవలె; వే
వేగన్ మహాక్రూరనీ
చాపీనుండగు రావణాధముని సం
హారంబు సేయన్వలెన్. 11

ఉ అన్న వచించుమాటలను
నన్నియు విన్న సుమిత్రసూతి, ! య
భ్యున్నత వాగ్గభీరత మ
హోదధిఁజూచి, "సమస్తసైన్యముల్
నిన్ను దరించుమార్గము వి
నీతుఁడవై వచియింపు" మంచు, నె
న్నెన్నొ విధాల వేడినను
నించుకయిన్ వినకుండె నాతఁడున్, 12

ఉ. లక్ష్మణమూర్తి దేహము వి
లక్షణమై, సువిభక్తకంపమై
పక్ష్మలుపై పయిన్ దోలఁగఁ
బట్టఁగరాని కృధాగ్ను లకులన్
సూక్ష్మములైన రోమముల
సూటిగ వెల్వడి భీతిఁ గొల్పు నా
లక్ష్మలుగల్గి వారిధిజలం
బులమధ్యఁబడెన్ మహోగ్రుఁడై. 13

శా ఆకాయంబుననుండి వెల్వడి విష
వ్యాత్తాగ్ను లెన్నేనియున్
మూకల్ గానగు జంతుసంతతుల రూ
పున్ మాపుకొఁగాక, య

ప్రాకల్ వెట్టె జలంబులింక నుదక్షన్;
బ్రాల్మాలి యూవానరా
నీకంబెల్ల వడంకుచుండె సురలున్ భీ
తిల్లి రెంతేనియున్. 14

శా. ఆయాలోకములన్ జరాచరములున్
హాహాకృతుల్ సేయఁ బ
ద్వ్యాయోగంబుఁ దలంచి, సర్వసుమన
వ్రాతంబు మహేంద్రులున్
శ్రీయున్ స్వస్తియుఁ గల్గుఁగాక' యని యా
శీర్వాదముల్ సేయ శ
ర్మాయత్తుండగు రామచంద్రుఁడు సకా
ర్యంబంమ వారింపఁగన్. 15

శా. ఆసౌమిత్రియు రామునాజ్ఞ నటుశాం
తాత్మున్ దరింజేరఁగా
నాసంద్రంబున నీరువోయి, కుతలం
బైయున్నఁ దజ్జంతు సం
త్రాసంబేర్పడె, నంత రాముఁడు దయా
ర్ద్రంబైన చిత్తంబునన్
గాసింజెందుచు బాష్పవారి నెలయం
గా నింపె నవ్వారిధిన్. 16

తే. గీ. రామచంద్రునిదయకు సురప్రకాండ
మెంతయును సంతసిలి సుమవృష్టిఁగురిసి
రలసముద్రుండుఁగూడ నంజలిఘటించి
వచ్చి, సద్భక్తి రాముని బ్రస్తుతించె. 17

శా. రామా ! నీకరుణాకటాక్ష మిటుసం
ప్రాప్తించె; ధన్యుండ, నీ
ప్రేమన్ వాకొన నేరికైనఁ దరమే ?
బ్రహ్మేంద్రముఖ్యామర
స్తోమంబెప్పుడు నీమహామహిమలన్
స్తోత్రంబు గావించు, దే
వా! మర్త్యాకృతినున్న వేదవినుతా !
బ్రహ్మాండభాండోదయా ! 18

ఉ. భూతములెల్ల నీముదలఁ
బొందుచు హద్దులుమీఱకుండు, నె
ట్లీతటి నేనువానరుల
కీయఁగలాఁడను త్రోవ ? వానర
వ్రాతమునందు నీలుఁడను
వాఁడు గలం డతఁ డీజలంబునన్
ఖ్యాతిగ సేతుశిల్పము నొ
నర్చును, వాహినిచేరు లంకకున్. 19

చ. అని కడునమ్రతన్ బలుకు
నంబుధిఁగాంచి, రఘూద్వహుండు, నా
తని వచనప్రకారము ము
దంబునఁ జేసియు లంకఁజొచ్చి, రా
వణుఁ దెగటార్చి రాక్షసుల
వంశవినాశ మొనర్చి, విజ్ఞతన్
వినయవిధేయతల్‌గల వి
భీషణు రాజునొనర్చె లంకకున్. 20

ఉ. ఈసునకైన ముజ్జగతి
నీజనకాత్మజతో సమంబుగా
భాసిలు సాధ్వి లేదనెడి
భవ్యమతిన్ దృఢభావుఁడయ్యె నా
డాసుచరిత్ర లోకముల
యందు వెలుంగఁగ, రాముఁ డగ్నికిన్
జేసెఁబరీక్ష యగ్ని యటు
సీతను రామునకొప్పగించినన్. 21

ఉ. శ్రీరఘురామచంద్రుఁ డంత
సీతనుగూడి విభీషణాదులున్
వీరులు వానరుల్ గొలువ,
విశ్వజనీనముఁగూర్చి, పుష్పకో
దారవిమానయానమునఁ
దక్షిణ మూతిఁడయోధ్యఁ జేరి, వి
స్తారముదంబు నాభరతి
ధన్యునకున్ సమకూర్చె నత్తఱిన్. 22

తే. గీ. ఆంజనేయుఁడు రామపాదాశ్రయుండు
గాఁగ సుగ్రీవుఁడు స్వదారగణముఁగూడి
సకలవానరపతులు జానకిని గొలిచి,
రాఁగ రాముఁడయోధ్యఁ జేరంగనయ్యె. 23

ఉత్సుక వృత్తము .—

శ్రీగుహుఁడే కడుసిద్ధుఁడై
జాగృతినొక్కనిశన్ నినుక్
బాగుగఁదన్పఁడె పాదసే
వాగతి రాఘవ! భక్తుఁడై. 24



# శ్రీ రామ పట్టాభిషేకము

కం. శ్రీసత్యాత్మక! ధర్మో
ద్భాసిత దివ్యావతార! తారకనామా!
దాసజనపోష! రామా!
నీసరి దేవతలుగలరె? నిత్యానందా! 1

వ. ఓ భరద్వాజా! శ్రీరామసన్నిధింబడసిన యయోధ్యా
వాసులెల్లరును బ్రహ్మానందభరితులై యుండిరి సుమా! 2

సీ. శ్రీరామచంద్రుండు సీతతోఁ గౌసల్యఁ
జేరి తత్పదములఁ జేసెనతుల
నాపై సుమిత్రాంబ యడుగులకున్ వంద
నంబాచరించెఁ, గైకాంబఁ జేరి
నిర్మలచిత్తంబు నిండారు విశ్వాస
మలర నమస్కృతు లాచరించె
గురుపాదజనిత పాదరజంబు శిరమంట
మునివశిష్ఠుని పాదపూజఁ దనిపె

తే. గీ. మఱియు మొదలంగ భరతశత్రుఘ్నులకును
గాఢ పరిరంభసౌఖ్యంబుఁ గలుగఁ జేసె
వృద్ధమంత్రులకును పౌరవృద్ధజనము
లకును వేర్వేర వందనాదిక మొనర్చె. 3

ఎ. మఱియు నాసమయంబున. 4

చ సకల నదీనదంబులను
సంద్రములన్ హిమవన్నగంబునన్
బ్రకటితమైన తీర్థముల
భద్రమహౌషధులన్, వనేచర
ప్రకరము వోయి, తెచ్చి ర
టువాయుజవంబునఁ బౌరులెల్లరున్
సకలకళావిలాసముల
స్వర్గముఁజేసి రయోధ్యనంతటన్. 5

సీ. వామదేవాదులౌ వరమౌనిబృంద మెం
తయు సామవేదగానంబు సేయ
వేదవేదాంగాదివిధులు బ్రాహ్మణులెల్ల
శ్రద్ధతో దేవతార్చన లొనర్ప
నఖిలసామంతులు నతులరత్నాభర
ణాదులఁ గానుకలీయంగ నిలువ
గాంధర్వవిధిఁ బౌరకాంతలు పంచమ
స్వరములఁ దనకీర్తి పాడుచుండ

తే. గీ. భరతశత్రుఘ్నులిరువైపుల రహిఁజామ
రములవీవ, లక్ష్మణుఁడు ఛత్రమునుబట్ట
సీతవామాంకమున నధిష్ఠించియుండ
సార్వభౌముఁడు శ్రీరామచంద్రమూర్తి. 6

కం. గణుతింపరాని యనుపమ
మణిమయ సింహాసనమున మహిమాన్వితుఁడై

రామరాజ్యమున సర్వము సర్వకాలమున్
సర్వార్థసిద్ధులు సంభవించె
దున్నకుండగనె యీమున్న బంగారు
పంటలేపండి సంపదలు పెఱిగె

తే. గీ. జారచోరాదిభయములు సమసిపోయె
విధవలే లేరు; పెద్దలు పిన్నలకిలఁ
బ్రేతకర్మలొనర్చు దుర్విధి నశించె
నన్నిఁటను రాముఁడాదర్శమై వెలింగె. 10

స్రగ్విణీ వృత్తము ,—

ఆపరాశక్తియే యౌను సీతమ్మ; సీ
వే పరబ్రహ్మవై విశ్వసృష్టిస్థితి
స్వాపనంబుల్ దగన్ సల్పు శ్రీరామ! భ
క్తాపదల్ బాపి శాంతాత్ములన్ జేయవే! 11



# శ్రీ రామ మునీంద్ర సమావేశము

కం. శ్రీరవివంశ పయోనిధి!
సార సుధసహితచంద్ర! జయజయరామా!
వీరోదారచరిత్రా!
దారాధరనీలదేహ! దశరథరామా! 1

వ. ఓభరద్వాజా! యీాపైనంజెప్పంబడు సద్భుతకథా
విధానం బాలింపు మని వాల్మీకి మహర్షి యిట్లనియె. 2

ఉ. రాముఁడు వైరివీరఘన
రాక్షసనాశ మొనర్చి, మేదినిన్
ధీమహిమాన్వితుండగుచు
దేవపతిం బలె రాజ్యమేలఁగాఁ
బ్రేమ నయోధ్యకున్ జనిరి
విశ్వమునిప్రకరంబు, లాతనిన్
సేమముగోరి గాంచుటకుఁ
జిత్తవినిర్మల భక్తియుక్తులై 3

సీ. కణ్వాయవక్రీత కౌశికరైభ్యులున్
చ్యవనాది ప్రాగ్దిశాస్థలులు కొంద
ఱరిముచుండు నగస్త్యుఁ డాత్రేయుఁడును నము
చాదులు దక్షిణాశాంతవాసు

లటు, కామరుఁడు ఘూర్ముఁడరయ రౌద్రాశ్వుండు
మొదలగు పశ్చిమమ్మునఁగలారు
శిష్యప్రశిష్య విశిష్టవశిష్ఠాదు
లుత్తరదిశ నొప్పియుండువార

తే. గీ ల్లైన, మునిపుంగవులు వచ్చి రగ్నిహోత్ర
తేజములఁబోలు దేహసందీప్తులలర
ఫలసమితి, మూలములను గానుకలుగఁ దెచ్చి
యప్పనము సేసి శ్రీరాము నరసినారు. 4

ఉ. ఆవిధి వచ్చినట్టి ముని
లందఱకున్ రఘురామమూర్తి, సీ
తావనితాయుతుండయి య
థావిధి నిర్మలభావ మేర్పడన్
సేవలొనర్చి, యాసనవి
శేషములందు సుఖోపవిష్టులై
యావిధినున్న వారలకు
స్వాగతవాక్కులు వల్కి యంతటన్. 5

కం. ఘనరత్నఖచితసింహా
సనమున తనరాజ్ఞిసీత శాంతగభీరా
ననయై వామాంకంబున
నెనయన్, శ్రీరామభద్రుఁ డేర్పడి యుంగెన్. 6

ఉ. అంతట నమ్మహామునుల
యందు నగస్త్యుఁడు దొట్టి కొందఱ
త్యంతవచఃప్రగల్భులయి
దాశరథిం గని. దివ్యభాగ్యశో

భాంతరసార్వభౌమతను
నట్టి వచించుచు, సంస్తుతించుచున్
సంతసమందుచున్ మరల
శాంతినిధానులు వల్కిరివ్విధిన్. 7

సీ. సకలలోకోపకారక కార్యదక్షుండ
వై, జగన్నాథాఖ్య నందినావు
ఖరదూషణాది ముష్కరచతుర్దశ సహ
స్రబలుల గడియలోఁ జంపినావు
పౌలస్త్యసంహారవశమున జగములు
మరలఁబుట్టఁగఁ జేసి నిలిపినావు
షాడ్గుణ్యసంప దక్షుఁడవై లోకావ
నుండవౌ నారాయణుండ వీవు

తే. గీ. ధాతప్రార్థింపఁగా నయోధ్యాపురమునఁ
బరమధార్మికమౌ సూర్యవంశ మెల్ల
నటుతరింపఁగ నవతారమందినావు
మాతపస్సులుపండె. రామ క్షితీశ! 8

శా. శ్రీరామా! యిఁక నేవనంబునయినన్
జేరంగ, మాదీక్షలన్
ప్రారంభింపఁగ నిర్భయత్వ మమరెన్,
ధర్మంబు సంపూర్ణ నా
కారంబై విహరించె, నెల్లరు మముం
గానంగ నుద్యుక్తు, లీ
సారంబై తగురామ తారకమౌ మా
సౌభాగ్య మొప్పెట్టునన్. 9

ఉ. ఇంతకు నీకటాక్షమున
నెంతసుఖంబుగ నున్నజానకీ
కాంతను రావణాసురుఁడు
గర్కశుండై యటులంకనుంచి, యెం
తెంతటి కష్టపాట్లు ఘటి
యించెనో ! వానిఁ దలంచినంత, మా
స్వాంతములెల్ల దుఃఖ వివ
శంబులునై కలుషంబు లయ్యెడిన్. 10

మ. వనవాసంబుననుండ, నేము దనుజా
వారంబు నున్మూలనం
బొనరింపన్ నినువేడ నేమిటికి ? త
ద్యోగంబె మూలంబుగా
ఘనదుఃఖంబుల నెంత లెంతలుగ నీ
కంజాక్షిసీతమ్మ యో
ర్చినదో ? యంచును మామనఃప్రకృతిలో
రేఁగున్ విచారాగ్నులున్. 11

చ. అనవిని సీత సుస్మితము
ఖాంబుజయై మధురాక్షరాన్వితం
బును, పరమార్థతత్త్వపథ
మున్ హితభావముగల్గు వాక్యముల్
మునివరు లాలకింపనిటు
ముచ్చటగా నటురీవిమీఱఁగా
వినయమునన్ వచించె రఘు
వీరవరున్ గనుసన్నఁ గాంచుచున్. 12

కం. రావణుఁడు దురాచారుం
డై, వరలుట నిజము, దశముఖారభటిన్ మ
ర్భాభవుండై లోకమ్ములఁ
దా వేధించుటయు నిజము దానవపతియై. 13

కం. అని వెండియు నవ్వుచు
జనక యిట్లనియె మౌనిసంఘముతోడన్
వినుఁడీ! రావణుఁ జంపుట
ఘనకార్యంబౌనె? రాముఁ గనుఁగొని వాఁగడన్. 14

తే. గీ. రావణుఁడు క్రూరరాక్షసుఁడై వరలుట
సత్యమయ్యెను వాఁడు నిస్సారుఁడు మఱి
ధర్మహీనుఁడు, వాని యుద్ధమున సంహ
రించుటయు వహ్వారే! వినుతించినారె! 15

వ. అన విని యాసమయంబున. 16

మ. అమలాత్మోన్నతు లామునీంద్రులు హ
రా దత్యంతవిభ్రాంతు, లా
రమణీవాక్యములందుఁ గల్గిన మహా
ర్థంబేమొ యూహింప లే
క, మముం గాంచిన యీమె చిర్నగవుతోఁ
గల్పించి యేమేమొ, వ
ల్కె, మనంబి ట్లవమానమందెఁగద!
యాలింపఁగఁ దద్వాక్యముల్. 17

వ. అని మనంబునం దలపోయుచు మఱియు 18

తే గీ. ఒకరి మొగములనొకరు చూచుకొనుచుండి
వారిలోవార లేమేమొ వ్యక్తపడని
మాటలను జెప్పుకొనుచున్న మౌనులఁ గని
యెటు శపింతురో? యేమొ? మునీంద్రులనుచు 19

చ. భయవినయంబులుం గదురఁ
బ్రాంజలిపట్టి ధరాత్మజాతయున్
"దయఁగలవారలై యనుమ
తింబు నొసంగ, సవిస్తరంబుగాఁ
బ్రియమలరంగ మీకునొక
విన్నపముం బొనరింతు నంచుఁ బ
ల్కియు నటులూరకున్న వరలెన్
సభయంతయు విస్మితాత్మయై. 20

వ. అంత నమ్మహామునులం దగస్త్యుండులేచి, సీతమ్మా!
నీభావంబేమొ వచింపుమా! యని యర్థించిన— 21

తే గీ. ప్రాణవిభుఁడైన శ్రీరామభద్రు నాజ్ఞ
వడసి, యువ్వసిష్ఠాది సభాసదులను
గాంచి యెల్లర యనుమతిఁగలిగి సీత
యిట్లు వివరించె నాశ్చర్య మేర్పడంగ. 22

పృథ్వీవృత్తము —
ఎలుంగులును వానరంబులును నెంతయున్ నీదు సే
వలన్ జెలగి పక్షియున్ బరమభక్తియుక్తిన్ నిశా
టులన్ రణమునందు వీరతనటుల్ వినాశంబు సే
యులీలలవి నీవె గావుకొ? మహోదయా! రాఘవా!

# సహస్ర కంఠ చరిత్ర

కం. శ్రీధర్మవిగ్రహా ! స
ద్బోధానందస్వరూప ! బుధజన హృత్సం
చారాశ్రిత పదపంకేరుహా !
నాశ్రిత సత్యప్రతిజ్ఞ ! జయజయ రామా ! 1

వ. ఓయీ ! భరద్వాజా ! సీతామహాసాధ్వి ముఖ్యుల
నుద్దేశించి, శ్రీరామచంద్రుండును వచ్చెరువు పడిన వచిం
చిన సహస్రకంఠ రావణచరితంబు నాలింపుమని ప్రాచేత
సుం డిట్లని చెప్పందొడంగె. 2

ఉ. మానవరేణ్యులార ! మును మ
త్పితృసన్నిధిఁ గన్యనయ్యు, నే
జ్ఞానముగల్గి వర్తిలిన కాల
మునం దొక బ్రాహ్మణుండు స
న్మానముతోడ మజ్జనకమం
దిరమందుఁ బ్రవేశమంది, ప్ర
జ్ఞానిధియా ప్రభుం గనుచు
"స్వస్తి! జయోఽస్త్వని" యిట్లువాకొనెన్. 3

•. సీతో నీగృహమందెయుండి కడుమ
న్నింపంగ నేని త్తఱిన్
జాతుర్మాస్యము దీక్షతో నెఱపఁగా
సంకల్పముఁ జేసి, యీా
రీతిన్ వచ్చితి; నన్నుఁగొల్వఁదగువారిన్
కూర్చి పోషింపుమా !
యాతిథ్యంబు గ్రహింపఁగాఁ దగిన క
ర్మార్హుండ నేవిప్రుఁడన్ 4

అనినన్ మజ్జనకుండు వల్లెయని బ్రహ్మా
నందముంబొంది, చున్
నను వీక్షించి మృమాక్తులన్ బిలిచి, చెం
తన్ జేర "నీయోగివ
ర్యునకున్ నాలుగు మాసముల్ విడువక
త్యుత్సాహివై సేవలన్
దనుపంగావలె నీ"వటంచుఁ బలుకన్
సంతోషభావంబునన్. 5

గీ. అతిథి బ్రాహ్మణుఁ డాపైని యఖిలవేద
శాస్త్రపారగుఁడేగాక, సర్వతీర్థ
సేవి, యగువాని సేవలుసేయఁగ నగు
భాగ్య మబ్బునె ? యెంతటి వారికైన. 6

వ. అని భావించి జనకు నాజ్ఞ శిరసావహించి యమ్మహా
ముని నే నానాఁడు సేవించుచున్న యవసరంబున 7

శా. ఆవిప్రుఁడును సర్వతీర్థమహామా
వ్యాపారముల్ నాకు నెం
తో వాత్సల్యము మీఱఁ జెప్పుచు నెసం
తోషాత్ముఁడై నాకు సే
వానైశిత్యమునన్ బ్రసన్నుఁడయి వి
శ్వాసంబు సంధిల్ల, నా
ధీవన్యాం శిప్రుడున్ గల్గి చరితన్
తెల్పంగ నాలించితిన్. 8

కం ఆవిధి నాఁడతఁడు మదీ
యావాసమునందుఁ జెప్పినట్టి చరిత్రన్
నేవివరింతు యథాతథ
మై వెలయఁగ, సావధానులై వినుఁడయ్యా! 9

వ అని వలికి మఱియు నమ్మునీశ్వరులంగాంచి సీత
యిట్లనియె 10

మ. కరుణోదాత్తుఁడు బ్రాహ్మణోత్తముఁ డుషః
కాలంబునన్ లేచి, స
త్వరకాలోచిత కృత్యముల్ నెఱపి, సీతా!
యంచు నన్‌బిల్చి సా
దరభావంబున "నొక్కగాథ వినుమా!
తత్సర్వమున్ నేను సు
స్థిరతన్ నాకనులారఁ జూచినది భాషిం
తున్ విచిత్రంబుగున్ 11

వ. అని మఱియు నాబ్రాహ్మణోత్తముం డిట్లనియె. 12

మ. దధిమండోదక నామకంబగు సము
ద్రంబొప్పదే, యమ్మహో
దధి దాటంగనె స్వాదునీరమను సం
ద్రంబొప్పు; నామధ్యలో
విధిచే నిర్మితమైన పుష్కరమునా
ద్వీపంబు వెల్గొందు; న
త్యధికాగ్ని జ్వలితోదయం బదియు; నం
దాశ్చర్య మాలింపుమా ! 13

సీ. వేయిపత్రంబుల వెలుఁగుచు బ్రహ్మస
నంబౌచు నలరుఁ బద్మంబొకండు
ప్రథిత తద్ద్వీపవర్షముల మధ్యను బది
వేలయోజనముల వెడలుపుఁ, బొడ
వును బదివేలయోజనములు గలఁమాన
సోత్తరపర్వత' ముండె, దాని
దిక్కుల నాల్గింట దేవేంద్రముఖ దేవ
తలపట్టణంబులు గలవు, 'విశ్వ

తే. గీ. కర్మ' యవ్వాని నిర్మించె ఘనతమీఱ
మఱియు నాద్వీపమందు సుమాలియనెడు
రాక్షసోత్తముఁ డుండె నప్రతిమతేజుఁ
డతనికొక 'కైకసీ'నామ్ని సుతయుఁ గలదు.

కం. తన కూతును 'విశ్రవసుం'
డను బ్రహ్మకొసంగి పెండ్లి యాలుగాఁ జేయింపన్

జనియించిరి యాజంటకుఁ
దనయు లిరువురౌచు దుష్టదర్పోద్ధతులై. 15

ఉ. ఆసుతులందు నొక్కఁడు స
హస్రముఖంబులు రెండువేలబా
హాసమితిం గలాఁడును, ద
శానన వింశతిబాహుసంతతీ
భాసుఁ డొకండు. నిర్వురును,
బ్రాకృతబాహుబలాఢ్యులై జగ
త్త్రాసకులౌట వారలను
రావణులంచు వచింతు రెల్లరున్. 16

కం. వారలలో దశకంఠుఁడు
క్రూరుండై పరమ శివునిగొల్చియు నాకౌ
బేరస్వత్వము లంకను
వీరుండై కొనియె లోకవిద్రావణుఁడై. 17

చ. మఱియు సహస్రకంఠుఁడు న
మానుష నీచపిశాచ కర్ముఁ డే
త్తెఱ నటుపుష్కరాఖ్యమగు
ద్వీపము నాక్రమణంబొనర్చి. య
త్తఱి నినచంద్రులన్ గదిసి.
తానరచేతుల బంతులాడుచున్
గిఱగిఱఁ ద్రిప్పుచుండియు వి
కీర్ణతఁ గొల్పుచునుండుఁ జండతన్. 18

మ. అరయన్ శ్రీయుతమానసోత్తర నగం
బందున్న యప్పట్టణా
ల, రయంబొప్పఁగ నాక్రమించి యవ
లీలన్ దేవరాజేంద్రు సు
స్థిరహా వయ్యమరావతిన్ స్వయముగా
దీపించిభోగించి, యె
ల్లరుమంత్రుల్ నివసింపఁజేసెనట
హేలన్ మూఁడు పట్నంబులన్ 19

ఉ ఆ యమరావతీపురికి
నారయ లోకములోన నెందు నే
చాయను నేపురంబయిన
నాటికిరాదుగదమ్మ ! దాని శో
భాయతదివ్యసంపద
లహా ! మనసార గ్రహింపవచ్చు, ని
శ్లేయని మాటలన్ దెలుపు
టెంకిరొయొకండుగలండె ? జానకీ ! 20

వ. అయినను నా యెఱింగినకొలంది గొఁ జెప్పెద
నాకర్ణింపుము ! 21

సీ. పారిజాతములు చంపకము లశోకముల్
రంభా ప్రియంగువుల్ ప్రథితసాల
చూతాది నానావిధాతతవృక్షముల్
గల వాటికోద్యానములను, నవియు

సర్వకాలంబుల సర్వర్తుధర్మంబు
లను గల్గి నిత్యనూతనములలర
ఫలభారనమిత శాఖలుగల్గి ఘనసుమ
సురభిళవాయు సంశోభితంబు
తే. గీ. నగుచు నమరావతీపురమలరు; నందుఁ
దనరు నుద్యానవనవిచిత్రప్రశస్తిఁ
జూడ మిగుమిట్లుగొలుపు, నాజూకు లెల్లఁ
బ్రోగువడి నిలచెనందె, పూబోడిమిన్న! 22

చ. అరయ సహస్రకంఠుఁకు వి
హారమొనర్చెడు నవ్వనంబులన్
గురుతరవృక్షరాజములు
గొన్ని సువర్ణమయంబు, లెంతయున్
భరమగు నగ్ని తేజముల
వర్తిలుఁగొన్ని, సితేతరాంజనో
త్కర నిభవర్ణసంపదలఁ
గ్రాలుచు నున్నవి కొన్నివృక్షముల్ 23

సీ. వెలలేనిమణులచే వెలయింపఁజేసిన
సోపానపంక్తులు శోభిలంగ
బాగుగావికసించు బంగారుపద్మకాం
తుల తళత్తళలు దిక్కులనుబర్వ
భరతమ్ములును జక్రవాకమ్ములాదిగాఁ
గల జలపక్షులు గలసియాడఁ
బ్రాంతస్థలంబుల పచ్చికపట్లలో
వైడూర్యములకాంతి వర్ధిలంగ

తే. గీ. నానసహస్రాస్య విహరణోద్యానవనము
లందుఁగల దిగుడుంబావు లమితమధుర
నీరములనిండి నిత్యావినిర్మలంబు
లగుచు నొప్పారు నమృతంబు నానినట్లు. 24

ఉ. నందనమందపూర్వము లనం
బడు వృక్షవితానమంతయున్
మందిరమందుఁ, బెక్కులగు మా
న్యగిరీంద్రములందు శ్రేష్ఠమై
యందముచిందు పాదపముల
న్నియు, నాతని కేళికావనిన్
బొందుగ సందడింగలిగి పా
ల్పువహించి రహించిమించెడిన్. 25

ఉ. ఆపురమందు మేడలు మ
హాత్తరచిత్రవిచిత్రశిల్పవి
ద్యాపటిమన్ రచింపఁబడి,
యద్భుతమై తగు మెట్లుగల్గియున్
దీపములై యునుండు, శశి,
దీప్తులతోడ సహర్నిశంబులన్
దోపఁగ, భర్మరత్నమయ
తోరణపంక్తుల నొప్పు నెప్పుడున్. 26

ఉ. ఆపురమందు గల్గిన
మహావిభవంబులు భోగభాగ్య ని
క్షేపము లాదిగాఁగలుగు
సృష్టివిచిత్రములెల్లఁ గాంచి, యా

లోపముగాఁ బెపఃకృతి ప
టుత్వముఁజూపి; తదద్భుతార్థముల్
వ్రాపనరించుకొంటకుఁ గొం
బు యతింతురు దేవదానవుల్, 27

ఉ. రెండియు నాసహస్రముఖ
వీకుఁడు లోకములెల్లఁ దానె, యు
ద్దండత జండశాసనవి
ధంబులసేలుచు, హుంకరించి, యా
ఖండలముఖ్య దిక్పతులఁ
గాఱియపెట్టుచు నాత్మదేహమం
దుండఁగఁ జేసె వారలను,
నోర్వఁగఁ, జాలని బంధనంబులన్. 28

కం. కానఁగ బాల్యక్రీడల
లోనే, మేరువును జిన్నలొంపఁగ, వార్థిన్
జానెడు పొడవుఁగ; జగములుఁ
బూనన్ గుప్పెడు గఁదలఁచు మూర్ఖోద్ధతుఁడై. 29

కం. ద్వీపములు మట్టిపెళ్ళలు
నై పరగును వానిదృష్టి, నటులోకములన్
వేపుకొని తినుచు, బాధా
వ్యాపకుఁడై, లక్ష్యహీనుఁడై వర్తించున్. 30

ఉ. ఆవిధిరావణుండు సక
లార్థములన్ భువనంబులెల్ల, బా
ధావికలంబులై పరఁగు
ధర్షణఁజూపుచునుండ, బ్రహ్మ తా
నేవమొుగిల్గి విశ్రవసు
నింటికిఁబిల్చి తదీయపుత్త్రిబా
ధావహలోకకంటకత
నంతయుఁజెప్పె సవిస్తరంబుగన్ 31

తే. గీ. బ్రహ్మవెండియు విశ్రవోబ్రహ్మఁజూచి
నీకుమారుసహస్రాస్యు నీచబలుని
నాజ్ఞ వెట్టుము ! లేకున్న నతనినడఁతుఁ
జెప్పుచుంటిని ముందుగాఁ జింతవడకు. 32

కం. అనవిని యాతఁడు బ్ర
హ్మను గని వినయమునఁ బ్రణుతులర్పించి కరో
రనియతిఁ బుత్త్రుని శాసిం
చెను, మానగవాఁడు నీచేష్టల నెల్లన్. 33

ఉ. ఓమునివర్యులార ! మఱియున్
ధరణీసురుఁ డావిధంబుగాఁ
బ్రేముడి నన్నుఁ జూచి, కడు
వింతలుగాఁగ సహస్రకంరఘో
రామితదుష్టచర్యల, న
నంతములంచు వచించికొన్ని, న
న్నోమి శుభాశిషంబులిడి
యుత్సుకతేన్ జనెఁ దీర్థయాత్రకున్ 34

**అజితప్రతాప వృత్తములు :— (స్వస్థానార్ధసమజాతి)**

రజనిచరావళికిఁ బ్రాణాపాయం
బు, జనియింప, ధరఁ బుణ్యశీలు రా
సుజనావళీహృదయ సుందరభా
వ జయమందఁ గనుపట్టు రామువా ! 35



# యుద్ధయాత్ర

కం. శ్రీ సీతాదేవీ హృ
ద్భాసిత పాదారవింద ! భక్తానందా !
దాసజనపోష ! పరమా
త్మా ! సర్వజగన్నివాస ! దశరథరామా ! 1

వ. ఓ భరద్వాజా ! సీతాదేవి యమ్మునివరులఁ గాంచి
మఱియు నిట్లనియె, వినుము ! 2

శా. ఆనాఁడా ధరణీసురుం డటు
సహస్రాస్యుండు నౌ రావణున్
దానై చూచినలోకకంటకుని
చిత్రంబైనవృత్తాంత మెం
తేనిన్ జెప్పఁగవింటి, నయ్యదియె
నా కేవేళ నాశ్చర్యమై
గావంగాఁబడుఁ జిత్తముం
దహితమై క్షుంతవ్యతాహీనమై. 3

ఉ. రాముఁడు నానిమిత్తముయి,
ప్రాజ్ఞులు వీరవిహారులై యశః
కాములై కృతజ్ఞతను
గల్గిన సూర్యసుతుండు నంగదుం

డామహితాత్ముఁడైన యని
                    లాత్మజుఁ డంతటిజాంబవంతుఁ డి
భూమినిగల్గు ఋక్ష వారి
                    పుంగవులెల్లరుఁ దన్ను గొల్వఁగాన్ 4

ఉ. వారిధిఁ గట్టి, వీరవర
                    వానరసైన్యముతోడ లంకకున్
జేరఁడె! రావణాసురు న
                    నేకబలాన్వ్య సమాత్యపుత్రమి
త్రారభటీసమేతు నటు
                    లంత మొనర్చి, మునీంద్రదేవతో
ద్ధారణఁ జేసి ధర్మమును
                    స్థాపనముం బొనరించి మించుటల్. 5

శా. లోకాతీతమె యయ్యె; నామ
                    తికి నాలోకింప నాశ్చర్యమే
మో కాన్పింపదు, నా మనోహరుఁడు
                    మున్ముం దాసహస్రాస్యునిన్
వీఁకన్ నాశ మొనర్పఁ జేయ నదియే
                    విశ్వంబునన్ దివ్యకీ
ర్త్యాకారంబయి సుస్థిరంబగును,
                    వహ్వాయంచు మోదింపఁగన్. 6

తే. గీ. అమ్మహారాక్షసుండౌ సహస్రకంఠుఁ
జంపి లోకమ్ములెల్ల నిష్కంటకముగఁ
జలుపునందాక ధర్మసంస్థాపనమున
రామునకుఁ బూర్ణతావాప్తిలేమి నిజము. 7

కం. ఇదియె నిమిత్తంబుగ నా
యెద నొదవిన భావసరణి నిటునవ్వితి, నో
సదయాత్ములు మునులారా!
మదినెఱిఁగి క్షమింపుడీ! నమస్కృతు లివియే. 8

ఉ. జానకిమాటలన్ వినిన
సన్ముని సంఘము విస్తుపోయి, య
మ్మానిని నెంతయుం బొగడి
మానక దీవనలిచ్చి యుబ్బె, భూ
జాని రఘూద్వహుండును య
శఃపరిపూర్ణపరాక్రమంబునన్
బూనికఁ బ్రోత్సహించె నను
భూమిజ; యంచుఁ దలంచి నెవ్వడిన్, 9

తే. గీ. సింహనాదమొనర్చె నృసింహమూర్తి
భూనభోంతరములునిండ, భూజనంబు
యుద్ధసంసిద్ధమైయుండ హుంకరించె
మునులఁ బ్రార్థించెఁ దనను దామనుసరింప. 10

వ. మఱియు నా శ్రీరామచంద్రుఁ డెల్లవారలం జూచి
యిట్లనియె, 11

సీ. వరసహోదరులైన భరతుఁడు లక్ష్మణ
శత్రుఘ్నులును రండు సరసనిలుఁడు
సుమిత్రవరులు సుగ్రీవవిభీషణుల్
రండు మీమీసేన లండనిలువ

నారాజ్యమునఁగల్గు వీరాధివీరులె
ల్లరు సాయుధులు సౌచురండు వేగ
నాయంతరాత్మయౌ వాయుసూనుఁడు జాంబ
వంతుండు రండు! మీబలముసూప

తే. గీ. రండురండయ్య! నాయందు నిండుమనము
వొదలువారెల్ల రుత్సాహపూర్ణమతులు
పుష్కరద్వీపయుద్ధంబు పొసఁగె మనకు
జగము లన్నియు జయవెట్ట జయముగనుఁడు! 12

తే గీ. జానకి! నాకు నర్ధాంగినైన నీవె
యింతకును గారణంబవై హితముదెలిపి
నావు గావున నీవును రావలె, నను
వీడకుము యుద్ధమునఁ బర్యవేక్షకివయి. 13

కం. అని రాముఁడువలికినఁ ద
జ్జనులెల్లరెగాక పురుషసంతతు లెందెం
దునఁగలవారును సంతస
మున లేచిరి యుద్ధయాత్ర పొంపిరివోవన్. 14

శా. రామాజ్ఞన్ శిరసావహించి పరివా
రంబెల్ల సోత్సాహులై
భూమిన్నిండి చరింపఁ, బుష్పకముపైఁ
బోనెంచి, యద్దాని శ్రీ

రాముం డాత్మఁదలంచినంత నదియున్
ప్రత్యక్షమై నిల్వఁగా
నామహానీంద్రులు దాను జానకియు నం
దారోహులై రిమ్ములన్. 15

ఉ. తమ్ములు వానరోత్తములు
దానవవీరులు నాత్మసైన్యముల్
ముమ్మరమౌచు మూఁగినను,
ముందుగ నాహనుమంతుఁజేరి, యం
దమ్ముగ నెల్లవారి నభి
ధానములన్ బిలువంగ, నందఱున్
గిమ్మనకుండ నెక్కిరి సు
నిశ్చలపుష్పకదివ్యధామమున్. 16

తే. గీ. క్రూరశాత్రుససంఘ విదారణమున
దీక్షితంబైన రాముని ధీరహృదయ
వీరరస సముద్దీపక విజయగేయ
ములనుబాడిరి వీరవరులు ఘనముగ. 17

ఉ. అంతట వీరమూర్తియగు
నారఘురాముఁడు సింహనాదమున్
బంతమువీఱఁ జేయ నది
పర్వె దిగంతములంటి, వెండియు

భ్యంతరమేమిలేక చనుమా!
యింకఁ బుష్పకయాన! పుష్కరా
త్యంతసమీపదేశమున"
కంచు వచించెఁ దక్షణంబునన్. 18

తే గీ అనిలవేగ మనోవేగమైన దివ్య
పుష్పకము రెప్పపాటులోఁ బుష్కరమును
దీవిఁ జేరెను, దాని ప్రభావ మరసి
యెల్లరాశ్చర్యచకితులై రుల్లములను. 19

ఉ తమ్ములు సేనలున్ మునులు,
దాశరథిన్ బరివేష్టులై నిలన్
గమ్మన సింహనాదము
నొనర్చె నతండు మహోగ్రవైఖరిన్
హుమ్మని విల్లునెక్కిడి
మహోద్ధతి నారినిమీట, నాధ్వనుల్
గ్రమ్మను భూనభోంతర
జగంబది దద్దరిలంగ నెల్లెడన్ 20

సీ. ఆగుణాష్టంకారమాలించి రావణుఁ
డదటునలేచె. నేమిది ? యటంచు
రాక్షసానీక ముగ్రతఁబూని రావణుఁ
జేరి యాతని యాజ్ఞఁ గోరినారు
"నాభూమి నెవఁడురా యాభీలముగ నారి
మ్రోగించె?"నని మహాక్రోధియగుచుఁ
'దరలుఁడు నాతోడ దానవులార! య
టంచు వేయిముఖాల నరయుచుఁజని.

తే. గీ. ద్వాదశాదిత్య తేజఃప్రభాకలితుఁడు
రాక్షసుఁ డనంతబలుఁడయి, తక్షణంబె
పురబహిర్ద్వారదేశంబు నరిగి, పంక్తి
పటపటఁగొఱికె లోకముల్ గటకటఁబడ. 21

కం. ద్విసహస్రభుజంబుల, వా
ని సమానమైన సంఖ్య నేత్రమ్ముల, మే
ఘసమ భయంకరగర్జల
నసదృశబడబాగ్నియనఁగ నారావణుఁడున్. 22

సీ. సవితృతేజముగల్గి శతయోజనంబులు
నడ్డుకొలతఁగల్గి నట్టిరథము
పరిఘమ్ము ప్రాసమ్ము పరశువు తోమర
మ్ములు భుసుండులు చక్రములును ముద్గ
రములు ఘంటాలోహగములుఁ బాశమ్ములు
వివిధధనుర్వార వితతియెల్ల
నిండియుండినదానిఁ జండతరాగ్రహో
దగ్రవీక్షణముల దానవుండు

తే. గీ. రివిగానెక్కి నిలచి, పిరావభాస
మాన సర్వేంద్రియోత్క్షుఁడై నవాఁడు
తరలి శ్రీరాముఁడున్న యాస్థలముఁ జేర
బోవుచుండియు లోనోనఁ బొక్కుచుండె. 23

ఉ. ఎవ్వఁడువీఁడు? నాపురిని
నిష్ఠ్రభయంకర సింహనాదముల్
దవ్వులఁ జేయుచున్ నెఱపె
దర్పము శత్రుపురాకుఁ గన్నచే!
యివ్విధనాదకీర్తి కొకయిం
త కళంకముగల్గెఁగాక. నన్
జివ్వకుఁ బిల్వఁగాఁదగిన
జివ్వుఁ డెవండు జగత్త్రయంబునన్ 24

కం. దేవేంద్రాది దిశాపతు
లేవిధి నను గెలువలేక నిట నూడిగముల్
గావింతురు జీవింతురు
పోవరు ననువీడి యాజ్ఞపొందెడుదాకన్. 25

సీ. పాతాళలోకంబు స్వర్గంబుగాఁ జేసి
స్వర్గంబుఁ బాతాళసమ మొనర్తు
నరలోకమును నేను సురలోకము నొనర్తు
స్వర్గంబు నరలోక సమమొనర్తు
మేరునగంబాది మేలైన శిఖరుల
నణువులుగాఁ దల్తు నంతఁబోక
పిండిగా నవ్వానిఁ జెందుదు; భూమండ
లంబెల్లఁ బెల్లగిలంగఁ జేసి

తే. గీ. కోటికోనల ననంతుని మీఁటినైతు
విధియొకప్పుడు నాతండ్రిఁ బిలువనంపి

తన్ముఖంబున హింసలుఁ దక్కుమనుచు
నన్ను నోడఁబడఁజేయ నిట్లున్నవాఁడ. 26

తే గీ అటులెగాకున్న మొనమొన్న నావిధమున
రావణుని జంపినట్టి శ్రీరామునపుడె
యమపురికిఁ బంపకుండునే! యఖిలలోక
నాశ మొనరింపకుండునే! నాఁడె కినిసి. 27

శా. ఇంద్రత్వంబు బలాహకత్వమును
నేనే పూనఁగాలేనె! మ
త్సాంద్రపరిజ్ఞను వహ్నిభావము యమ
త్వంబున్ గుబేరత్వమున్
జంద్రత్వంబు నినత్వమున్ గలిగి,
విశ్వంబెల్లఁ బాలింపనే?
తంద్రత్వంబు నొకింతలేక, యనుచున్
దర్పోద్ధతిన్ వ్యగ్రుఁడై. 28

ఉ అంతములేని కోపమున
నన్నిజగంబుల నొక్కమారుగాఁ
బంతముమీర గ్రమింగఁదగు
పౌరుషమొప్పఁగ సింహనాదమున్
వింతఁగఁజేసి ధర్మపథ
వీరుఁడు రాముఁడు నిల్చినట్టి యా
ప్రాంతముఁ జేరఁగా నరిగె,
రావణుఁ డవ్విధి వీరమూర్తియై. 29

కం. నానాయుధపాణులు దమ
సేనలు వివిధములు దమ్ము సేవింపంగా
సేనానాయకులు సహ
స్రానను వెనువెంట వెడలి రగణితసంఖ్యన్. 30

వ. అని యివ్విధంబునఁ జెప్పుచు నవ్వాల్మీకియు భరద్వాజుంగాంచి, యా రావణచమూపతుల సహస్రాధికులగు వారి నామధేయంబులెల్లను జెప్పంబూనుట వ్యర్థంబని యెంచి సంగ్రహంబుగా నిట్లువివచింపం దొడంగె. ఓ భరద్వాజా! వినుము! కోటీశ్వరుఁడు మనఃపూర్ణుఁడు పాలుఁడు హాలీముఖుఁడు పిచ్చలుఁడు మున్నగు నామంబులు గల సేనాపతు లసంఖ్యులుసుమా! ఇంక వారి యాకారవిశేషంబులఁ గొంతవరకును వచించెద నాలింపుము! వారందఱును శ్వేతరక్తనీల వర్ణంబులుగలవారు భీకరాకారులై పర్వతశిఖరంబులంబోలి యున్నతదేహులై కామరూపబల సంపన్నులై గదా పట్టిస శూలాద్యనేకాయుధధారులై నానావిధ విభూషావిశేషభూషితులై యుండిరి. అట్టివారి క్రూరవికారాకారానుకూల్యంబులై వారివారి నామధేయంబులుం గలవు గాని, వాని నెల్ల వాకొనుట నిరర్థకంబు. అంతటి సేనానాయకులెల్లరును దమతమ సైన్యసమూహంబులతో నా సహస్రకంఠుని సేవించుచు.

ఉ. రావణు వెంటవచ్చుచుఁ బరస్పరవీరవిలాసభాసులై
యావిధి సేనలెల్లఁ బరమాద్భుతచర్యల భీకరాకృతుల్

చేవలుమీఱ రాముఁడు వసించినచోటికిఁ బోవుచున్ రణో
జ్జ్వితులాట వారవ్రుకు సేసిరహంకృతి సింహనాదముల్

తే. గీ. వినుఁ భరద్వాజమునివర్య! విస్తరింప
నలవిగాని సహస్రాస్యు నాత్మసుతులు
బాహువీర్యమదోద్ధతిఁ బరగువారు
వివిధ శస్త్రాస్త్రములఁ దండ్రి వెంటఁ గలరు. 33

వ. వారి నామధేయాదులను సంగ్రహింతు నాలింపుము!
కాలకంఠుఁడు ప్రభాసుండు కుంభాండకుఁడు కాలకక్షుఁడు
మున్నగు వారేబదిమందియు నొకరికొకరు దీసిపోని పరా
క్రమంబుగలవారై, జనకుండైన యాసహస్రకంఠున కత్యంత
ప్రమోదంబుగా భుజాస్ఫాలనసింహనాదాది కఠోరధ్వానం
బుల దశదిశలం బూరించుచున్నవారై యాతని వెంటం
దరలిరి 34

ఆ. వె. ఆసహస్రకంఠు నాత్మజులం దొక్క
రొక్కరికిని వేలనొప్పు నర్బు
దములసంఖ్య సైన్యగమి గలదది యనే
కాకృతుల ననేకనాయుధముల. 35

వ. మఱియు నో భరద్వాజా! కూర్మకుక్కుట సర్ప
జృంభగ గోమాయు శశిదివాంధాది ముఖంబులంబోలు
ముఖంబులు గలవారును, మహోజరర పాదాంగులులును, స్తబ
కాక్షులును, కోకిలసదృశ దేహచ్ఛాయఁ గలవారును, విర
ఖసటములైన వస్త్రధారులును, వమ దాశీవిషులును, వనంబడు

నీ మొదలైనవారు, కర్కశ వికారాకారాభరణాయుధములన్ ధరించియుండిరి. ఇంకను వారి స్వరూపస్వభావములను వివరింప నేవగింపు జనించు. అట్టి రావణసుతసేనా సమూహంబు లొకవంక నమితసంఖ్యలో బయల్వెడలిరి.

శా. ఆసైన్యంబునఁ గొండచుప్పాడు శిరీ
రాచ్ఛాదితానేక మం
టాసోన్మాదరవంబు లెల్లదిశలం
టన్ నృత్యముల్ సేయఁగా
నాసైన్యాధిపతుల్ మహోత్కటి నవా
క్యంబుల్ ప్రలాపింపుచున్
శ్రీసీతాపతిఁ జేరి నిల్చిరి, నట
జ్జీమూతసంఘాకృతుల్. 37

గజవిలసితము —

భానుకులాగ్రణ్య! వర మునివినుత! సతీ
జానకి నిన్నుఁగొల్వ జయమువలుకు హనుమ
ద్గానమునందుఁ గల్గు తరళమృదులరస మీ
వానుచు నాపయిన్ దయను, దరిసెన మిడుమా! 38

# యుద్ధారంభము

కం. శ్రీవాణీ కాత్యాయను
లావై దేహిగ హరివిధిహర దివ్యాత్మల్
నీవై వెలయరె ! రామ ! సు
ధీవరహృద్ధామ ! ధర్మ తేజస్తోమా !

తే. గీ. విను భరద్వాజ ! యపుడు రావణుఁడు తనదు
రెండువేల కరమ్ములఁ గ్రీడసలుపు
నాయుధమ్ములతో రామునరసి తలఁచె
నెవ్వఁడుకో ? యెందులకు వైరమితని ? కనుచు. 2

వ. అట్లు యోచించు సహస్రకంఠునకు సమాధానంబుగా నశరీరవాణి యిట్లనియె. 3

మత్త. వీరవర్య ! సహస్రకంఠ ! వివేకివై విను, మీతఁడా
శ్రీరఘూద్వహుఁడైన రాముఁడు, సిద్ధధర్ముఁడయోధ్యకున్
ధీరుఁడౌ జనపాలుఁ డీతని దేవిసీతను రావణుం
డారహిన్ గొనిపోవ వానికి నంతకుం డితఁడెంతయున్. 4

శా. దేవబ్రాహ్మణ గోసమాజముల
బాధింపంగ నుత్సాహులౌ
నీవంశీయుల రాక్షసప్రముఖులన్
ఛేదించి యున్నాఁడు. నీ

[illegible]ప్రన్ [illegible]
దీపన్ బాణాసనం, దహో
ధ్యానాసం [illegible]
[illegible] 5

తే. గీ. సోదరులఁగాడి సు[illegible]
వానరులు, వి[illegible]షణుఁడు [illegible] దానవులును
జాంబవంతాది భల్లూకసమితి, మనుజ
బలము, వెంటరా నిను జంపవచ్చినాఁడు 6

కం. అశరీరవాణి యవ్విధి
విశదంబుగఁ బలికినంత విని, రావణుఁడున్
దశదిశలఁజూచి, కోపా
గ్నిశతంబులఁ గురిసి యనియెఁ గ్రొవ్వునఁ దేఁకన్ 7

మ. ఎవఁడో రాఘవుఁడంట! చంపెనట! దా
ర్వ్రాత్రిన్ మదీయానుజున్
వివరింపన్ బనియేమి? కుబ్జునొకనిన్
వేయంగ విరాధి వి
రవరుండౌనె? యదృశ్యవాణి కొకయ
ర్థంబుండునే? దీనికేఁ
బవరంబున్ విడనాడు వాఁడనని
తాభావించెఁబో! వెఱ్ఱియై. 8

శా. ఈవిశ్వంబున నెల్లవారలను నే
నేడ్పించుచున్నాను, న
న్నేవాఁడున్ గనులెత్తి చూడఁగలఁడే ?
యీదుర్బలుం డెవ్వఁడో ?
దావాగ్నింబడు దూదిప్రోవుకరణిన్
దండెత్తుచున్నాఁడు, ని
ర్జీవున్ జేయుదు ! రాముఁడీతఁడట !
యిస్సీ ! వీనితో యుద్ధమా ? 9

ఉ. మానవమాత్రుఁ డీతఁడట,
మాకుసమానుఁడె ? దేవదానవా
మ్లాన పరాక్రమోద్ధతులె,
మాపరివస్య లొనర్చుచుంద్రు, నా
తోనిటుపోరి యీల్గుట యెదో
ఘనకీర్తిఁగఁదల్పుఁబోలుఁ, బ్ర
జ్ఞానిధినెల్లరుంబొగడఁగా
నటుగారనుధూర్తుకైవడిన్. 10

తే. గీ. అనుచు వాహిని కొకవంక నాజ్ఞనిచ్చి
బాణతోమరచక్ర పర్వతములాది
యాయుధమ్ముల మూకఁగా నట్టైవిసరి
పుష్పకమునేసె రాముని పాడవడంప 11

కం. కేవలము దివ్యశక్తుల
తో వరలెడు నట్టిదాటఁ దోరపుశక్తిన్

రావణు నాయుధసమితికిఁ
గావరము నణంచెఁ బుష్పకవిమానంబున్. 12

చ అతని చమూసమూహము
లహంకృతిఁ గ్రమ్మ మా కుఁగానకే
తిలము వద్దరిల్ల, నటు
కోతుల మానవేశ్వరుల్లలన్
హాని మొనరింప, భీకర
తరాయుధ కోట్లు ధరించి రైవనన్
సతమతమైన రాఘవుని
సైన్యము ధీరతఁ బూని నిల్చియున్. 13

ఉ కొందఱు మల్లయుద్ధములఁ
గొందఱు తోమరఖడ్గధారలన్
గొందఱు భిండివాలములఁ
గొందఱు పర్వతవృక్షసంతతులన్
గొందఱుబాణవర్షములఁ
గోట్లకొలందిగ రెండుసైన్యముల్
దండడిగా నొనర్చెఁ దుము
లంబగుయుద్ధము నద్భుతంబుగన్. 14

సీ. అంతట శ్రీరాముఁ డాభరతుఁడు లక్ష్మ
ణుఁడును శత్రుఘ్నుఁడున్ భూరిబలులు
వానరపతి, జాంబవంతుడు, నలుఁడు నీ
లుఁడు దోటి వానరులును విభీష

ణాది రాక్షసులును నానరబలసంఘ
మెంతయుఁగూడి యనంతశక్తి
సంపన్నులై బాణజాలంబు గదలును
బరిఘంబులును భిండివాలములును

తే. మెఱుఁగుగాఁగల యాయుధములను శిలల
వృక్షపర్వతపంక్తుల వేగఁ దాల్చి
నా తివ్రల నెంతమాత్రము సరకుగొనక
నిల్చి ఘంటాడి యుద్ధముచేసినారు 15

ఉ. రావణసైన్యసంపదలు
క్రౌర్యముమీఱ మహోగ్రహాస వి
స్రావభయంకరాయుధ ప
రంపరలన్ గలవారు, రామసై
న్యావరిణంబు సొచ్చియు భ
యంకరరీతుల బోరుసల్పె, నా
దేవగణంబు పంక్తులను
దీర్చి కనుంగొన నాకసంబునన్. 16

వ. మఱియు నాసమయంబున ధానుష్కులు ధానుష్కులతో యుద్ధంబొనర్పఁ దక్కుంగలబలంబులెల్ల సంకుల సమరంబు గావించి రట్టియెడం దుత్తునియలైన రథంబులును దొండంబులందెగిన యేనుంగులును దెగవేయంబడిన పాదంబులుగల గుఱ్ఱంబులును గరచరణశిరోభాగంబులు వేర్వేరం జేయంబడి యమ్మహాహవార్ణవంబున ఝషనక్రాది జలజంతువులుంబలె నట్టనిట్టుంగొట్టుమిట్టాడు కాల్బలావయవం

బులునుం గలిగి. హాలిశేషంబైన యుభయసైన్యంబులును, "రండు! పట్టుండు! కొట్టుండు! పిఱికిపందలైరి వెన్నుజూపకుండు! విజయలక్ష్మి మనలనే వరించినది ' యను నీమొదలగు వీరాలాపంబులం గావింపుచు యుద్ధంబుల నొనరించుచుండిరి క్షతగాత్రులు హా! హా! కారంబులతోఁ గొందఱు పరుఁగులిడుచుఁ గొందఱు ప్రాణంబుల విడుచుచుఁ గొందఱు చావుబ్రతుకులమధ్యంబడి రణభూమిం గొట్టిలుచుం బడి పోవుచుండిరి వెండియుం బర్వతంబులును, శిలలును వృక్షంబులును ఖరనఖరంబులును నాయుధంబులుగాఁ గల వానర వీరాగ్రేసరులెల్లను నొక్కుమ్మడిం బైఁబడి రావణసైన్యంబు నెల్ల నుగ్గుఁగాఁ జేయుచుండిరి. రావణుండును దనచమూ సమూహంబుం బురికొల్పి, రాక్షసమాయలనన్నిఁటు నెఱపొనుచు వివిధాయుధంబులన్ బోనసలుప, అయోధ్యా రాజ్య వీరవర్గంబెల్లఁ బ్రాణంబులం బెగించి, శస్త్రాస్త్ర పాణులై సహస్రకంఠ వాహినిం దునుమాడుచుండ నుభయ సైన్యంబులును నొండొకటి తీసిపోని సమర సముత్సాహముం జూపుచుఁ బోరాడుచుండిరి. 17

ఉ. అంతట వానరప్రముఖు
లందఱు రాక్షససైన్యమందు గు
ర్వాంత దురంతసాహస
కరాళమదంబునఁ జొచ్చి, ముష్టుల

త్యంత మయస్సమాహితములై
తగ గ్రుద్దున కొక్క రాక్షసున్
బంతము మీఱఁ జంపి,
జయనాదములన్ విహరించి రయ్యనిన్ 18

ఉ కొండలు వానసున్ ఖరనఖుల్
పిశితాశనవర్గసంతతిన్
బొందగు దేహచర్మములఁ
బూనిక మీఱఁగ నేకకాలమం
దందముగాఁగఁ జీల్చియు భ
యంకరరక్తమయాహవంబునన్
జిందులు ద్రొక్కి గర్జనలఁ
జేసిరి, విద్రవితారివర్గులై. 19

సీ అరదంబులెల్లను విఱుఁగ వానినిబట్టి
యొండొరుఁజంపుచు నుండువారు
నేనుఁగు తొండంబు లిటునటుద్రిప్పుచుఁ
బరగజంబుల నేలఁబరచువారు
గుఱ్ఱాలకాళ్ళను గుదిగట్టుగాఁబట్టి
గిరగిరం ద్రిప్పి స్రుక్కించువారు
శైలంబులను వృక్షషండంబులంబట్టి
పరశరముల భిన్నపరచువారు

తే. గీ. ధనువులంబట్టి రాక్షసఘనులతోడ
బాణయుద్ధమొనర్చెడు వారు నైన

వానరుల రాక్షసుల నరవరులఁ గూడి
రాఘవేంద్రుండు శత్రువిద్రావియయ్యె. 20

చ. మగతన మొప్పఁజూపియుఁ
ప్రమాదములొంది మహాహవంబునన్
దెగిన స్వమిత్రబంధులను
దిక్కులడించియు ప్రీతచిత్తులై
పొగులుచు రాక్షసప్రక
రముల్ వడిఁ జెట్టనకొక్కపిట్టయై,
బగతుఱ విరగర్జనలఁ
బాఱిరి రోదనలన్ హతాశులై. 21

ఉ, ఆసమయంబునన్ దశర
థాత్మజు రాముని బ్రస్తుతించుచున్
వేసనుదెంచి దేవతలు
నిల్చి విమానములందుఁ బూవులన్
రాసులుగాఁగఁ జల్లిరి,
ఘనంబుగ మౌనులు వేదఘోషలన్
ధీసముదంచితోక్తులను
దీవన లిచ్చిరి, సత్యవాక్కులై. 22

కం భూతగణంబులు దేవ
వ్రాతము మునివరులు మోదభరితహృదయులై
రాతతబలులును రాక్షస
ఘాతుకులగు వారు మడియఁగా, సమరమునన్. 23

పహారణ కలితవృత్తము —

అనుపమ బలమయ్యాది గననగు, ని
న్నని, ఖరిముఖు లయ్యగణితదనుజుల్
గని, యురగడియర్ గటగటఁబడి, చ
చ్చిన యదితలపన్ జెలఁగు, రఘువరా ! 24



# సహస్రాస్యుని చాతుర్యము

కం. శ్రీమదనంత శిలాసిరి
రామజ, యద్యాదిశక్తి మగ్నాకృతిన్యై
ప్రేమించఁ, జిద్విలాసుఁడ
నై, మహిమాన్వితుఁడనైన హరిహరనామా 1

వ. ఓయి భరద్వాజా! ఆసహస్రకంఠరావణు మూలబలం
బెల్ల నశింప నాతండును సక్రోధుండై గావించిన యత్యద్భు
తంబును వచించెద నాలింపుమని ప్రాచేతసమునివరుం
డిట్లనియె 2

ఉ. ప్రాకట కోపఘూర్ణిత వి
భావసుఁడౌచు సహస్రకంఠుఁడున్
పేఁక, రథంబునెక్కి, కను
వేగముమీఱ మహార్ణవంబునన్
భీకరమౌ మహాఝషము
నిల్చి కలంచినరీతి, నేల న
య్యాకసమొందఁగాఁ జరచు
నట్టులఁదోచెఁ బరాక్రమోన్నతిన్. 3

కం. క్షణకాలంబున లోకము
లణగింపఁగఁజాలు శక్తియను నాయుధమున్

రణమూర్ధమునఁ బ్రళయో
ల్బణమున్ గ్రహియించి మించె బలిమిన్ గలిమిన్. 4

వ, అవ్విధంబున సహస్రకంఠుం డానర వానర లంకాధిప సైన్యంబుం జొచ్చి వీక్షించి, యెల్లవారలను హీనసత్వులంగాఁ దలంచి, వీరలం ద్రుంచుటకు క్షణకాలం బధికంబని యెంచి, తనమనంబున నిట్లని తలంచె. 5

కం. నరవానరరాక్షసు లె
ల్లరుఁ బ్రాణాశలను విడచి లంఘించిరి, పు
ష్కర'మను నాద్వీపమునకుఁ
జరమాగ్ని నణంపఁదూలు శలభములగతిన్. 6

తే. గీ, దుర్బలులువీరు, వీరిని దోర్బలంబుఁ
జూపి, చంపినఫలమేమి ? చోద్యమేమి
యెవ్వరెవ్వరు వీర లేయే ప్రదేశ
వాసులై యిట కేరీతి వచ్చినారొ ? 7

ఉ. వారలు వారివారి స్థల
వర్తులుగా నొనరింతు, పండితుల్
వీరులు నీచసైన్యమును
బీఁచమడంచి వధింపఁజూతురే ?
పోరితమేల యంచు ధనువున్
గుణసంగతిఁ జేసి, వాయుమం
త్రారభటిన్ మహాస్త్రమును
నట్టెవిమోచనసేయ, వారలున్. 8

తే గీ. నరులు భరతాదులెల్ల, వానరులు సూర్య
పుత్త్రిఁడాదిగ, రాక్షసపుంగవులు వి
భీషణాదులుఁ, బుష్కరద్వీపయుక్త
భూమి నటుపిడి యెగురుచుఁ బోయినారు. 9

తే గీ చోరులను గళహస్తికన్ జొనిపి, రాజ
భటులు గొనిపోయినట్లు వాయ్వస్త్ర మచటి
వారినెల్లరఁ గొనిపోయి, వారివారి
నివసనంబులఁ జేరఁగా నిలిపి చనియె. 10

ఉ. ఎక్కడివార మిక్కడికి
నెక్కరణిం జనుదెంచినారమో!
యక్కజమయ్యె నంచు, నెవ
రంతటవారలై విస్తుపోయి, రా
ఘక్కని నాంజనేయుఁడును
స్వస్థలమై తగు రామసన్నిధిన్
జక్కగ వ్రాలి నిల్చె నటు
జానకి మోదము మిన్నుముట్టఁగన్. 11

వ. ఇవ్విధంబున భరతాదులెల్లరుం దమతమ నెలవులం జేరి సీతారాముల యునికిం గూర్చి యెఱుంగనివారై, యత్యధిక బాధావిలాంతరంగులై యుండి రట్టియెడఁ బుష్కరద్వీపంబున. 12

శా. వాయవ్యాస్త్రము జానకీరఘువర
స్పర్శంబుఁ దా నేమియుఁ
జేయంజాలకయున్నఁ, బుష్పకముతో
సేమంబుగా వారలా
చాయన్ నిల్చిరి, సిద్ధసాధ్యగణముల్
సన్మౌనిబృందంబు లా
హా! యంచున్ గడువిస్తువోయిరి, వియ
ద్యానంబులున్ నిల్పఁగన్. 13

శా. సీతాసాధ్వి స్మితాననాబ్జయగుచున్
జెన్నొందె, శ్రీరాము సే
నాతండంబు సురక్షితంబగుచు నుం
డంగోరి యాదేవతా
వ్రాతంబున్ మునిబృందముల్ మనములన్
బ్రార్థించి, రారాముఁ ద
త్ప్రాతీతున్; భయవిహ్వలాత్ములయి హా
హాకారముల్ సేయుచున్.

వ. మఱియు నోభరద్వాజా! దేవగంధర్వాదులీ సహస్ర కంఠరావణ పరాక్రమముం దలంచుచుఁ, బూర్వంబున శ్రీ మహావిష్ణువు గరుడవాహనుండై యీ పుష్కరద్వీపంబు నకుం జనుదేర, సీతం డా తనివాహనసహితంబుగా లవణాంబుధిం బడవైచుట యాదిగా నెవ్వారు నీతనికిన్ వెగడువడి, యావంకకుం జనకుండురుగదా! యని తమలోఁ దాము ప్రసంగించుచు వెండియు నిట్లనిరి.

కం. వన మొనరించిన తపములు
ఘనముగఁబండినవి, నేఁడు కరుణామయుఁడై
యని నిలచె దశరథాత్మజుఁ,
డని, యొండొరు చెప్పుకొనిరి యమరగణంబుల్ 6

వళిసీవృత్తము —

అరయన్ గుహునిన్ భరతున్ యతులైన ముని
శ్వరులన్ ఖగరాజవరున్ శబరిన్ గరుణన్
హరినాయకునిన్ బలుఁడౌ హనుమంతుని య
ల్లిరయంగఁదగున్ రఘురామ ననున్ సలుపున్. 17



# శ్రీ రా మ మూ ర్ఛ

కం. శ్రీమచ్ఛంకరకీర్తిత
నామా! బ్రహ్మాదిదేవ వందితధామా!
భీమబలోద్ధత రక్షః
స్తోమ వినాశకవిధాన దోర్బల! రామా! 1

వ. ఓ భరద్వాజా మఱియు వినుము వాల్మీకి మహర్షి
యిట్లని చెప్పందొడంగె 2

ఉ. రావణుఁడంత నల్పునిఁగ
రామునిఁ గాంచుచు, శత్రుసంఘవి
ద్రావణసింహనాదమునఁ
గ్రాలఁగ, శ్రీరఘురాముఁ డట్టి యా
ధవరు చెష్టలన్ గనుచు,
ధిక్కృతి సేసియు, విస్మయాత్ముఁడై
చేవను జూపఁగాఁ దగిన
జెట్టి యితండని యుత్సహించుచున్. 3

శా. రాజీవాక్షుఁడు రామచంద్రుఁడు మహో
గ్రవ్యగ్రకోపాగ్నివి
భ్రాజత్ప్రోద్ధతభీకరాకృతిని
గన్పట్టెన్, ధరాదేవికిన్

దేశంబెంతయు సన్నగిల్లెను, పయోధి
వ్రాత మత్యంతక్షీ
భాజంబౌచు వణంకఁగాఁ దొడఁగె,
శోభల్ దక్కె ఘాతాలకున్. 4

ఉ. అంతటరామచంద్రుఁడు
సహస్రశిరస్కుని గర్జనాదులం
తంతనె నిల్వఁ, గోపజనితా
గ్నులఁ బర్వఁగఁ జేసెఁ, గా
లాంతమునందు ద్వాదశ మ
హారవికాంతులు ప్రజ్వరిల్లున
ట్లెంతయు భ్రాంతియున్ భయము
నేర్పడరాక్షసకోటి కెల్లెడన్. 5

కం. చండతర ధూమకేతూ
ద్దండప్రభ లెల్లదిశలధర్షింపఁగఁ గో
దండము సగుణ మొనర్చెన్
దండితరాక్షస మఖండతాండవ మాజిన్. 6

శా. ఆకర్ణాంతముగా ధనుర్గుణముఁ దానాకృష్టముం జేసి, శూ
మూకన్ జెండఁగ బాణముల్ విడచె నాభోధారలై పర్వ, హా
హాకారంబులు మిన్నుముట్టెనవి; దేవారాతి సైన్యంబు లా
యూకారంబులుమాసి రక్తతిలలై వ్యాపించె యుద్ధావనిన్.

ఉ. ఎప్పుడు బాణమున్ దిగిచి,
మెప్పుడు నారినిగూర్చి పేడఁగా
నెప్పుడు సెయునో, యన నొ
కింతయెఱుంగఁగ రాకపోయినన్
జెప్ప దరంబుగాని యరి
సేనలఁ జుత్తునియల్ గనంబడన్
జెప్పఁగవచ్చె నయ్యదియె,
శ్రీరఘురాముని యుద్ధరీతులన్. 8

కం. ఇంద్రుఁడు పశుగణములకు ను
పద్రవమొనరించి మించుపగిదిని రాముం
డా ద్రాఘిష్ఠబలంబుల
విద్రుతమైరూపుసెడఁగఁ బృథివింగలిపెన్ 9

ఉ. అంతట రావణాసురుఁడు నాత్మబలాహతశేషసైన్య మ
త్యంతముభీతిఁ బాఱినను నందఱనొక్కటఁబిల్చి, మీరలే
చింతయునిర్భయాత్ములయి చేరుఁడు! చూడుఁడు! నాదు యుద్ధమున్
బంతముమీఱ రామనరపాలుని నొక్కత్రుటిన్వధించెదన్

కం. ఈరేడు జగంబులలోఁ
బోరన్ ననుదాకువాఁడె పూజ్యంబయ్యెన్
బోరెదను నేఁడుపండువు
గా, రామునితోడఁ దృప్తిగలిగెడుదాకన్. 11

మ. ఎదురన్ నిల్చిన క్రూరరాక్షసుని
దానీక్షించి, శ్రీరాముఁ డ
య్యదనుంగాంచి, ముదంబునందె, బల
విద్యానైపుణిన్ జూప, ని
య్యదె యోగ్యంబగు నాహవంబనుచు;
వా రారీతిఁగా నొండొరుల్
కదనంబుం బొనరింపనిల్చిరి,
బలోత్కర్షంబు దీపింపఁగన్. 16

వ. అంత నా సహస్రకంఠుండును. 17

మ. చతురుండౌచు మహోగ్రహోగ్రచకిత
జ్వాలావిధూమంబు, ని
ర్జితదేవాసురసంఘమున్ బ్రళయసం
క్రీడన్మహాకాళిభీ
యుతమైనట్టి గదాయుధంబును దురు
ద్యోగంబుగా, రామునిన్
హతమార్పన్ గుఱిపెట్టివైచె, నదియున్
వ్యాత్తాస్యమై పైఁబడన్. 18

తే. గీ. దాశరథి వచ్చుచున్న గదావిధంబుఁ
గాంచి, హుమ్మని బాణమొక్కటియె విడువ
నదియు నద్దానిఁ దునియలౌనట్లు సేసె
దానితోఁ బోరు తీవ్రతఁ దాల్చె నపుడు. 19

సీ. దైవాస్త్రమేసిన దైవాస్త్రమేసి, గాం
ధర్వంబునేయ గాంధర్వమేసి
రాముఁడా రావణాస్త్రములను వమ్ముసే
యంగ రక్కసుఁడు కోపాగ్నులురలఁ
బన్నగాస్త్రంబును బట్టివైవఁగ నది
బంగారునగలలోఁ బన్నగకమి
నై, విషాగ్నులతోడ నారామదేహంబు
గప్పి దిక్తటములఁ గ్రమ్ముకొనుచు

తే. గీ. నంబరమునిండి భీకరమై చెలంగ
దానిఁగాంచిన రాముఁడుఁ బూనికమెయి
గారుడాస్త్రంబు విడువఁ దమ్మారిశక్తి
నదియు నిస్తేజమై భగ్నమై నశించె. 20

ఉ. గారుడ మంత్రఁబోవక యె
కాయెకిరావణుఁజంపఁబోవ నా
క్రూరశరంబు నాతఁడు న
కుంఠితబాణపరంపరాహతిన్
వారణఁజేసి వెండి రఘు
వర్యునిపైని మహాస్త్రవర్షమున్
ధారలుగాఁగనేసి, యటు
దైన్యము నార్తిని బొందఁజేసినన్. 21

శా. న్యూనత్వంబనలేని రాముఁడును
రాహుగ్రస్తచంద్రుడుంబలెన్
దీనత్వంబుననిల్వ, దేవతలు మా
నిర్వాతముల్ బెగ్గిలం

గా, నివిశ్వముఁ బ్రోవ, నాబుధుఁడు
ప్రాజాపత్యమున్ రోహిణిన్
దానై యాక్రమణంబొనర్చెఁ బరమా
త్మప్రీతిఁ గాంక్షించుచున్. 22

సీ. ఉన్నతాధిక, తరంగోద్ధూత ధూమముల్
చెలఁగి సూర్యునిదాకె సింధువెల్ల
నత్తఱి నాదిత్యుఁ డాధూమకేతువుఁ
బొంది తానష్టరూపుఁడును, మంద
కరుఁడుఁ, గబంధాంక కాయుండునై తోఁచె
భల్లూకములు గార్దభములు, నక్క
డాప్చినరీతిగా నధమాధమగణంబు
లార్చె నాకాశంబు నంటినిండ

తే. గీ. నిట్టియుత్పాతములఁగాంచి నట్టిసురలు
రాక్షసుల పూర్వచేష్టాసమీక్షఁ జేసి
తిమతిమయదృష్టముల నెల్లఁ దలఁచికొనుచు
భయము దుఃఖంబుఁ గలుగ విభ్రాంతులైరి. 23

ఉ. అంతట రామభద్రుఁడు మహత్తరకోపభయంకరుండు రెం
డింతలు కన్నులెఱ్ఱవడి హెచ్చుగనిప్పులు గ్రక్కుచుండఁ, గా
లాంతకుఁడోచు, రావణుని నప్పుడ దగ్ధమొనర్చు కైవడిన్
ధ్వాంతము సర్వభూతములఁ బట్టఁగఁ గప్పెడె యుద్ధ
భూమిలోన్. 24

ఈ. ఆసమయంబునన్ రఘుకు
లాగ్రణి రావణుఁగాంచి, దీర్ఘని
శ్వాసలఁ గోపదీపిత భుజం
గముఁబోలు ధనుష్ను నెత్తి, నాఁ
డాపరణిన్ దశాస్యుని గ
ళాహతిఁ జేసిన తీవ్రబాణమున్
దీసి, గుణంబునన్ దొడిగె
దిక్తటముల్ గలుషై గనంబడన్. 25

వ. ఓయి భరద్వాజా! వెండియు వినుము. 26

ఉ. ఏతదమోఘబాణమును
నింద్రునకాదినొసంగె ధాత; త
త్ఖ్యాతమహేంద్రుఁడిచ్చె ముని
వర్యు నగస్త్యున కట్టిదాని, వి
ఖ్యాతినిగన్న రామునకుఁ
గాన్కనొసంగెను దానివాని, క్రూ
రాతతరాక్షసాధముల
నాదటఁ గీటడఁగింపఁగోరికన్. 27

వ మఱియు నట్టిదివ్యాస్త్రంబు శ్రీరాముని ధనువునం గూర్పంబడి ధూమంబుతోఁగూడిన ప్రళయాగ్నికీలవలెను ప్రజ్వలించు సహస్రకిరణుని చందంబునను ప్రకాశించె. అయ్యది యత్యంతవేగంబున సర్వశత్రువిజేతమై, పరరథగజ తురగ పదాతి వినాశకంబై, సహస్రాధిక పరిఘులను బర్వతం

బులను భేదించుటయందు శక్తిసామర్థ్యంబులు గలదినై,
నానావిధరక్తవిలిప్త స్వరూపంబున మేదోదిగ్ధమై యత్యంత
భయంకరంబగుచు, ధగద్ధగాయమాన తేజోవిశేషంబుల నల
రారుచుండె ఓ భరద్వాజా! కాకగృధ్రబక పిశాచాదులకు
మృష్టాహారంబుల నొసంగ సమర్థంబై, శత్రురాక్షస భయంక
రంబై, యాత్మానందప్రదంబైన యమ్మహాస్త్రముంబట్టి,
శ్రీరామభద్రుండును వేదోక్తవిధి నభిమంత్రించి, సహస్రకంఠ
రావణసంహారార్థంబు ప్రయోగించెనంత.

చ. ఘురఘురఘుర్ఘురధ్వనులఁ
గూడి శరంబది వ్యోమగామియై
పొరిపొరి యడ్డపాటు నసుర
పుంజముఁగూల్చుచు, నింద్రముక్తవ
జ్రరయరవమ్ములన్ జనుచు,
రావణునిన్ గదియంగ, వాఁడును
ద్ధురతరహుంకృతిన్ శరము
ధూర్తత దాపలికేలఁ బట్టియున్. 29

తే. గీ. దాని మోకాలిపైనుంచి ధ్వనులు సెలఁగ
విఱిచి ముక్కలుగాఁజేసి, కఱకురక్క
సుండు నిలచిన నద్దానిఁజూచి, రాఘ
వుండు విమనస్కుఁడయ్యె సమ్మోదమెడలి. 30

ఉ. రావణుఁ డంతటన్ దనప
రాక్రమమేర్పడ సింహాగర్జనల్
గావర మొప్పఁజేసి, క్షణ
కాలములోనె యమోఘబాణమున్
జేవదలిర్పనైవ, నది
శ్రీరఘురాముని వక్షభాగమున్
దా, వివరంబొనర్చి భువిఁ
దార్కొనియేగ రసాతలానకున్. 31

కం. ఆపగిది రామచంద్రుఁడు
నాపుష్పకమందె పడియు నచలుండైనన్
దాపసులున్ సురవర్యులుఁ
దాపంబుల నందినారు దయనీయముగన్. 32

శా. హా రామా! రఘురామ! హా జనకజా
త్మానందరామా! యటం
చారీతిన్ మునులున్ సురల్ భయమునన్
వ్యాత్తాస్యులై నిల్వ, వి
స్తారంబై గిరికాననోత్కరముతో
క్ష్మాదేవికంపించె, హా
హారావంబుల నెల్లభూతములు బా
హాటంబుగా ఘోషిలెన్. 33

కం. రావణుఁడప్పుడు పరివా
రావృతుఁడై నాట్యమాడె; నాకాశమునన్

దేవత లుల్కలఁ గురిసిరి
యావిధిఁ బ్రళయంబటంచు నార్చిరిమనుజుల్. ౩౪

తే. గీ. ఓభరద్వాజ ! రాముఁడట్లుండఁజూచి
శాంతిపారకులై మునీశ్వరులు పొగడ
జానకీదేవి సుస్మితాస్యమున నిలువ
నవ్వసిష్ఠాదు లచ్చెరువందినారు. ౩౫

కుసుమవిచిత్రవృత్తము :—

భరమగు పాపప్రలతులపెడన్
వరలెడు ధాత్రీవనితకు సౌఖ్య
స్థిరత నొసంగన్ సిరియగు సీతా
వరసతిఁతోడన్ వరలవె రామా !



# సహస్రకంఠరావణ సంహారము

కం. శ్రీమచ్ఛక్త్యాత్మకియా
భూమిజ నిహృదయసీమ మోదింపఁగఁ బ్ర
హ్మామహిమోపేతుఁడవై
క్షేమమ్మున మమ్ము నేలు శ్రీరఘురామా! 1

వ. ఓ భరద్వాజా! అట్టి మహాప్రళయ సన్నిభంబైన యాపమయంబున శ్రీరాము నవస్థంగాంచియు సీతాసాధ్వి చిద్విలాసినియై యుండుట యెల్ల భూతంబుల కాశ్చర్యంబు గలిగింప, వసిష్ఠ మహర్షియు నా సతీలలామంబుంగాంచి యిట్లనియె.

తే. గీ. అమ్మ! సీతమ్మ! నీ భావ మరయఁ దరమె?
యీసహస్రగళుండు తా నెట్టివాఁడొ?
రాముఁ డేమైనఁ జెప్పెనో? ప్రభునితమ్ము
లీవనచరులు మంత్రులు నెటకుఁజనిరొ? 3

శా. మాకుం జెప్పఁగదమ్మ! యున్నమునిస
మ్మానంబులన్ గొంచు, సీ
తాకల్యాణియు మారువల్కక యెటో
ధ్యానించి, శ్రీరామ దే

హాకారంబునుజూచి, వెండియును నా
త్మాక్షంబులన్ మూసి, తా
నేకాగ్రంబగు చిత్తమై మరల
నీక్షించెన్ ధరావల్లభున్. 4

మ. పరమోదారతఁ బుష్పకంబున ధను
ర్బాణంబులన్ వీడకే
వర తేజుండయి మూర్ఛనందిన
నిజస్వామిన్ సమీక్షించి, స
త్వర మా రామునిఁ గౌఁగిలించి, ముఖ
మంతన్ద్రిప్పి, క్రూరాసురో
త్కరనాట్యంబునుగాంచి గర్జనములన్
గావించి వైదేహియున్. 5

మ. మగసింగంబది నిద్రనుండఁగ
మదోన్మాదాన నల్లంత ద
ప్పగ నేనుంగులగుంపులాడఁగను
నోర్పున్లేక, వేవచ్చి యా
మగనిన్ దానొకవంకఁగాంచుచునె
సమ్యాల్ రీవి నేనుంగులన్
దగనీక్షించెడు సింహిచందమునఁ
గన్పట్టెన్గదా ! సీతయున్. 6

తే. గీ. జనకపుత్రికయీామె దాశరథిభార్య
యబల యనుభావ మేవారియాత్మలందుఁ

దోఁపకుండఁ బరాశక్తిరూపిణియయి
ప్రళయకాళియనన్ గనుపట్టెసీత 7

సీ. ఘనవిరూపమున నాకలిఁగొన్నదై, కోట
రములట్లువెలుఁగు నేత్రములతోడఁ
బొడవైన జంఘలన్ గడిదేఱి యత్యంత
భయముగల్గించెడు ధ్వానులతోడ
ముండమాలికలచే భూషితయై, యట్లు
కేరించు నసికింకిణులతోడ
గార్దభధ్వానుల వేగపరాక్రమంబులఁ
బొడము, వికారమౌ మొగముతోడ

తే. గీ. భుజచతుష్టయమున నొప్పుభూషణముల
దీర్ఘతర నాసికనుగల్గి దివ్యశీర్ష
మలర, నత్యంతదీర్ఘ జిహ్వాయునుప్రేల
నప్పు డయ్యాదిశక్తి సీతమ్మతోఁచె. 8

తే. గీ. ప్రళయమేఘాకృతింగల్గి పాశఘంట
ములధరించియు భీకరమూర్తియగుచు
నందఱునుజూచుచుండ మహాద్భుతముగ
క్షణములో సీతకాళియై గానుపించి. 9

కం. శ్రీరాము నచటవిడిచియు
నారావణరథముపైకి నతివేగమునన్
ఘోరమగు డేగవలెనే
చేరి, మహాకాళివానిసిడమున్ విఱిచెన్. 10

వ. అంతంబోక నాక్షణంబున. 11

ఉ. వేగమె రావణాసురుని
వేయిశిరంబులఁ ద్రుంచెఁ గోళ్ళఁ, దా
నాగతి రాక్షసాధముల
నందఱఁబట్టి శిరఃప్రఖండనో
ద్వేగముఁజూపె, నిర్దయమతిన్
మఱికొందఱ గర్భగోళపుం
బ్రేగులులాగిచంపె; నతి
భీకరరూపముదాల్చి యత్తఱిన్, 12

ఉ. భీకరకాలకర్కశ ర
విప్రభలొప్పు కరాళకాళికా
ప్రాకట రాక్షస ప్రళయ
భావ గభీరమహోజ్జ్వలాకృతిన్
భాకృతులన్ గడంగుచు న
పారపరాక్రమ మేర్పడంగ, న
జ్ఞాకలఁ గ్రూరరాక్షస శిరం
బులఁ ద్రుంచె నఖాగ్రపంక్తులన్. 13

సీ. ఒక్కొక్కరక్కసు నక్కడికక్కడే
రెండేసితుండెంబు లెండనెఱపి
రథగజతురగ సంరంభంబు లంతంత
నణగించి తుత్తునియలుగఁ జేసె

నొకగుంపుసిగలెల్ల నొక్కచేతనుబట్టి
మూఁకఁగా వెసఁద్రిప్పి భూమినేసెఁ
గొందఱిస్కంధంబులందు హుంకృతిమీఁకి
శిరములఖండించె పరుసమిగిలి

తే గీ. రాక్షసులనెల్ల నీరీతి నాక్షణంబు
యూఁచకోఁతఁగ రణభూమి నొరఁగఁజేసి
శాత్రవాంత్రాదు లాత్మభూషలుఁగఁజేసి
ప్రళయనాట్యంబొనర్చె దుర్వారసరణి. 15

క. అత్తఱి జానకీసతి ర
ణావని రావణరాక్షసాధమో
న్మత్తశిరఃప్రకాండముల
మస్తుగ హస్తములన్ ధరించి, పూ
మొత్తపు బంతులట్లు నఖ
పుంజములం దెగురంగ మీటుచున్
నృత్తమొనర్చుచున్ జెలఁగె
నింగినిఁ దా, వికటాట్టహాసయై. 16

కం. ఒంటిగ నచ్చటఁ బీనుఁగు
పెంటలపైఁ గేళిసలుపు వికృతాకృతికిన్
వెంటన్ సరియూడఁగ, వా
ల్గంటులకై మనసువోవ తక్షణకాలమునన్. 17

హరనర్తన వృత్తము —

అమ్మలెల్లర కమ్మరై
యహితమ్ములే సేయఁ గడంగు నీ
చమ్ములౌ నసురారిసం
చయముల్ విధ్వంసముగాఁగఁ, గ
ష్టమ్ము లెన్నఁటికైన జం
టగనుండదన్ దీక్షనుబూని, సీ
తమ్మ నీవెనువెంటనే
యలరెంగాదా! యటురాఘవా!



# పరాశక్తిక్రీడ

కం. శ్రీమద్రామకథాసుధ
నీమూఁడు జగంబులందు హితవిస్తృతమై
క్షేమములఁగూర్పఁ జేసిన
భూమిజ కేవేళ భక్తిమ్రొక్కెద రామా! 1

వ. ఓ భరద్వాజా! అవ్విధంబున నా పరాశక్తియైన సీతాదేవి తనతో సమానంబుగా నాట్యంబొనర్పంగోరి స్మరించినంతనే యామె ప్రతిరోమమునుండియు ననేకమాతృగణంబులు ప్రభావతి, విశాలాక్షి, శ్రీమతి, గోపాలి, ధ్రువరత్న, మహోమాడ, కామాక్షి, శోభన, మాధవి, జటోజ్వల గీతప్రియ కల్యాణీత్యాద్యనంతనామంబులతో సముద్భవించిరి. వెండియు వారియాకారవిశేషంబులం జూచిన దీర్ఘనేత్రములును, దీర్ఘదంష్ట్రిలును, స్వర్ణచ్ఛాయావిరాజిత గాత్రములును గలిగి నీలమేఘచ్ఛాయంగలవారును, ధూమ్రవర్ణమును, రక్తవర్ణమును, దీర్ఘకేశములును, బీతరక్తాక్షములును, హర్యక్షములును, గలవారలై, యుద్ధభూమి నా సీతామహాదేవితోఁ గ్రీడించుచుండిరి. ఓ భరద్వాజా! మఱియు వారివిశిష్టచేష్టాదికంబుల వక్కాణింతు నాకర్ణింపుము!

సీ. వాయుమనోవేగ వర్తనులై కామ
రూపాలఁ గొందఱు క్రూరరాక్ష
సానీక శిరముల హస్తములంబట్టి
కందుకక్రీడల గడఁగినారు
ముండమాలికలతో భూషితలై కొంద
ఱా రణభూమి విహారులైరి
రక్తమాంసవిశేష రంజితకర్దమ
మైన యాస్థలిఁ గొందఱాడినార

తే గీ. లందఱును గూడి సీత యమందగతిని
సకలభూతాళి భీభత్సచకితమగుచుఁ
బఱవఁ గ్రీడించెఁ, బ్రళయార్కపరిధిఁబోలు
నామహాయుద్ధభూమి నాహవముమాని. 3

సీ. ఆమహాదేవుల యంఘ్రిఘట్టనలచే
గడగడవడకె భూగర్భమెల్లఁ
నవ్వారిహస్త విన్యాసంబులను గిరుల్
గిఱగిఱదిరిగె నిబ్బరము లేక
తద్వేగజనిత ముద్యద్వాయువున వార్థి
ఘుమఘుమ ఘూర్ణిల్లి ఘోషమంటువారె
విప్పారియున్నట్టి వేణీప్రవేగానఁ
జరచర సురయాన సమితి చెదరె

తే. గీ. నాపరాశక్తి స్వేచ్ఛావిహారమైన
నినరథాశ్వము లటభీతి నెగిరి, కళ్ళె

ములను బటపటఁదెగఁజేసి బోరలెత్తి
యేడుదారులకున్ బారె గోడుమిగుల 4

కం సీతాదేవి పదసం
ఘాతముల భరింపలేని కాశ్యపియట్లున్
పాతాళమ్మునకున్ జన
నాతలిఁ దలఁపోసె నాత్మనందినఁదెన్ 5

శా. దేవిరూపము నాజగజ్జనని శక్తిన్
వేదశాస్త్రంబులన్
ధీనై శాబ్యముమీరఁ జెప్ప వినినానే
గాని, ప్రత్యక్ష ఘ
వావేశంబగుటెన్నఁ డేమెఱుఁగమబ్బా!
యంచుమహీంద్రులున్
దేవవ్రాతము, నామహాప్రళయమూర్తిన్
గాంచి భీతాత్ములై. 6

ఉ మోరలునాచి; కన్ను లఞ
మోడ్పులనందఁ, గరాంబుజంబులన్
వారనిభక్తినెత్తి, ప్రణ
వంబు నొకేధ్వనిగాజపించి, యా
శ్రీరఘురామరాజ్ఞని వి
శేషముగావినుతించి శాంతిమం
త్రారభటిన్ బటిష్ఠులయి
యట్లనిలంబడి రెల్లరయ్యెడన్ 7

తే. గీ. మాతృగణముల హుంకారమధ్య నపుడు
మానికృత శాంతివచనముల్ మాసిపోయె
నట్టిసమయాన దిక్పాలకాదిసురలు
'ప్రళయమిది' యంచు భావించి బయలువెడలి.

మ. పరమాహేశ్వరులై మహేశ్వరుని
సంప్రార్థింప నాతండు, స
త్వరమాశ్లిష్టపదారవిందముల
నంతర్ద్యోతుఁడై నిల్చి, యా
త్మరమన్ స్తంభనఁజేసి, భారవహుఁడై
ధాత్రిన్ గటాక్షింప, న
ద్ధరయున్ గ్రుంగకనిల్చె, నింతయు భ
రద్వాజా! మహాశ్చర్యమా. 9

వ. ఇంతసేసినను నా సీతామహాదేవీపాద ఘట్టన ధ్వనుల చేతను హుంకారంబులచేతను నూర్ధ్వలోకంబులు నిలువశక్తి లేనివయ్యె. భూర్భువాదిలోకంబులుంగూడ నద్దేవీనిశ్వాస పవనవేగంబుల కల్లాడం జొచ్చె. అట్టితఱి సర్వమానీంద్రు లును జగజ్జాలంబునకెల్ల హానిగలుగునేమోయని శంకాకులా క్రాంతమానసులై యుచ్చైస్స్వరంబుల శాంతివచనంబులం బలికిరి. 10

భుజంగప్రయాతవృత్తము —

భవద్దివ్య తేజః ప్రభావంబుచే ని
భువుల్ జీవులెల్లన్ బ్రమోదాన జీవిం
పవే ! నీచరిత్రంబు భక్తిన్ బఠింపన్
భవాబ్ధిన్ దరింపన్ శివంబౌను రామా !



# బ్రహ్మకృత దేవీస్తోత్రము

కం. శ్రీమత్తారకనామా !
రామా ! శరణార్థిభక్తరంజితచరణా !
భూమిసుతాహృదయాంబర
సోమ ! పరంధామ ! సత్యసుందరసీమా ! 1

తే. గీ. భయము భక్తియు నలర నా బ్రహ్మ యపుడు
పాకశాసనిమొదలు దిక్పాలురెల్ల
సరసనిలువంగ, నాజగజ్జనని శాంతి
నందఁగోరి నుతించె సాష్టాంగనతుల. 2

శా. మారామప్రియ ! జ్ఞానరూప ! జననీ !
మాహేశ్వరీ ! శక్తి ! యా
త్మారామా ! యతిలాలనా ! విమలత
త్త్వస్వామినీ ! సుస్వభా
వారమ్యా ! రవికాంతినిర్మలపదాబ్జా !
దేవి ! శ్రీవైష్ణవీ !
ధీరోదాత్తచరిత్రి ! సాధువినుతా !
దివ్యస్మృతీ ! జానకీ ! 3

ఉ. నీవలనన్ జగంబులు జ
నించిన వమ్మరో! కార్యకారణ
శ్రీవిభవంబు నీశ్వరుఁడుఁ
జెప్పఁగ, లేవుగదమ్మ! శాంతివి
ద్యావిషయప్రతిష్ఠలును,
నావినివృత్తియనంగ నాల్గుకో
భావహశక్తులున్ గలుగ
నాపరమేశ్వరి వైన దీవుఁడున్. 4

కం. నాలుగు వ్యూహమ్ములతో
లీలన్ వెలుఁగొందుచుండు, లీలామూర్తిన్
బాలింపవె శ్రీరాముని
తో లలనాధర్మదీక్షతో నీజగతిన్. 5

సీ. పరమేశ్వరుఁడు రాముఁ డరయనీపొందుచే
నందు నానందంబు స్వాత్మయందు
నిరుపమైశ్వర్యుఁడై నిగాసంబంధంబు
కలన వెల్గు నతండు ఘనత మీఱి
నీ మహామహిమచే నిఖిలభూతంబులు
వర్తింపఁజేయవే వసుధలోన
నఖిలేశ్వరుండు మాయామయపురుషోత్త
ముఁడు నాఁగ నొప్పు రాముఁడు సమస్త

తే. గీ. జగము లేలుచునుండు నీశక్తివలన
సకలమునునిండి వెలుఁగు నీశక్తియెల్ల

నిదునిర్నామములు గావె ! నిసులమ్మ
లమ్మ సీతమ్మ ! వందన మందుకొమ్మ 6

తే. గీ. శక్తియొకటి, పురుషుఁ డీశ్వరుఁడొకండె
పరమపురుషుఁడొకండె సర్వమును నిండి
శక్తిమంతుఁడు నానొప్పు సత్యమరయ
జేగ మాశివశక్తులం దేదియింక ? 7

తే. గీ. తల్లి ! నీవాదిశక్తివి, దాశరథియె
శక్తిమంతుఁడు నా, ఋషీశ్వరులు నిన్ను
భోగ్యురాలుగ, రాముని భోక్తఁగాఁగఁ
బలుకుదురు తత్త్వవేత్తలై భక్తిఁగలిగి. 8

సీ. మననమొనర్చు రామప్రభుఁ డెపుడునిన్
మతివొదువనరె శ్రీమతిని నిన్ను
నేకంబు సూక్ష్మంబు నెల్లెడవ్యాపించి
నట్టి కూటస్థంబు, నచల మధ్రు
వం బనంతంబును నజరంబు బ్రహ్మంబుఁ
బరము నిష్కలముఁ గేవలమునైన
నీ పరమపదంబు నిశ్చలయోగు లీ
క్షించుచుందురు, జానకీ ! త్వదీయ

తే. గీ. భక్తులగువారి సంసారబంధ మెడలఁ
జేయుచున్నావు, నీవిప్పు డీయఘాత్ము
రావణుని మూలమట్టముగా వధించి
యెల్లలోకాలకును సౌఖ్యమిచ్చినావు. 9

శా. తల్లీ! నీ ప్రళయాకృతిన్ విడిచి భూ
తవ్రాతసంరక్షణం
బెల్లన్ జేయఁగదే! యటంచు నిటు బ్ర
హ్మేంద్రాది సర్వామరుల్
గొల్లల్గా వినుతింప, నవ్వినయవా
క్పూరంబు లాలించి, సం
ఫుల్లాబ్జాక్షి తదీయవందనములన్
మోదించి గంభీరయై. 10

శా. ఓ దేవోత్తములార! శ్రీరఘుకులా
ధ్యుండైన నాభర్త, స
మ్మోదంబందక, యాసహస్రముఖుని
ర్మోషాస్త్ర దర్పాహతిన్
జైదంబీగియుఁ బుష్పకాహ్వయవిమా
నంబందు మూర్ఛిల్లఁగా
వాదంబేటికి? లోకశాంతి యెటులో
ప్పంజేతు నిప్పాటునన్? 11

ఉ. చేయుదు నీ చరాచరవి
శేషజగంబులనెల్ల ముద్దఁగా
నాయుదరాగ్ని కాహుతి య
నందగ వేల్చెద వానినెల్ల, న
త్యాయతభీకరాకృతి న
హర్నిశమున్ జరియింతు, నన్న హా!
హా! యని రాపితామహ ము
ఖామరవర్గము, భూమికంపిలెన్. 12

వ. ఆక్షణంబ యవ్విధాతయును దోఁగువకుచు నిద్రాది సముద్రదేవతలుంగూడ

తే. పుష్పకమునిఁ బడియున్న పుణ్యమూర్తి
రామమూర్తిని జేరి సంభ్రమముమీఱ
మృదులహస్తాబ్జములను దత్ప్రభుఁ సకల
మోహనంబైన దేహంబుఁ బుణికెనంత 14

కం. నిద్దురనుండి హఠాత్తుగ
నుద్దీపితుఁడై లేచినట్టు లుద్రేకమునన్
గద్దించి పలికె రఘువీ
రోద్దాముఁడు రాముఁడపుడు హుంకృతులనడిన్ 15

శా. ఓరీ! రావణ! నాశరాహతి రణో
ద్వేగంబు చల్లారఁగాఁ
జేరంబోయెదు కాలులోకమునకున్
శీఘ్రంబుగా, నంచుదు
ర్వారావక్రపరాక్రమోద్ధతిని భ్రూ
భంగంబుఁగావించి, తే
జోరమ్యంబు ధనుస్సుఁబట్టి నిలచెన్
సూర్యాన్వయార్యుండటుల్. 16

కం. ఎదురుగ బ్రహ్మాదిసురల్
బెదరకనుండుటను గనియు. సీతాసాధ్వీ
వదనముఁ గానక, యెదలో
నదవదపడి యిట్టునట్టు లాలోకింపన్. 17

వ. అంత నయ్యుద్ధరంగంబునందు శ్రీరామభద్రుండు 18

చ. తెఱచిననోటఁ బ్రేలుచు మ
　　దించిన యెఱ్ఱనినాల్కఁగ్రొగ్గి సం
బరమున నాట్యమాడుచును
　　బాహుచతుష్టయమందు ఖడ్గముల్
గురుతరమైనపుఱ్ఱెలు వి
　　లోలతి నొప్పి, శవస్వరూపుఁడౌ
హరుహృదయానవిల్చిన ది
　　గంబరకాళికఁగాంచె వెండియున్. 19

తే గీ నాల్కతో రక్తధారల నాకుచుండి
లోకభీకరమైన విలోకనముల
చండతవహించి దనుజుల రుండములను
మాలికలుగా ధరించిన కాళిఁగాంచె. 20

చ. అరయ భయంకరంబయి,
　　మహత్తరశక్తులతోడఁ గ్రీడలన్
జరుపుచు, రావణాహ్వయ
　　నిశాచరు వేయిశిరంబు, లప్పుడా
కరములఁబట్టి లీలమెయిఁ
　　గందుకవర్గముగాఁగ నాడు దు
ర్భరవిలయాంధకారనిభవ
　　ర్ణవికాసినిఁగాంచె రాముఁడున్ 21

కం. శాత్రవులఁజీల్చి యాంత్రము
లాత్రమ్మున హారములుగ నలరిచి, తా లో
కత్రాసమ్ముగ ఘర్ఘర
గాత్రధ్వనులెసఁగ మెలఁగెఁ గాళికయచటన్. 22

సీ. ధరణిఁగూలినయట్టి దానవదేహంబు
లింతింత మొండెముల్ వింతగొలిపె
రథగజతురగముల్ క్రథితంబులై యెల్ల
యెడలఁ దుత్తునియలై పడఁగనొప్పెఁ
గరచరణాదులం గలిగినరాక్షసుఁ
డొకఁడైనఁ జూప లేకుండనయ్యె
గళముల శిరములన్ గలుగునాభరణంబు
లట్టెయుండఁగఁ దలల్ మట్టువడియె.

తే గీ. నట్టి యాయుద్ధరంగంబు యమునిమంది
రంబనఁగనొప్పె, నాసహస్రగళు మొండె
మతిభయంకరమై యుండెనచట, రాముఁ
డన్నియునుజూచి యాశ్చర్యమందె మదిని. 23

ఉ. మాతృగణంబుతోఁగలిసి
మానకనృత్యమొనర్చుకాళికా
మాతృభయంకరాకృతి న
మాంతముగాఁగని, నేత్రపద్మముల్

మూతలుపడ్డఁ గంపమున
మూపుననున్నధనుస్సు బాణముల్
బాతళజారె, రాముని క
వారితభీరుత యావహిల్లఁగన్. 24

తే. గీ. ధాతయును రామమూర్తి విధంబుగాంచి
యచ్చెరువు నంది, జరిగిన యంతవిషయ
మిట్టులని చెప్పఁదొడఁగెఁ దా నెంతయేని
భక్తితాత్పర్యయుక్తి సంభ్రమముతోడ 25

శా. నీవున్ రావణబాణసంహతిని
దుర్నిద్రుండవై యుండఁగా
దేవిభావమునంది సీతయును
శక్తిం బూని ఖడ్గంబునన్
దేవారాతిసహస్ర శీర్షములఁ
దున్మెన్, దానితోఁబోక, యీ
దీపన్ రాక్షససర్వనాశ మమరన్
దీపించె నుగ్రాకృతిన్. 26

శా. రామా! యీరణభూమిపైఁబడిన శీర్ష
వ్రాతమున్ బట్టి, నీ
భామారత్నము వానిఁగందుకగతిన్
బల్మారుఁ గ్రీడించి, తా

నేమాత్రంబును దృష్టిలేనిదయి
సృష్టించెన్ స్వరోమావళీ
ధామంబేర్పడ మాతృకాగణముఁ
బ్రోద్యత్క్రీడలన్ దోడ్పడన్. 27

చ. అరయుమురామ ! యీమె జన
కాత్మజ, సత్తు నసత్తులేకయే
నిరుపమమైన యాసగుణ ని
ర్గుణ తత్త్వముఁగల్గినట్టి యీ
పరమపతివ్రతన్ భయవి
వర్జితదృష్టిని గాంచుమయ్య ! సం
బరమును బొందు; మీవు నిఁక
మాయఁదొలంగి వెలుంగుబుద్ధితోన్. 28

తే. గీ. బ్రహ్మదేవునిమాటల భావమెల్ల
నెఱిఁగి యాపురుషోత్తముఁ డీశ్వరుండు
రామచంద్రుండు భీతివిరహితచిత్తుఁ
డగుచు నానందమునఁ బొంగె నాత్మలోన. 29

ఉ. ఆ సమయంబునందుఁ బవ
నాత్మజుఁ డాహనుమంతుఁ డాత్మ స
ద్భాసదనంతభావమునఁ
దత్వమెఱింగియు దేహభావనా

వాసనఁదక్కి మైమఱచి
ప్రాంజలియై రఘురామ జానకీ
భాసురభవ్యతేజమున
భాగము తానొకఁడై వెలుంగఁడే! 30

ణీవృత్తము .—

హా రేరామా! యంచున్ హారవినుత నా
మా! యనుచు, సం
బరంబొప్పన్ నీపాదరజలవసం
పాదనరతిన్
సురేంద్రుల్ యోగీంద్రుల్ పగహృదయసం
శుద్ధిని సదా
పరంధామా! నీగానముల నొనరిం
పన్ వెలుఁగరే !



# శ్రీరాముఁడు దేవీస్వరూపమును సందర్శించుట

కం. శ్రీధార్మిక విగ్రహా! త
ద్బోధానందస్వరూప! మునిజనసేవ్యా!
సాధిత రక్షోధ్వంసక!
శ్రీధవ! భక్తార్తిశోష! శ్రీరఘురామా! 1

తే. గీ. వింటివిగదోయి! జానకీవిశ్వశక్తి
సంభరితదివ్యగాథను, సావధాన
భక్తిమెయి నింక నాపరాశక్తి మహిమ
నోభరద్వాజ! యాలింపుమోయినీవు! 2

వ. అని మఱియు నవ్వాల్మీకిమునిపుంగవుం డిట్లని చెప్పం
దొడంగె. 3

తే. గీ. అద్భుతాశ్చర్యభయవిహ్వలాత్ముఁడైన
రామచంద్రుఁడు జానకీరమణిఁ గాంచి
బ్రహ్మవాక్యముల నాలించి, భక్తినతులఁ
జేసి. యీరీతిఁ బలికె విశ్వాసమలర. 4

సీ. శశికళాలంకార సాంద్రదేహచ్ఛాయ
నలరారుదేహము నందిమించి
సువిశాలనేత్ర విస్ఫురదంజన వికాస
భాసురమ్మగు ముఖాబ్జమునమించి
గంభీరనాభీ ప్రకాశిత తనుమధ్య
మమర, విశాలవక్షమునమించి
భరమైన కచకుచోద్భ్రామితాభరణ ర
త్నప్రభాదీప్తి దిక్తటులమించి

తే గీ. సర్వభూత భయంకరోత్సాహివౌచు
ప్రళయనృత్యంబుగావించు రమణివివు
నీయథార్థస్వరూపంబు నీవెనాకు
నెఱుఁగఁజెప్పుము ప్రార్థింతునెంతయేని. 5

కం ఈవిధిఁ బ్రార్థించిన నా
దేవియుఁ గరుణాంతరంగదీపితమతియై
యావల నాపురుషోత్తముఁ
డౌ, విభు నారామభద్రు నరసి యిటులనెన్ 6

ఉ. ఆపురుషోత్తమాహ్వయుఁడ
వద్వయమూర్తివినీవు, నీమనో
వ్యాపకమౌ పరాప్రకృతినై
వెలుగొందెడు శక్తినేను, ధా

